అపరాధ పరిశోధన అనుబంధం—52

# తెలుగునవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## మిడతల దండు
రచన: వసుంధర

## మర్డర్ కాంట్రాక్ట్
రచన: మల్లేశ్వరరావు

## ప్రేమ సమాధి
రచన: అజీజ్

## పసుపురంగు కవరు
రచన: విద్వాన్ షీలాదేవి

'శాన్యోరా' సీరియల్ - 17 వ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—52
ఏప్రిల్, 1978
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి
సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

గెడా రంగారావు

# 'మిడతల దండు'

## వసుంధర

బ్యాంకులో ఆమె అడుగు పెట్టగానే చాలామంది ఆమెను చూశారు. ఒకసారి ఆమె వంక చూసిన వారు అప్రయత్నంగానే అలా వుండిపోతున్నారు. చాలా అందంగా వున్నదామె.

టైము రెండు కావస్తోంది. కొత్తవాళ్ళెవరినీ లోపలకు రాకుండా బ్యాంకు దగ్గర దర్వాన్ అడ్డేస్తున్నాడు. లోపల వున్నవారినందరనూ త్వరగా తెమిల్చి పంపేయడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి.

ఆమె ఎవరినీ ఏమీ అడగలేదు. బ్యాంకుకు వచ్చిన వారిని ఒక్కొక్కరినే గమనిస్తోందామె. అంతకు మించి వేరే పని వున్న మనిషిలా ఆమె కనపడడం లేదు.

అయితేయేం, అక్కడున్న చాలామందిని ఆమె ఆకర్షించింది. చాలామందికి ఆమెను చూడడం కాలక్షేపంగా వుంది ప్రస్తుతం. తనను గమనించేవారిని కూడా ఒక కంట కనిపెడుతోందామె జాగ్రత్తగా.

ఆమె బ్యాంకులోపల ఆవరణలో సుమారు అరగంట సేపు గడిపింది. లోపల వున్న చాలామందికి పనులై పోయినట్లుంది. ఒకరిద్దరు మినహాయించి అందరూ వెళ్ళి పోయారు.

అప్పుడే ఒక బ్యాంకు వుద్యోగి ఆమె చాలాసేపటి నుంచి అలా నిలబడిపోయిందని గుర్తించి—"మేడమ్, వాట్ కైనైడూ ఫర్ యూ—" అన్నాడు.

"మీరు నా కోసం ఏమీ చేయలేరు. పైగా నేను మీకో ఉపకారం చేయడానికి వచ్చాను" అందామె చిన్నగా నవ్వి.

ఉద్యోగి ఆమె వంక ఆశ్చర్యంగా చూసి "మీ రంటున్నది నాకర్థం కావడం లేదు..." అన్నాడు.

"మిడతలదండు తెలుసుగదా మీకు..." అందామె.

"మిడతల దండు గురించి తెలియని బ్యాంకు వుద్యోగి ఉంటాడా?" అన్నాడతను. కానీ ఈ అమ్మాయి హఠాత్తుగా మిడతల దండు ప్రసక్తి తీసుకురావడం అతనికి ఆశ్చర్యంగా తోచింది.

ఆమె స్వరం తగ్గించి—"నేను సి బి ఐలో పని చేస్తున్నాను. మిడతల దండుకు సంబంధించిన ఒక వ్యక్తిని అనుసరిస్తున్నాను. అతనిప్పుడు మీ బ్యాంకు ఆవరణలో వున్నాడు" అంది.

ఆ ఉద్యోగి ముఖంలో కలవరపాటు కనబడింది. ''అయిడెంటిఫికేషన్ చూపించగలరా?'' అన్నాడు.

ఆమె సందేహించకుండా తన జాకెట్లోంచి ఒక చిన్న కార్డుతీసి చూపించింది. అతనది చూసి తృప్తిగా తల పంకించి_''ఆ వ్యక్తి ఎవరో చెప్పండి?'' అని ఆ కార్డుని ఆమెకు తిరిగి ఇచ్చేశాడు.

''ఒకసారి మీ దర్వాన్‌ని లోపలకు పిలిచి ముఖం కడుక్కోమనండి. తర్వాత తమాషా చూడవచ్చు'' అంది ఆమె.

అతను సాలోచనగా చుట్టూ పరికించాడు. ఒకరిద్దరు బ్యాంకు వుద్యోగులు కుతూహలంగా తమ ఇద్దర్నీ పరికిస్తున్నారు.

అది ఒక ఏరియాలో ఆ బ్యాంకు ఏర్పరచుకున్న బ్రాంచి ఆఫీసు. అక్కడ స్టాఫు పన్నెండుగురు. వీళ్ళు కాక బ్రాంచి మేనేజరు, దర్వాను. ఆ ఏరియాకు చుట్టు పక్కల వుండేవన్నీ గొప్పవాళ్ళ ఇళ్ళు. వారిలో ఎక్కువ మంది నగలవ్యాపారులూ, వడ్డీవ్యాపారులూను. అందువల్ల ఆ బ్యాంకు ఎక్కువ టర్నోవర్‌లోనే నడుస్తూంది. ఆ బ్యాంకు లాకర్లలో చాలా విలువైన వస్తువులుంటాయని చెప్పుకుంటూంటారు.

బ్యాంకు వుద్యోగి గుమ్మం దగ్గరకు వచ్చాడు.

అక్కడ దర్వాన్ కూర్చుని వున్నాడు. ఆ దర్వాన్‌ని అతను రెండు సంవత్సరాలుగా ఎరుగును. మారువేషంలో మరొకవ్యక్తి అలా కూర్చున్నాడంటే అతనికి నమ్మకం కలగలేదు. నిజంగా అది మారువేషమే అయిన పక్షంలో

ఆ మేకప్ టెక్నిక్ చాలా గొప్పదే అయివుండాలి.

అతను ఆలోచిస్తూనే దర్వాన్‌ని మరికాస్త పరీక్షగా చూశాడు. అలా చూస్తే అతని ప్రవర్తనలో, చూపుల్లో అనుమానించవలసిన లక్షణాలు కనబడ్డాయి.

"ఓసారిలా రా!" అంటూ వుద్యోగి దర్వాన్ని పిలిచాడు. దర్వాన్ ముందు బయటకు చూశాడు. చుట్టుపక్కల జనసంచారం లేదు. అప్పుడతను లోపలకు చూశాడు. ఉద్యోగి తననే పిలుస్తున్నాడు. అతను చటుక్కున లేచి లోపలకు వెళ్ళాడు.

"ముఖం నిండా చెమటలు పోసేశాయ్—కాస్త చన్నీళ్ళతో ముఖం కడుక్కో" అన్నాడు ఉద్యోగి. దర్వాన్ ఆశ్చర్యంగా అతని వంక చూసి "డ్యూటీలో వుండగా ముఖం కడుక్కోను నేను. గుమ్మం దగ్గర కూర్చోవడమే నా డ్యూటీ. ఇప్పుడు ముఖం కడుక్కున్నా ఎండకు మళ్ళీ ఎలాగూ చెమటలు పట్టేస్తాయి..." అన్నాడు.

బ్యాంకు ఉద్యోగికి అనుమానం పెరిగింది. సి బి ఐ మనిషిగా తనను పరిచయం చేసుకున్న యువతి గుమ్మం దగ్గరకు నడవడం అతను చూడలేదు. అతనింకా దర్వాన్‌తో వాదించబోతూండగానే ఆమె హ్యాండ్ బాగ్ లోంచి ఏవో వుండల్లాటివి తీసి బ్యాంకులో విసిరేసి చటుక్కున తలుపులు మూసేసింది. ఆమె ముక్కుకు అడ్డంగా రుమాలు పెట్టుకుంది.

ఇటువంటిది జరుగనున్నదని ఎవరూ అనుమానించినట్లు లేదు. గదిలో ఏవో గ్యాసు వ్యాపిస్తోంది. జనం ఒక్కొక్కరే మూర్ఛపోతున్నారు. ఆమె యాక్టివ్‌గా రంగం

లోకి దిగింది. ఆమె చేతిలో ఇప్పుడు రివాల్వర్ కూడా వుంది.

బ్యాంకు మొత్తం నాలుగు భాగాలుగా వుంది. ఓ మాదిరి విశాలమైన హాలు. పబ్లిక్ ట్రాన్సాక్షన్సన్నీ అక్కడే. ఆ పక్కనే చిన్న ఇరుకైన గదిలో డ్రాఫ్టులు వగైరాలు తయారవుతాయి. ఆ తర్వాత గదిలో బ్యాంకు బ్రాంచి మేనేజరు కూర్చుని ఉంటాడు. ఆ వెనక గదిలో లాకర్లుంటాయి.

హాల్లో అందరూ మూర్ఛపోయారని గ్రహించి ఆమె లోపలకు వెళ్ళింది. గ్యాసు అక్కడివరకూ వ్యాపించింది. బ్రాంచి మేనేజరుతోసహా అందరూ మూర్ఛపోయారు.

అరగంటనుంచి ఆమె బ్యాంకులో ఏ యే తాళాలు ఎక్కడెక్కడున్నదీ వగైరా వివరాలు చూసుకుంటోంది. అందువల్ల ఆమెకు క్యాషు బాక్సులోంచి క్యాషు తీసుకోవడానికీ లాకర్సు మాస్టర్ కీ సంపాదించడానికీ ఎక్కువ సేపు పట్టలేదు.

ఆమె హ్యాండ్ బ్యాగులో చాలా లాకర్ తాళాలున్నాయి. మాస్టర్ కీనీ వాటినీ కలిపి ఉపయోగించి— చాలా లాకర్లు తెరిచి విలువైన వస్తువుల నెన్నింటినో సంగ్రహించిందామె. వజ్రాలను, రత్నాలను, నగలను తన హ్యాండ్ బాగ్ లోకి జారవిడిచింది. దానిలోంచే ఒక కాగితం మడతను తీసింది. దానిని విప్పిందామె. ఎంతో బరువును అవలీలగా భరించగల ఒకరకమైన ప్లాస్టిక్ తో తయారయిన సంచీ అది. చూడ్డానికి కాగితం సంచీలా వున్న దానిలో ఆమె వందరూపాయలనోట్ల కట్టలనూ,

హ్యాండుబ్యాగులో పట్టని విలువైన వస్తువులనూ చేర్చింది.

తర్వాత లాకరు తలుపులన్నీ యథాప్రకారం మూసేసింది. అన్నీ వాటి స్థానాల్లో వుంచేసి త్వరగా బ్యాంకు లోంచి బయటపడింది.

## 2

"ఏం కావాలిసార్!" అనడిగాడు సర్వర్. అతను చెప్పాడు. సర్వర్ వెళ్ళి రెండు గ్లాసులతో మంచినీళ్లు తెచ్చి అతని ముందు పెట్టాడు. చల్లటి మంచినీళ్ళు తాగుతూంటే అతనికి ప్రాణం లేచివచ్చింది. ఓ రెండు గుక్కలు తాగి అటూ ఇటూ చూస్తూ అతను తృళ్ళిపడ్డాడు.

సందేహం లేదు. నిన్నటి దినం తనతో బ్యాంకులో మాట్లాడినది ఆమే!

అతనికి ఆశ్చర్యం కలిగింది. గుండెలు తీసిన బంటులాగుంది ఆమె. నిన్న బ్యాంకులో పట్టపగలు అంతమంది ఎదురుగా దొంగతనం చేసి ఈరోజు ఏమీ ఎరుగని దానిలా హోటల్లో దర్జాగా కూర్చుని ఐస్‌క్రీం తింటోంది.

అతను నెమ్మదిగా తన సీట్లోంచి లేచాడు. బిల్లు కౌంటర్ వైపు నడిచాడు. అయితే అతని కళ్ళన్నీ ఆమెనే గమనిస్తున్నాయి. ఆమె అతన్ని ఏమాత్రమూ గమనించినట్లు లేదు. నెమ్మదిగా ఐస్‌క్రీం సిప్ చేస్తూ ఏదో ఆలోచిస్తూంది.

అతను కౌంటర్లోకి నడిచి-యాక్టై పైసలిచ్చి టెలిఫోన్ డయల్ చేశాడు. అదృష్టవశాత్తూ అవతలనుంచి ఎంగేజయి లేదు.

"హల్లో! ఇన్ స్పెక్టర్ చంద్రశేఖరంగారా! నమస్కారమండీ_రాజుని మాట్లాడుతున్నాను. ఆ దేనండీ_ నిన్న దోపిడీ అయిన బ్యాంకులో ఉద్యోగిని. నిన్న నన్ను మాటల్లో పెట్టి నాచేత దర్వాన్ ని లోపలకు పిలిపించిందన్నా నే ఆ అమ్మాయి యిప్పుడు ఊర్వశీ హోటల్లో ఐస్ క్రీం తింటోంది. ఇంకా ఎంత సేపుంటుందో తెలియదు. మీరు వెంటనే బయల్దేరి రాగలరా?...సరేలెండి. ఈ లోగా నేనామె హోటల్ దాటిపోకుండా చూస్తూంటాలెండి..." అని ఫోన్ పెట్టేశాడు. అతను చాలా నెమ్మదిగానే మాట్లాడినప్పటికీ కౌంటర్లో వ్యక్తికా మాటలు వినబడినట్లున్నాయి.

"ఎవరండీ ఆ అమ్మాయి..." అన్నాడు కుతూహలంగా.

రాజు తడబడలేదు. సూచనప్రాయంగా అతనికా అమ్మాయి కూర్చున్న చోటు తెలియజేసి__"ఎలాగో అలా కొంతవరకూ మీరామె హోటల్ వదిలి వెళ్ళకుండా చూడాలి" అని కోరాడు.

"అంత నాజూగ్గా అందంగా వున్న అమ్మాయి అపరాధి అంటే నమ్మబుద్ధి కావడం లేదు. మీరు పొరబడ్డారేమో!" అన్నాడు కౌంటర్లో వ్యక్తి.

"సరే మీరా అమ్మాయి నిప్పుడు చూశారుగదా! రేపెవరైనా ఆ అమ్మాయిని చూపించి నిన్నటి రోజంతా ఆమె హాస్పిటల్లో ఉందన్నారనుకోండి. పొరబడ్డానను కుంటారా?" అన్నాడు రాజు చిరాగ్గా.

"ఇంత అందాన్ని అంతలో ఎలా మరిచిపోతామండీ?"

"నా విషయంలోనూ అంతే." అని రాజు అక్కడ్నించి వెళ్ళి తన సీట్లో కూర్చున్నాడు. అప్పటికి అత నార్డరిచ్చిన ఊతప్పం వచ్చేసింది. అది నెమ్మదిగా తింటూ ఆ యువతినే చూస్తూ కూర్చున్నాడతను. అతని మెదడు ఊతప్పం రుచికి ఆనందించకుండా ఆమె ఎక్కడ కను మరుగైపోతుందోనని భయపడుతోంది.

అయితే ఆ యువతి అక్కడ్నించి అంత త్వరగా కదిలే ప్రయత్నంలో వున్నట్లు లేదు. ఆమె ఐస్‌క్రీమ్ తినడమయ్యాక ఫ్రూట్ సలాడ్‌కు ఆర్డరిచ్చింది. ఆర్డరిచ్చిన ప్రతీదీ చాలా నెమ్మదిగా తింటోందేమో ఇన్‌స్పెక్టర్ చంద్రశేఖర్ హోటల్లో అడుగు పెట్టే సమయానికి రాజు ఊతప్పం తిని కాఫీ తాగటం కూడా అయిపోయింది కానీ ఆమె ఇంకా ఫ్రూట్ సలాడ్ తింటూనే ఉంది.

రాజు పరిగెత్తుకుని ఇనస్పెక్టర్ని సమీపించి హడావుడిగా ఆమెను చూపించాడు. ఈ గొడవకు ఏదో కుతూహలం కలిగినట్లుగా ఆమె ఇనస్పెక్టర్నీ, రాజునీ చూసింది. అలా చూస్తున్నా ఆమె ఫ్రూట్ సలాడ్ తింటూనే వుంది. ఆమె చూపుల్లో ఏవిధమైన భయమూ, ఆందోళనా కనబడటంలేదు.

రాజు, చంద్రశేఖర్ ఆమెను సమీపించారు.

"మేడమ్! మీ పేరు తెలుసుకోవచ్చా?" అన్నాడు చంద్రశేఖర్.

"ఎందుకు?" అన్నదామె. ఆమె గొంతులో ఏ మాత్రమూ భయంలేదు.

"మీ ప్రశ్నకు సమాధానం ఈ హోటల్లో చెప్ప లేను. మీరు ఫ్రూట్ సలాడ్ తినడం అయేక మనం బయ టకు పోదాం-" అన్నాడు చంద్రశేఖర్.

"నేను ఫ్రూట్ సలాడ్ తినడానికింకా అయిదునిముషా లైనా పట్టవచ్చు. ఆ తర్వాత నేను హల్వాకు ఆర్డరిద్దా మనుకుంటున్నాను..." అందామె.

"అప్పుడు ఈ హోటల్లో ఇంతమందిముందు మిమ్మల్ని ఇబ్బందికరమైన ప్రశ్నలడగాల్సి ఉంటుంది. మీరు వెంటనే నాతో బయల్దేరివస్తే..."

ఇనస్పెక్టర్ మాటలను మధ్యలోనే ఆపి, "అడగ దల్చుకున్నదేదో ఇక్కడే అడగండి. హల్వా మానే యడం కంటే మీ మాటలిబ్బందికరంగా ఉంటాయని నేననుకోవడంలేదు" అందామె.

జంకు, గొంకు లేకుండా ఆమె అలా మాట్లాడుతూంటే చంద్రశేఖర్‌కు అనుమానం వచ్చింది. అతను అనుమా నంగా రాజువంక చూసి, "మీరు చెప్పదల్చుకున్నది చెప్పండి. అడగదల్చినది అడగండి" అన్నాడు.

రాజు గొంతు సవరించుకుని, "నిన్న మీరు మా బ్యాంకుకి వచ్చారు..." అన్నాడు. ఆమె అదోలా అతని వంక చూసి, "మా బ్యాంకంటే?" అందామె.

పేరు చెప్పాడు రాజు. విని నవ్వుతూ, "ఆ బ్యాంకుకు నేనెందుకొస్తాను? మా ఇంటికది చాలాదూరం. పైగా అందులో నా అకౌంట్ లేదు కూడాను..." అంది.

రాజు తెల్లబోయాడు. "అదంతా నాకు తెలియదు· నిన్న మీరు మా బ్యాంకుకు వచ్చి నాతో మాట్లాడేరు,

సి ఐ బి ఏజెంటునని నన్ను నమ్మించారు..."

ఆమె చురుగ్గా అతనివంక చూసి, "మీ రెవరో మీ వ్యవహారమేమిటో నాకు తెలియదు. కానీ మీ మాటలు మాత్రం మర్యాదగా లేవు. మీ బ్యాంకుకు రావలసిన అవసరం గానీ, సీ బీ ఐ ఏజెంటునని ఒకళ్ళని నమ్మించవలసిన అవసరం గానీ - నాకు లేవు. అలా చేయడంవల్ల నాకేం లాభం?" అంది.

"కొన్ని లక్షలు..." అన్నాడు కసిగా రాజు.

"హోటళ్ళలో ఫ్రూట్ సలాడ్సు, ఐస్ క్రీమ్‌లు, హల్వాలు ఆగకుండా తినవచ్చు..." అన్నాడు ఇనస్పెక్టర్ కోపంగా.

"మీలాంటి వాళ్ళుంటే ఆగకుండా తినడం ఎలాగా కుదరదు! నా ఫ్రూట్ సలాడ్ నీళ్ళు కారిపోయింది..." అందామె విసుగ్గా.

"బహుశా మిమ్మల్ని పోలీస్ స్టేషన్‌కి తీసుకువెళ్ళాల్సి ఉంటుంది. హల్వా తినడం మరీ అంత ముఖ్యమనుకుంటే పార్సిల్ కట్టించుకు తీసుకువెడదాం..." అన్నాడు ఇనస్పెక్టర్.

"మీ ముఖం చూస్తూంటే కాఫీ హోటల్లో నే ఏమీ సహించడంలేదు. ఇంకా పోలీస్ స్టేషన్‌కు కూడా హల్వా తెచ్చుకోవాలా కర్మ!" అందామె.

"అదే గొంతు. అదే మనిషి. నే నేవిధంగానూ పొరబడడంలేదు," తనలోతనే అనుకుంటున్నట్లుగా అన్నాడు రాజు. ఆమె ప్రవర్తనతో రాజుకు తనమీద తనకే నమ్మకం పోయిందని అనుకున్నాడు ఇనస్పెక్టర్.

"చూడండి ఇనస్పెక్టర్! ఇత నే బ్యాంకులో పని చేస్తున్నాడో నాకు తెలియదు. కానీ ఓ గంటనుంచి నా వెంటపడుతున్నాడు. ఇలా మగపిల్లలు వెంటబడడం నాకు కొత్తకాదు. కానీ పోలీసుల్ని తీసుకొచ్చి బెదిరించడం మాత్రం ఇదే ప్రథమం. నా అనుమానం మీరు డూప్లికేట్ పోలీసని. అలాంటి అనుమానం నాకున్నప్పుడు మీ జీపు నేను ఎక్కను. ఈ మధ్య ఇలాంటి మోసాలుచేసి అందమైన ఆడపిల్లల్నెత్తుకుపోవడం తరచుగా జరుగుతోంది..." అందామె.

చంద్రశేఖర్ ఆశ్చర్యంగా ఆమెవంక చూశాడు. నదురూ బెదురూ లేదు. తొణుకూ బెణుకూ లేదు. ఆ వయసులో, అందులోనూ ఆడపిల్లకింత ధైర్యముండడం అద్భుతమూ, అరుదూకూడాను.

"అటువంటి సందేహం మీకుంటే మనం నడిచే వెడదాము. కానీ తప్పించుకు వెళ్ళడానికి ప్రయత్నించకూడదు..." అన్నాడు ఇనస్పెక్టర్.

"అలా చేయవలసిన కర్మ నాకేంపట్టింది?" అందామె

ఆమె కౌంటర్లో బిల్లు చెల్లించింది. ఇనస్పెక్టర్ ఫోన్ చేసి తన జీపు గురించి ఏవో సూచనలిచ్చాడు. ముగ్గురూ రోడ్డుమీదకు వచ్చేక, "ఇప్పుడు స్టేషన్ దాకా ఎందుకు చెప్పండి? అడగవలసినవన్నీ స్పష్టంగా అడగండి. నా సమాధానాలు చెబుతాను..." అందామె.

ఆమె పేరు లత. ఆమెదీ ఊరుకాదు. రెండు నెలలైంది ఆమె ఈ ఊరొచ్చి. బియ్యే తప్పిందట ఎకనామిక్స్‌లో. ఆ సబ్జక్టులో ట్యూషన్ చెప్పించుకోవడానికి

ఊరు వచ్చిందిట. వేరేగది తీసుకుని వుంటోందిట. తన గది అడ్రస్ కూడా ఇచ్చిందామె. నిన్నటిదినం ఉదయం పది నుంచి సాయంత్రం మూడువరకూ సబకు చదువుతూ కాలక్షేపం చేసిందట. ఈ బ్యాంకు వ్యవహారమే తెలియదట ఆమెకు. రాజు మనసులోని ఉద్దేశ్యంపట్ల ఆమెకు చాలా అనుమానాలున్నాయి.

"ఎకనామిక్స్‌లో ట్యూషన్ కోసం ఇంత దూరం వచ్చారంటే ఆశ్చర్యంగావుంది..."అన్నాడు ఇనస్పెక్టర్.

"మిమ్మల్ని మా బ్యాంకులో నేనుకాక యింకా చాలామంది గుర్తుపట్టగలరు" అన్నాడు రాజు.

"అలా గుర్తుపట్టగలిగిన వారందరూ మీ బ్యాంకు ఉద్యోగస్తులే అయుంటారు. అయిదారుగు రుద్యోగులు తలచుకుంటే బ్యాంకులో ఏమైనా చేయవచ్చు. మీరు చెప్పినకథ వింటూంటే అంతా సహజంగా నేవుంది. ఒక్కనా రాక తప్ప! ఎందుకంటే ఒక్క ఆడపిల్లవల్ల అంత సాహసం సాధ్యపడదు. పథకంవేసి నిన్న దొంగతనం జరిగిపోయేక, నాలాంటి అన్నెంపున్నెం ఎరుగని అమాయకురాలి నిందులో ఇరికించడానికి కుట్రపన్నుతున్నారు" అంది లత.

ఇనస్పెక్టరు గతుక్కుమన్నాడు. ఇలాంటి అవకాశమొకటి ఉన్నదని తనకు స్ఫురించనేలేదని అతనికి అనుమానం వచ్చింది. అతను అదోరకంగా రాజువంక చూశాడు.

పరిస్థితి తనకు ప్రతికూలంగా మారేలాగున వున్నదని జుకు అనుమానం వచ్చింది.

"బ్యాంకుల్లో అటువంటివి సాధ్యపడవు. ఇటువంటిది ఇంతవరకూ ఒక్కసారికూడా ఏ దేశంలోనూ జరుగలేదు. ఉద్యోగుల్లో ఒకరిద్దరు ద్రోహులుండవచ్చునుగానీ— ఎక్కువమంది కలిసి బ్యాంకును దోచుకోవడం అసాధ్యం. ఈమెను మా బ్యాంకులో ఇంచుమించు అందరు వుద్యోగస్థులూ గుర్తించగలరు. అంతేకాదు. ఈమెను గుర్తించగల కస్టమర్ను పేర్లుకూడా కొన్ని చెప్పగలను..." అన్నాడతను ఆవేశంగా.

లత నవ్వి, "మీ కథ మీరు చెప్పారు. మరి నా కథ నన్ను చెప్పనివ్వండి. నేను నిన్న రోజల్లా నా ఇంట్లోనే ఉన్నానని నా వీధిలో జనమంతా ఏకకంఠంతో చెబుతారు. ఒకసారి నా గదికివచ్చి వెళ్ళండి. ఎటొచ్చీ పెద్ద మనుషుల్లా ప్రవర్తించాలి..." అంది.

ఇనస్పెక్టర్ క్షణం ఆలోచించి, సరేనన్నాడు.

ముగ్గురూ ఆమె గదికి బయల్దేరి ఓ పావుగంటలో అక్కడికి చేరుకున్నారు. లత తలుపు తాళం తీసి, చాప పరిచి, "కూర్చోండి" అంది. వాళ్ళు కూర్చుంటూ వుండగా స్విచ్ నొక్కి దీపం వేసిందామె.

చంద్రశేఖర్ పరిశీలించి ఆ గదిని చూసి, "ఈమె నిజమే చెబుతోంది" అనుకున్నాడు.

ఎకనామిక్స్‌లో స్పెషల్ కోచింగుకు ఆ ఊళ్ళోని రవీంద్ర ట్యుటోరియల్ కాలేజి పేరెన్నికగన్నది. అక్కడ చదువుకోవడానికి చుట్టుపక్కల చాలా ప్రాంతాలనుంచి విద్యార్థులు వచ్చి వెడుతూంటారు. రవీంద్ర ట్యుటోరియల్ కాలేజిలో లత గురించి అడిగి తెలుసుకోవాలని అతననుకున్నాడు.

"ఇంకా ఏమైనా సందేహాలుంటే అడిగి తెలుసుకో వచ్చు. ఈ ఇంటావిడ నేను చదువుకుంటూండగా మధ్యలో వచ్చింది. ఒంటిగంటనుంచి రెండు దాటేదాకా ఇక్కడే కూర్చుని కబుర్లు చెప్పింది. కావాలంటే అవిణ్నే ప్రశ్నలడుగుదురుగాని. పిలుచుకువస్తాను" అంది లత.

చంద్రశేఖర్ మొహమాటానికికూడా వద్దని అనలేదు. లత ఆ గదిలోంచి బయటకువచ్చి ఇంటివాళ్ళ తలుపు తట్టింది. ఓ కుర్రాడు తలుపు తీయగా, "మీ అమ్మగారున్నారా?" అనడిగింది. లోపల ఉన్నారని చెప్పాడా కుర్రాడు. లత లోపలకు వెళ్ళింది.

అయిదు, పది, పదిహేను, ఇరవై నిముషాలు గడిచాయి. చంద్రశేఖర్ గుమ్మంవంకే చూస్తున్నాడు. లత మాత్రమేకాదు. ఎవ్వరూ బయటకు రాలేదు. ఓపిక నశించేక అతను తిన్నగా ఆ ఇంట్లోకి ప్రవేశించాడు.

"ఎవరు కావాలండీ?" అనడిగాడు ముందుగదిలో కూర్చున్న ఓ కుర్రాడు. ఇనస్పెక్టర్ని చూసి అతను గతుక్కుమన్నాడు.

"లత!" అన్నాడు చంద్రశేఖర్.

"లత ఎవరు?" అన్నాడా కుర్రాడు ఆశ్చర్యంగా.

"మీ ముందుగదిలో అద్దెకుంటున్న అమ్మాయి..." అన్నాడు చంద్రశేఖర్.

"ఆ అమ్మాయి పేరు రాణి. లత కాదు..." అన్నాడు కుర్రాడు.

"ఏదో ఒకటి. ఇప్పుడే వస్తానని లోపలకు వెళ్ళింది. ఎంతకూ రాదేం?" అన్నాడు చంద్రశేఖర్.

"అమ్మతో మాట్లాడడానికి వెళ్ళింది. పిల్చుకు వస్తా నుండండి" అంటూ ప్రసాదు లోపలకు వెళ్ళాడు. మరు క్షణంలోనే ఓకావిడ హడావుడిగా వచ్చి "ఏమయ్యా బుద్ధిలేదూ, ఆడపిల్లని వేషాలేసుకువచ్చి బెదిరిస్తారా? గదిలో కాసేపు విశ్రాంతి తీసుకుందామనుకున్న ఆ పిల్ల హడలిపోయి దొడ్డిగుమ్మాన బయటకు వెళ్ళిపోయింది..." అంటూ చంద్రశేఖర్‌ని దులిపేసింది.

లత మాట్లాడిన పద్ధతి, వ్యవహరించిన తీరు చూసేక చంద్రశేఖర్ ఆమెను ఏమాత్రమూ అనుమానించలేక పోయాడు. ఈ విధంగా మోసంచేసి తప్పించుకుంటుందని ఏమాత్రం ఊహకు తోచినా తను అజాగ్రత్తగా ఉండే వాడు కాదు. ఇంటావిడ మాటలకతనికో క్షణం భయం కూడా వచ్చింది.

జరిగిన కథ క్లుప్తంగా ఆవిడకు తెలియబర్చి, "రాణి అనే పేరుతో మీ ఇంట్లో ఉంటున్న ఆ అమ్మాయి మళ్ళీ మీ యింటికి రాగానే పోలీసులకు అప్పగించవలసిన బాధ్యత మీది" అని చెప్పాడు.

"మిస్టర్ రాజా, ఆ పిల్ల చేయి దాటిపోయింది..." అన్నాడతను రాజాతో.

"అయితే ఇప్పుడేం చేయాలి?"

"పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేస్తాను. ఈ ఇంటిని ఓ ఇద్దరు కానిస్టేబుల్స్ కాపలాకాయాలని..."

"ఇంతకీ ఆ అమ్మాయి ఇంటావిడా నిన్న మాట్లాడు కున్నారుటా?" అనడిగాడు రాజా. చంద్రశేఖర్ చిరాగ్గా ముఖంపెట్టి, "మాట్లాడుకుని ఉంటే తప్పించుకుని

ఎందుకని పారిపోతుంది? నిన్న ఉదయం తొమ్మిదిగంటల తర్వాత మళ్ళీ రాత్రి ఎనిమిదిగంటలదాకా ఆమె గురించి వీళ్ళకేమీ తెలియదట. ఆ మధ్యలో ఎప్పుడు చూసినా తలుపు తాళంవేసే ఉన్నదట..." అన్నాడు.

చంద్రశేఖర్, రాజా కలిసి అక్కడికి దగ్గర్లో ఉన్న హోటల్లోంచి పోలీస్ స్టేషన్ కి టెలిఫోన్ చేయగా అవతల నుంచి, "ఇనస్పెక్టర్ చంద్రశేఖరమేనా?" అన్న ప్రశ్న వినబడింది.

"అవును..." అన్నాడు ఇనస్పెక్టర్.

"ఊర్వశీ హోటల్ ముందు మన జీపులేదని అక్కడకు వెళ్ళిన సబినస్పెక్టరుగారు ఫోన్ చేశారండి. మీరక్కడికి వెళ్ళారో తెలియక..."

ఇనస్పెక్టరు బుర్ర తిరిగిపోయింది. అతను అవతలి వ్యక్తిని క్షణం ఆగమని తను చెప్పదల్చుకున్నది చెప్పేసి, "ఇప్పుడే వస్తున్నాను" అనికూడా అన్నాడు.

జీపు ఏ విధంగా మాయమైందా అని అతను ఆలోచిస్తున్నాడు.

# 3

లత దొడ్డిగుమ్మందాటి సందులోకి వచ్చి అక్కణ్నించి అవతల రోడ్డు దగ్గరకు వెళ్ళేసరికి ఆమెకోసం అక్కడ పోలీసుజీపు సిద్ధంగా వుంది. ఆమె వెంటనే అందులో ఎక్కికూర్చుంది. వెంటనే జీపు అక్కణ్నించి కదిలింది.

ఆ జీపు తిన్నగా ఒకదారిని వెళ్ళలేదు. ఎన్నో సందులు ఎన్నో మలుపులు తిరుగుతూ అది చివరకు ఒక సందులోని బంగళాముందు ఆగింది.

లత జీపుదిగి తిన్నగా బంగళాలో ప్రవేశించబోయింది. ముందుహాల్లో కూర్చున్న ఒకవ్యక్తి "ఎవరు కావాలండీ" అనడిగాడు.

"శంకరదాస్ గుప్తా—"

ఆ మనిషి ఆశ్చర్యంగా ఆమెవైపు చూశాడు. శంకర దాస్ గుప్తా ఈ సమయంలో అక్కడుంటాడని చాలా తక్కువమందికి తెలుసు. ముందుగా అప్పాయింట్ మెంట్ లేనిదే అతనక్కడకి ఎవరినీ రానివ్వడు. ముఖ్యంగా ఇప్పుడు... ఈ సమయంలో...

"అలా ఆలోచిస్తూ నిలబడితే లాభంలేదు. అవతల నాకు చాలా అర్జంటు పనులున్నాయి. త్వరగా నేను గుప్తాజీని కలుసుకోవాలి" అసహనంగా అది లత.

"ఏమని చెప్పాలాయనకు?"

"చంద్రిక వచ్చిందని చెప్పు..."

అతను అక్కడే బల్లమీదవున్న ఇంటర్ కామ్‌తో ఫోన్ చేశాడు. అవతలనుంచి సమాధానం విని బాగా ఆశ్చర్యపోయినట్లు ముఖంపెట్టాడు. ఫోన్ పెట్టేసి ఆమె వంక గౌరవభావంతో చూసి "అలా కూర్చోండి" అంటూ మర్యాద చేశాడు. ఆమెవెళ్ళి దగ్గరగా సోఫాలో కూర్చుంది.

హడావుడిగా పరిగెత్తుకొంటూ వచ్చాడు శంకర్‌దాస్ గుప్తా. "ఆలశ్యానికి మన్నించాలి మేడమ్! మావాడు మీకు ట్రబులేమీ ఇవ్వలేదుగదా. ఇది నేను ముఖ్యమైన వస్తువులు దాచుకునే వేళ. ఈ సమయంలో యెవ్వరినీ ఇక్కడకు రానివ్వను. వచ్చినా నన్ను చూడనివ్వను. మీ సంగతి వేరనుకోండి..."

"ఒక్క క్షణం ఆగి నేను చెప్పేది వినండి గుప్తాజీ! మిడతలదండు మీయింటికి రేపు రాబోతుంది. మీకు సంబంధించిన ముఖ్యమైన వస్తువులన్నీ తక్షణం నాకు ఇచ్చేయండి. నేను పోలీసుల మనిషినని తెలియడం ఇష్టం లేదునాకు. అయినా కొన్ని జాగ్రత్తలకోసం ఈపూట పోలీస్ జీప్‌లో రావాల్సొచ్చింది. అదెక్కువసేపు మీ ఇంటి ముందాగడం మనకు మంచిదికాదు. ఈప్రాంతాల్లో మిడతలదండు మనుషులుండకపోరు."

గుప్తాక్షణం ఆలోచించి "ఒక్కసారి మీ ఐడెంటిఫికేషన్..." అంటూ నసిగాడు. లత వెంటనే తన జాకెట్లోంచి అయిడెంటిఫికేషన్ చూపించి, "త్వరగా ఆలశ్యం చేయకండి" అంటూ హెచ్చరించింది.

శంకర్‌దాస్‌గుప్తా ఆలశ్యం చేయలేదు. అయిడెంటిఫికేషన్ చూడగానే అతనికి తృప్తి కలిగింది. ఉత్సాహంగా లోపలకువెళ్ళి కొన్ని విలువయిన వజ్రాలు, రత్నాలు ఏరి ఒక సూట్‌కేసులో సర్దసాగాడు. అవి సర్దడం పూర్తి అయ్యేక మాత్రం అతని మనసుపీకింది.

ఒకటికాదు, రెండుకాదు...సుమారు డెబ్బయిలక్షలు విలువచేస్తుంది ఆ సూట్‌కేసు. కానీ అది ఈ అపరిచితురాలి చేతికివ్వక తప్పలేదు. పోలీసుజీపు, ఐడెంటిఫికేషన్ ఈరెండే తనకు ఈమెమీద నమ్మకం కలిగించే ఐటమ్స్. మోసం జరిగితే డెబ్బయిలక్షలు గోవిందా! అలాగని సూట్‌కేసు ఈమె కివ్వకపోతే—రేపు మిడతలదండు వచ్చి పడిందంటే....

గుప్తా సూట్‌కేసుతో బయటకు వచ్చాడు. ఈడబ్బు తను అన్యాయాలూ, అక్రమాలూ చేసి సంపాదించాడు.

ఇది పోయినంతలో తనకు కలిగిన నష్టమేమీ లేదు. మళ్ళీ ఇంతకుయింత సంపాదించగలడు. పోలీసులు కూడా తనను మోసంచేస్తే అది వేరే సంగతి. కానీ ప్రస్తుతానికివాళ్లను నమ్మడం మినహా వేరేగత్యంతరం లేదు.

అసలీమె పోలీసులకు చెందినమనిషి అవునా కాదా అన్న అనుమానంకూడా అతన్ని పీడిస్తోంది. కానీ గత నాలుగురోజులుగా తనకీమె దగ్గర్నుంచి ఫోన్ కాల్స్ వస్తున్నాయి. మిడతల దండునించి తన గుప్తనిధిని సంరక్షించగల శక్తి తనకున్నదనీ, తను సి.బి.ఐ.కు చెందిన మనిషిననీ ఆమె ఫోన్ లో చెబుతోంది. ఈరోజు మొదటి సారిగా తనామెను చూస్తున్నాడు.

"మిస్ చంద్రికా! అన్నింటికీ నిన్నే నమ్ముకున్నాను" అంటూ అతనామెకు సూట్ కేస్ అందించాడు.

"నన్ను నమ్మి చెడిన వారీలోకంలో లేరు. నన్ను నమ్మించడానికి ప్రయత్నిస్తేమాత్రం చెడిపోయేదిమీరే– ఈ విషయం గుర్తుంచుకుంటే చాలు" అంటూ సూట్ కేసు అందుకుంది లత.

# 4

"నమస్కారం శివప్రసాద్ గారూ!"

శివప్రసాద్ ఆ యువతివంక ఆశ్చర్యంగాచూసి— "ఎవరుమీరు?" అన్నాడు.

నవ్విందామె. "నాపేరు కల్పన. నన్ను మీరెరుగరు. కానీ నా అవసరం మీకుంది?"

"ఏమిటా అవసరం?"

"మిడతలదండునించి మిమ్మల్ని రక్షించడం."

శివప్రసాద్ ఉలిక్కిపడి "మిడతలదండు యేమిటో నాకు తెలియదు" అన్నాడు. అతని కళ్ళలో భయం స్పష్టంగా కనబడుతోంది.

"అన్నీ నాకు తెలుసు. నాదగ్గర మీరు భయపడ నవసరంలేదు. ఏమీ దాచనక్కరలేదు. నేనుండగా మిడతలదండు మిమ్మల్నేమీ చేయలేదు."

శివప్రసాద్‌కు నోటమాట రావడంలేదు. అతనికి ఒక హెచ్చరిక చెవిలో మెదుల్తోంది "మేము నిన్ను కలుసు కున్నట్లుగానీ మాట్లాడినట్లుగానీ మూడోవ్యక్తికి తెలి సిందా, ఈభూమ్మీద బ్రతకవునువ్వు" అది మిడతల దండుకు చెందినవ్యక్తి చేసిన హెచ్చరిక.

"మీకు నామీద నమ్మకం కలిగినట్లులేదు" అందామె.

"దయచేసి మీరెవరో కానీ వెంటనే వెళ్ళిపోండి. నేను ఇంతకంటే ఏమీ చెప్పలేను" అన్నాడు శివ ప్రసాద్.

"చందమామ ఇచ్చేయండి, వెళ్ళిపోతాను...." అంది కల్పన.

"చందమామ ఏమిటి?" అన్నాడు శివప్రసాద్ ఆశ్చ ర్యాన్ని నటిస్తూ.

కల్పన ముఖంలో కోపం తొంగిచూసింది. "మీకై మీరు మొండివాగో లేక మిడతలదండు మిమ్మల్ని బాగా భయపెట్టిందో తెలియడంలేదు. లేకపోతే మీరు కని పెట్టిన చందమామ మీకు తెలియక పోవడమేమిటి?"

"చందమామను నేను కనిపెట్టడమేమిటి?" అన్నాడు శివప్రసాద్ మొండిగా.

కల్పనచేతిలో రివాల్వర్ మెరిసింది. "మిస్టర్ శివ ప్రసాద్ మర్యాదగా చందమామనిస్తావా, యివ్వవా?" అంది.

శివప్రసాద్ కంగారుగా ఆమెవంకే చూస్తున్నాడు. అంతలోనే అతని కళ్ళు మెరిశాయి. కల్పన వీపుకు ఏదో బలంగా గుచ్చుకుంది. అది రివాల్వర్ మొన అని ఆమె గ్రహించగలిగింది.

"మిస్ కల్పనా! మిడతలదండును తక్కువ అంచనా వేసి ధైర్యంగా ఇంతవరకూ రావడం బాగానే ఉంది. నీ సాహసాన్ని అభినందిస్తున్నాను. కానీ వెంటనే రివాల్వర్ జారవిడిచేయ్" అన్న మాటలామెకు వినిపించాయి. ఆమె తక్షణం రివాల్వర్ వదిలిపెట్టేసింది.

"వెరీగుడ్!" అంటూ ఆమె వెనుకనున్న వ్యక్తి ఓ త్రాళ్ళకట్టను శివప్రసాద్ వేపు విసిరాడు. "మిస్టర్ శివ ప్రసాద్! త్వరగావచ్చి ఈమెను బంధించు."

శివప్రసాద్ కల్పనను కాళ్ళు చేతులు కట్టేసాక— "మీరేనా మిడతలదండుకు చెందిన వ్యక్తి. వినడమే కానీ చూసేభాగ్యం కలుగలేదు నాకు" అన్నాడు ఆ వ్యక్తితో.

ఆ వ్యక్తి మందహాసంచేసి "ఇంక జాప్యంచేసి లాభం లేదు. ఎంత జాగ్రత్తగా ఉన్నప్పటికీ మా వ్యూహాలు శత్రువు తెలుసుకుంటున్నాడు. చందమామనిలా తీసుకు రండి" అన్నాడు.

శివప్రసాద్ ఆలశ్యం చేయకుండా లోపలికి వెళ్ళి ఒక పుస్తకం తీసుకుని వచ్చాడు. దానిమీద చందమామ అని వ్రాసివుంది. లోపల అయిదు ప్రకరణాలలో చంద్రుడి

గురించిన సైంటిఫిక్ సమాచారముంది. ఆ వ్యక్తి ఒకసారి పరీక్షించి ఆ పుస్తకాన్ని చూసి తృప్తిగా తలాడించాడు.

"వెల్ డన్! శివప్రసాద్" అంటూ అతను శివ ప్రసాద్‌కు షేక్ హ్యాండిచ్చాడు. ఆ సమయంలో యేం చేశాడో, యేమో శివప్రసాద్ కుప్పలా కూలిపోయాడు.

అతను వెంటనే శివప్రసాద్‌ని పక్కగదిలోకి ఎత్తుకు వెళ్ళి మంచంమీద పడుకోబెట్టాడు. ఇవతలికి వచ్చి కల్పన కట్లు విప్పాడు.

"వెల్ డన్ మధూ! నీ పాత్రను బాగా రక్తి కట్టించావు. ఇంకో విధంగా అయితే చందమామ మనకుదక్కి ఉండేది కాదు" అంది కల్పన.

"మరోలా అయితే నాకూ సాధ్యపడేది కాదు. అంతా నీ మాస్టర్ బ్రెయిన్" అంటూ అభినందించాడు మధు.

# 5

"ఇదిచాలా తమాషాగా ఉంది" అన్నాడు పోలీసు కమీషనర్.

"తమాషామాట ఎలావున్నా డిపార్టుమెంటుకు పెద్ద యిబ్బంది వచ్చేలాగుంది. ఇది చాలా తికమక వ్యవహారం. మిడతలదండు గురించి ఏంచేయాలా అని ఆలోచిస్తుంటే పులిమీద పుట్రలా రంగంలోకి కొత్తదండు దిగింది" అన్నాడు డీయస్పీ.

నగరంలో డిపార్టుమెంటుకు చెందిన ప్రముఖులందరూ పరిస్థితిని సమీక్షించారు.

మిడతలదండు పేరుతో ఒకముఠా వెలసి యేడాది దాటింది. పంటచేలమీద ఒకసారి మిడతలదండు వాలి

లేచిందంటే యింక ఏమీ మిగలదు. మిడతలదండు మొత్తం ఆశయంకూడా అదే! ఒక సంస్థ నీదండు దోపిడీ చేయాలనుకుంటే ఆ సంస్థ సర్వనాశనం కావాలి. ఈ ఆశయంతో వెలసిన మిడతలదండు అసలు యెందుకు వెలసిందో అందులో సభ్యులెందరో యెవ్వరికీ తెలియదు.

మిడతలదండు ఒకసంస్థను సర్వనాశనం చేయాలని నిశ్చయించుకున్నాక ముందు లోపాయికారీగా కొన్ని హెచ్చరికలు చేస్తుంది. ఆ సంస్థ ఆ హెచ్చరికలను పాటించి తనను సంస్కరించుకోవాలి. అలా జరగకపోతే సంస్థకు సంబంధించిన కీలక వస్తువులు అపహరించబడతాయి. ఆ తర్వాత మిడతలదండు తను ఏయే కారణాల వల్ల ఏసంస్థను నాశనం చేయాలనుకుంటోందో బహిరంగంగా వాల్ పోస్టరు అంటించి ప్రజలకు తెలియజేస్తుంది. ఆసంస్థ ఆస్తి అంతా అపహరించబడాలి. వ్యక్తులందరూ హత్యకావించ బడాలి.

ఈ విషయంలో మిడతలదండుకు యెవరయినా సహాయ పడవచ్చు. సహాయపడిన ప్రతి ఒక్కడూ మిడతల దండులో సభ్యుడవుతాడు. అటువంటి వ్యక్తులనుగుర్తించ డానికి మిడతలదండుకు ప్రత్యేకమైన పద్ధతులున్నాయి.

పల్లెకూ, పట్నానికీ మధ్యరకంగా ఉండే వొక ఊళ్ళోని పాఠశాలను మిడతలదండు మొట్టమొదటిసారిగ యెన్నుకుంది. అది ఒక కమిటీ స్కూలు. యాజమాన్యం సరిగా ప్రవర్తించడం లేదని ఒక హెచ్చరిక పంపింది మిడతలదండు.

యాజమాన్యం దానిని లెక్క చేయలేదు. మిడతల దండు చెప్పిన ప్రకారం ఆ స్కూల్లో టీచర్లకు సరిగా

జీతాలివ్వడంలేదు. ఆడటీచర్లకూ, విద్యార్థినులకు సరియైన మానసంరక్షణ లేదు. విద్యార్థుల్లో అక్రమ ప్రవర్తన అక్కడ ప్రోత్సహించబడుతోంది. పేరుకి అది పాఠశాల అయినా విద్యార్థులక్కడ చదువుకోవడంద్వారా మంచి కంటె చెడు యెక్కువ నేర్చుకుంటున్నారు.

మిడతలదండు చివరిసారిగా హెచ్చరించింది. "త్వరలో ఈ పాఠశాల సర్వనాశనం కాబోతుంది. ప్రాణాలమీద ఆశగల ఉద్యోగులందరూ రాజీనామా లిచ్చేయండి."

ఈ హెచ్చరికనుకూడా ఎవ్వరూ లక్ష్యపెట్టలేదు. సరిగ్గా మరో వారంరోజులకు ఓ నలభయిమంది దారుణంగా హత్యగావించబడ్డారు. అందులో విద్యార్థులున్నారు ఉపాధ్యాయులున్నారు. ఇతర ఉద్యోగు లున్నారు, యాజమాన్యానికి చెందిన వారందరూ ఉన్నారు.

ఈహత్య పెద్ద సంచలనాన్నే కలిగించింది. పోలీసులు రంగంలోకి ప్రవేశించి మిడతలదండును పట్టుకోలేక పోయారు సరికదా దానిగురించి ఏవిధమైన ఆచూకీ సంపాదించలేక పోయారు.

ఈలోగా మిడతలదండు మరో పెద్ద పట్టణములోని చిట్ ఫండ్ సంస్థను ఇదేవిధంగా చిన్నాభిన్నం చేసింది. ఆతర్వాత ఒక బ్యాంకునీ, ఒక చిన్నకంపెనీని మట్టుపెట్టింది. మిడతలదండు పేరువింటే ప్రజలగుండెల్లో రైళ్ళుపరిగెత్తడం ఆరంభమయింది.

ప్రజల నైతిక జీవనంలో ఆరోగ్యకరమైన మార్పు తీసుకురావడమే తమ లక్ష్యమని మిడతలదండు ప్రకటించినప్పటికీ ఆచరణనుబట్టి అది నిజమనిపించడంలేదు. మిడ

తలదండు ఘోరాలకు యెందరో అమాయకులుకూడా బలి అయిపోయారు.

తమ మనుషులను కొందరిని మిడతలదండులో ప్రవేశ పెట్టాలని పోలీసు డిపార్టుమెంటు ప్రయత్నించింది. అలా వెళ్ళినవారిలో కొంతమంది ఆచూకీ తెలియలేదు. కొందరి శవాలు మాత్రం పార్శిల్లో పోలీస్ స్టేషన్స్ చేరాయి.

మిడతల దండు ఏదో విదేశానికి చెందిన ముఠా అనీ దేశంలో అల్లకల్లోలం సృష్టించడమే దాని ధ్యేయమనీ ప్రభుత్వం భావించింది. అయితే అదెంతవరకూ సరయి నదో ఇటీవల సంఘటనలు తెలియకుండా చేశాయి.

ఒకప్పుడు మిడతలదండు డబ్బు గురించి ఆలోచించేది కాదు. సంస్థలను సంస్కరించడమే దాని ముఖ్యాశ యంగా ప్రకటించేది. కానీ ఇటీవల బ్యాంకులనూ, ధనికులనూ కొల్లగొట్టడం మిడతలదండు ఆరంభించడంతో ఈ కేసులో ఏం చేయాలో పోలీసులకు తోచలేదు.

మిడతలదండు అసలు లక్ష్యం త్వరలో బయటపడ గలదనీ, ఈలోగా పోలీసుల ఆలోచనలను తప్పు దారి తొక్కించడం కోసం అది రకరకాలుగా ప్రవర్తిస్తూందనీ ప్రముఖులభిప్రాయ పడ్డారు.

అయితే పోలీసుల కృషి ఫలించకపోలేదు. వారి తాలూకు మనుషులు కొందరు మిడతలదండులో ప్రవే శించగలిగినట్లే తెలుస్తోంది. ముఠా ఆశయాలు మాత్రమే వారికి తెలుస్తున్నాయి. ఏం చేయాలో మాత్రమే వారికి తెలుస్తోంది. కీలక స్థావరమూ, అసలు మనుష్యులూ ఎవరికీ తెలియడంలేదు. అదీకాక మిడతలదండు సభ్యులు ఒకరికి

ఒకరు తెలియదు. ఎవరి మీద ఎటువంటి నిఘా ఉన్నదో తెలుసుకోవడం కష్టం.

మిడతలదండు సభ్యుడికి ప్రతివాడికీ ఒక నిర్ణీత స్థలముంటుంది. టెలిఫోన్, ఉత్తరం, కబురు వగైరా ఏదో సాధనంతో వారేం చేయాలో తెలియజేయబడుతుంది. సభ్యుడు పోలీసులకు సహాయపడుతున్నాడని ఏమాత్రం అనుమానంగా ఉన్నా దారుణమైన చావు చస్తాడు. చచ్చేక మిగతా సభ్యులకు ఆ వార్త అందుతుంది.

ఆ కారణంగా మిడతలదండులో చేరి ఇంకా బ్రతికి వున్న పోలీసులు అరిచేతిలో ప్రాణాలెట్టుకుని వుంటున్నారు. అయినప్పటికీ ఎలాగో అలా మిడతలదండు యొక్క భావి పథకాలు డిపార్టుమెంటుకి అందజేయగలుగుతున్నారు. ఈ సమాచారాన్నందుకుని తమ డిపార్టుమెంటు వ్యక్తులకు ఏవిధంగా సాయపడాలా అని ఆలోచిస్తున్నారు పోలీసు ప్రముఖులు.

ప్రస్తుతం పోలీసులకు తెలిసిన సమాచారం ప్రకారం మిడతలదండీ వూళ్ళో మూడు పనులు చేయాలనుకుంటోంది. ఆ వూళ్ళో శ్రీనివాసా బ్యాంకు వుంది. ఆ చుట్టుపక్కల ఓ పది పదిహేనూళ్ళలో ఈ బ్యాంకు డబ్బుకు సంబంధించిన వ్యవహారాలు నడుపుతోంది. చాలా మంది వ్యాపారస్థులకు బ్లాక్ మనీ దాచుకునేందుకు ఈ బ్యాంకు సహాయపడుతున్నట్లు మిడతలదండు ఆరోపించి ప్రథమ ప్రయత్నంగా ఆ వూళ్ళోని బ్రాంచిని నిలువు దోపిడీ చేయాలని నిర్ణయించుకుంది. ఈ నిర్ణయాన్ని చాలా రహస్యంగా వుంచింది మిడుతల దండు. బ్యాంకును పూర్తిగా దోచుకున్నాక అందులోని వ్యక్తులను అందర్నీ

చంపేయాలనీ—అప్పుడే తన పథకం బహిరంగం చేయాలనీ మిడతల దండు అనుకుంది. కానీ పోలీస్ డిపార్టుమెంటుకీ వార్త చేరింది.

మిడతల దండుకు సంబంధించిన రెండవ సమాచారం దేశంలోని అపూర్వ వజ్రాల గురించి. శంకరదాస్ గుప్తా అనే నగల వ్యాపారి దేశ దేశాలు తిరిగినవాడు. అతనివద్ద అపూర్వమైన వజ్రాలూ, రత్నాలూ వున్నాయనీ, వెల కట్టడానికి చాలా కష్టమైన రాళ్ళతనివద్ద వున్నాయనీ వదంతి వుంది. మిడతలదండు అవన్నీ సంపాదించాలని అనుకుంది. ఈ సమాచారం కూడా రహస్యమే అయినప్పటికీ పోలీసులకు చేరింది.

ఆ ఊళ్ళో ఒక టెస్టింగ్ లాబరేటరీ వుంది. పేరుకు టెస్టింగ్ లాబరేటరీ అయినప్పటికీ—అక్కడ డిఫెన్సుకి సంబంధించిన రీసెర్చి జరుగుతోంది. ఇది ఎవరికీ తెలియని రహస్యం. కానీ మిడతలదండు తెలుసుకుంది. ఆ లాబరేటరీ చీఫ్ అయిన శివప్రసాద్ ని డబ్బాశ చూపి లొంగదీసుకుంది. అతను లాబరేటరీ పరిశోధన ఫలితాలనన్నింటినీ కోడ్ లాంగ్వేజిలో రాసి చందమామ అని పేరు పెట్టాడు. ఎవరయినా ఆ పుస్తకం చదివితే చంద్రుడిని గురించిన వివరాలున్నాయనుకుంటారు. కానీ డీకోడ్ చేయగలిగితే ఇండియన్ డిఫెన్సుకు సంబంధించిన చాలా రహస్యాలున్నాయి. డిఫెన్స్ లో ఒక మెకానిజమ్ యింప్రూవ్ చేయాలంటే రీసెర్చి చేయాలి. రిసెర్చి యెందుకు? లోపాలను సవరించడానికి. ఏయే విషయాల్లో రీసెర్చి జరుగుతున్నదో తెలిస్తే ఏయే లోపాలున్నదీ సులభంగా తెలుసు

కోవచ్చు. ఈ వివరాలన్నీ చందమామలో వున్నాయి.

శివప్రసాద్ చందమామను తయారుచేశాడు కాని అతని మనసు దేశభక్తికీ, ప్రాణభయానికీ, ధనాశకూ మధ్య ఊగిసలాడుతుంది. ఇటీవలే మిడతలదండు అతనికో తేదీ యిచ్చింది. ఆ తేదీలోగా అతను చందమామను సిద్ధంచేసి మిడతల దండుకు అప్పగించాలి.

బ్యాంకు యాజమాన్యాన్నీ, శంకర్‌దాస్‌గుప్తాని, శివప్రసాద్‌ని మిడతలదండు రహస్యంగా హెచ్చరించడమేకాక — తమ హెచ్చరిక బయటపడడానికి వీల్లేదనీ, అలా జరిగితే హెచ్చరిక అందుకున్న ఆయా వ్యక్తులు సకుటుంబంగా నాశనమవుతారనికూడ హెచ్చరించింది. ఈ వార్తలు పోలీసు డిపార్టుమెంటుకు చేరాయి.

అయితే ఈ విషయంలో పోలీసులుకూడా బాగా తెలివితేటలు చూపించారు. మిడతలదండు గురించిన సమాచారం తమకు తెలిసినట్లు వారేమాత్రమూ బయటపడలేదు.

ఈ వివరాలన్నీ తెలిసిన సందర్భంలో ఏం చేయాలా అని ప్రముఖులందరూ ఆలోచిస్తున్న సమయంలో కొత్త సమస్య వచ్చిపడింది. ఒక ఆడపిల్ల మిడతలదండు చేయాలనుకున్న ఈమూడు పనులనూ చేసేసింది.

ఆ పిల్ల ఎవరు? మిడతలదండు ముఠాకి చెందినదేనా? లేక మరో కొత్తముఠా ఏదయినా బయల్దేరిందా?

పోలీసులు బాగా ఆలోచించి ఈ విధంగా అనుకున్నారు. ఆమెకు క్షుణ్ణంగా మిడతలదండు ముఠా పథకాలు తెలిశాయి కాబట్టి, ఆమె ఆ ముఠాకు చెందినదే అయుండాలి. పోలీసుల ఆలోచనలను తప్పుదారి

మళ్ళించడం కోసమని మిడతలదండు కొత్తముఠాని సృష్టించి వుండవచ్చు.

"ఏది ఏమయినా మిడతలదండు మనగురించి ఎక్కువ శ్రద్ధ తీసుకుంటున్నది. దానికి మనపై గౌరవం పెరిగింది. ఆ గౌరవాన్ని నిలబెట్టుకునే విధంగా మనం ప్రవర్తించాలి. మన ఆలోచనలను వాళ్ళు తప్పుదారి తొక్కిస్తున్నట్లే—వాళ్ళ ఆలోచనలను మనమూ తప్పుదారి దారి తొక్కించగలగాలి. అంతే ఒక్కటే ఉపాయం. మిడతలదండు సభ్యులు కొందరు మనవాళ్ళనే అనుమానం—ముఠానాయకులకు రావాలి". అన్నాడు పోలీస్ కమిషనర్.

# 6

ఏదో చప్పుడుకు ఒకరాత్రివేళ మెలకువ వచ్చిందామెకు. చేయిసాచి బెడ్ దగ్గరున్న లైట్ వేయబోయింది. ఎవరో ఆచేయి పట్టుకున్నారు.ఆ చేయి కర్కశంగావుండి పురుషుడిదని తెలుస్తూనే ఉంది. ఆమె తడబడకుండా—"ఆడదాని చేయి పట్టుకోడానికింత చీకటి కావాలా? దీపం వేస్తే నిన్ను చూస్తానని భయమా?" అంది.

మరుక్షణమే గదిలో దీపం వెలిగింది. ఆ వ్యక్తి ఆమె చేయి వదిలేసి "ఈ ప్రసాద్ అంటే సింహం. ఎవరికీ భయపడడు" అన్నాడు.

"గ్రామాల్లో గ్రామ సింహమంటారు. పట్నాల్లో నిన్నేమని పిలవాలో తెలియడంలేదు. పట్నసింహాంకంటే ఉత్తసింహామంటేనే బాగుంటుంది. సరేగానీ ఇందాక ట్నించీ లేని ధైర్యం ఇప్పుడెలా వచ్చింది? హఠాత్తుగా దీపం వేశావ్" అందామె.

ప్రసాద్ నవ్వి —"నీచేయి చాలా మెత్తగావుంది. ముఖం చూడాలనిపించి దీపం వేశాను. బాగున్నావు నువ్వు" అన్నాడు.

"నా బాగుకేంగానీ నీబాగు చూసుకో. ఇలా ఒంటరిగా నా దగ్గరకు రావడం మంచిది కాదు. ఇంతవరకూ ఇలావచ్చి ప్రతి ఒక్కడూ చెడిపోయాడు" అందామె.

"అయితే నేనెందుకొచ్చానో తెలుసా?"

"సి.బి.ఐ. మనిషిని, అన్నీ తెలుస్తాయి నాకు."

"బాయ్" అని నవ్వేడతను. "నీమాటలు విని నమ్మడానికి నేను బ్యాంకు ఉద్యోగిని కాను. శంకరదాస్ గుప్తాని కాను..."

"ఇంకో పేరు మర్చిపోయావేమో."

"నేను మర్చిపోయినా ఫరవాలేదు. గుర్తుచేసి మరీ అన్నీ నాకు అందిస్తావు" అని అదోలా నవ్వడం మొదలు పెట్టాడు ప్రసాద్.

"మిస్టర్ ప్రసాద్, ఈ క్షణంలో నేను నిన్ను పోలీసులకు పట్టించగలను. సిబీఐ మనుషులతో వేళాకోళం మాడటం నీ ఒంటికి మంచిదికాదు" అందామె తీవ్రంగా.

"బాయ్..." అని మళ్ళీ నవ్వసాగాడు ప్రసాద్.

ఆమె కొద్దిగా ఉద్రేకాన్ని ప్రకటించి "అయిడెంటిఫికేషన్ చూస్తావా?" అనడిగింది.

ప్రసాద్ నవ్వు ఆపబోయినవాడల్లా ఈమాటలు విని మరింత నవ్వడం మొదలుపెట్టాడు. తమాయించుకొన్నాక "నీ ఇష్టమొచ్చిన దేశానికి నన్ను గూఢచారి అనుకో. ఆ అయిడెంటిఫికేషన్ క్షణాలమీద చూపిస్తాను నీకు నేనూ" అన్నాడు.

ఈసారి ఆమెకూడా నవ్వి "పోనీలే, నేను సిబీవి మనిషిని కాను!" అంది.

"అలాగని ఊరుకుంటే చాలదు. మిడతలదండుకు క్షమార్పణ చెప్పుకోవాలి నువ్వు."

"దేనికి?"

"మిడతలదండు సొత్తును నువ్వు తీసుకున్నావు?"

"ఒక ఆడపిల్ల కష్టపడి సంపాదించుకున్నదాన్ని తన సొత్తుగా భావించడానికి మిడతలదండుకు సిగ్గులేదా?" అందామె తీవ్రంగా.

"నీకు చాలా పేర్లున్నాయని తెలుసుగానీ వాటిలో నాకు నచ్చినపేరు లత! కాబట్టి మిస్ లతా! వృధా ప్రసంగం ఆపి నువ్వు స్వాధీనం చేసుకున్న మా సొత్తును మాకు అప్పజెప్పి క్షమార్పణ అడుగు. ఆ విధంగా నీ ప్రాణాలు దక్కించుకుంటావు" అన్నాడు ప్రసాద్.

"ప్రాణాల గురించి మరీ యెక్కువగా మాట్లాడు తున్నావ్. మీ మిడతలదండులో వాళ్ళ సంగతి తెలి యదు కానీ నాకు ప్రాణభీతిలేదు. నా ముఠాలో నా లాంటివాళ్ళు పాతికమంది ఉన్నారు. నాకేమయినా జరి గిందో—వాళ్ళు మీ మిడతలదండును నిప్పులో వేలు స్తారు."

ప్రసాద్ స్వరం తగ్గించి "అయితే నీ ముఠా ఉద్దేశ్య మేమిటి? మేము తలపెట్టిన కార్యక్రమాలకే నువ్వూ పూనుకోవడంలో ఆంతర్యమేమిటి? తెలుసుకోవచ్చా?" అన్నాడు.

"నా సరివారితో కానీ నేను మాట్లాడను. నువ్వు అనుచరుడి జాతివాడివి. నాగురించి తెలుసుకోవాలను

ఉంటే నీ నాయకులను నా దగ్గరకు రమ్మను. నేనింకా ఈ హోటల్లో అయిదు రోజులుంటాను'' అంది లత.

''అంతవరకూ ఇన్‌స్పెక్టర్ చంద్రశేఖర్ కళ్ళబడ కుండా ఉంటే?'' అన్నాడు ప్రసాద్ వ్యంగ్యంగా.

లత ఈసారినవ్వి ''నువ్వు చాలా అమాయకుడిలా గున్నావు. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రంవేస్తే కావాలని ఆంజ నేయుడు కట్టుబడ్డట్లు నేనూ అంతే చేశాను. నీకు సర దాగా ఉంటే చంద్రశేఖర్‌కి ఫోన్ చేసి నా వివరాలు చెప్పు. సీబిఐ మనిషిని ముట్టుకోడానికీ కూడా ధైర్య ముండదతనికి'' అంది.

ప్రసాద్ తడబడి, మనసులో ''నీ సీబీఐ బంగారం కానూ'' అని మాత్రం అనుకున్నాడు. లత తనకు కొరుకు బడదని అర్థమయేక అక్కణ్ణించి కదిలాడతను.

# 7

లత ఆ హోటల్లో రెండురోజులుంది.

ఆ రెండురోజులూ ఆమె గదివదలి బయటకురాలేదు. ఆమెనుమాత్రం ముగ్గురు వ్యక్తులు కలుసుకొన్నారు. ముగ్గురూ మిడతలదండుకు సంబంధించినవారే.

తాము మిడతలదండు నాయకులమని ముగ్గురూ అన్నారు కానీ ఆమె రకరకాల ప్రశ్నలువేసి వాళ్ళు నాయకులన్న నమ్మకం తనకు కలగడం లేదని చెప్పింది. వాళ్ళు యెన్నో రకాల ఆమెకు నచ్చచెప్పడానికి ప్రయ త్నించి విఫలులై వెళ్ళిపోయారు.

రెండో రోజు సాయంత్రం ఆమెవద్దకింకో వ్యక్తి వచ్చాడు. అతనామెను సూటిగా ఒకే ఒక ప్రశ్న

వేశాడు—"నేను మిడతలదండు నాయకుడినని ఎలా నమ్ముతావు?"

"నీ స్థావరానికి తీసుకు వెడితే..." అని ఊరుకుంది ఆమె.

"నా స్థావరం తెలుసుకుని ఏం చేస్తావ్?"

"మిడతలదండు నాయకుణ్ని అంచనా వేస్తాను."

"వేసి?"

"పోలీసులకు అప్పగిస్తాను."

"నువ్వు పోలీసు మనిషివి కాదు..."

"మీరలాగనుకోవడమే నాకు శ్రేయస్కరం."

అతను అదోలా ఆమెవంక చూసి "నువ్వు అసాధ్యురాలిలాగున్నావ్. నువ్వు మాతోకనుక చేతులు కలిపితే" అన్నాడు.

"అది అంచనా వేసుకునేందుకైనా నా స్థావరం చూడాలి కదా..."

"నేను చూపిస్తేగానీ స్థావరం తెలుసుకోలేవా?"

"నన్ను అసాధ్యురాలని నువ్వే అన్నావు."

"అయితే నీకై నువ్వు నా స్థావరం ఎందుకు తెలుసుకోవడం లేదు?"

"ఆ అవసరం నాకు లేదు. మిడతలదండు రహస్యాలు నేను తెలుసుకోగలను."

"ఎలా?"

"ఎలాగేమిటి? నా అనుచరుల్నందర్నీ నేను విశ్వసిస్తాను. కానీ మిడతలదండు సభ్యుల్లో ఒకరంటే ఒకరికి నమ్మకం లేదు. నాయకుడికి తన అనుచరులమీద

నమ్మకం లేదు. అటువంటి వాళ్ళనుంచి సమాచారం లాగడం నా అనుచరులకు చాలా సులభం.''

''మిడతలదండు రహస్యాలు తెలుసుకోవలసిన అవసరం నీకేమిటి?''

''అది నీకెందుకు చెప్పాలి?''

''నేను నీకు సరివాణ్ని. మిడతలదండుకు నాయకుణ్ణి.''

''నన్ను నీ స్థావరానికి తీసుకువెళ్ళే ధైర్యం లేనివాడివి — మిడతలదండుకు నాయకుడని ఎలా విశ్వసించేది?''

''ఒకవేళ నా స్థావరమని ఏదోచోటుకు నిన్ను తీసుకు వెడితే...''

''ఆ భయం నాకు లేదు.''

''స్థావరం చూపగానే మాకంటే ముందుగా నువ్వు కాజేసిన ఆ వస్తువులు నా కందచేయాలి!''

లత నవ్వి ''చాలా బాగుంది. నీ స్థావరం చూపించిన వెంటనే నన్ను వదిలిపెడతావంటే నేను నమ్ముతానా? కొంతకాలంపాటు ఎలాగూ నన్నక్కడ వుంచేస్తావు!'' అంది.

''ఉంచకపోతే ..?''

''అది నీ స్థావరం కాదన్నమాట!''

''సెహభాష్!'' అన్నాడతను. ''నీ సహాయం మాక్కావాలి. ఒక ముఖ్యమైన విషయంలో నువ్వు తప్ప ఇంకెవరూ మాకు సాయపడలేరు. నిన్ను మా స్థావరానికి తీసుకెళ్ళడానికి నిశ్చయించుకున్నాను.''

లత ఏదో మాట్లాడబోయింది కానీ హఠాత్తుగా అతనామెకు బలంగా ఏదో వాసని చూపించాడు. ఆమెకు క్షణాలమీద స్పృహ తప్పింది.

# 8

"డియర్ కామ్రేడ్స్! నన్ను మీరు మన్నించాలి. అన్నింటికీ తెగించి నేనీమెను మన స్థావరానికి తీసుకొచ్చాను. ప్రస్తుతం ఈమెకు స్పృహ లేదు. ఈమెకు స్పృహ వచ్చేలోగా మీ అందరకూ కొన్ని విశేషాలు చెప్పాలి.

ఇంతకాలం మనం ఒకరి ముఖం ఒకరు చూసుకోకుండా పని చేశాము. అసలింతకాలమూ మనకు స్థావరమంటూ ఏదీ లేదు. ఆ విషయం చెప్పి ఈ లతను నమ్మించడం కష్టం. అందుకని అప్పటికప్పుడు ఒక స్థావరాన్ని సృష్టించాను. నా ముఖ్యానుచరులైన మీ పదిమందినీ ఇక్కడ సమావేశపరిచాను.

ఈ లతను గురించిన వివరాలు మనకు తెలియడంలేదు. తను పోలీసుల మనిషినని చెబుతూ చాలామందిని బోల్తా కొట్టించింది. గుండెలు తీసినబంటు అని నా అనుమానం. కొంతకాలంపాటు ఈమె మన స్థావరంలో వుంటుంది. వెయ్యి కళ్ళతో కనిపెట్టుకుని కాపాడాలి మనం. కళ్ళల్లో కారంజల్లి పారిపోగల శక్తి యుక్తులీమెకున్నాయి. మనకుపయోగపడుతుందనుకుంటే మనలో జేర్చుకుందాం. కాదనుకుంటే చంపి అవతల పారేద్దాం..." అని ఆగేడతను.

అక్కడున్న పదిమందిలోంచీ ప్రసాద్ ముందుకువచ్చి "ఏది ఏమైనా ఈమెను అభినందించాలి. ఇండతలదండు పేరుతో దేశాన్నో వూపు వూపుతున్న మనం ఈరోజు ఈమె కారణంగా ఒకరి నొకరం తెలుసుకోగలిగాం. మనమందరమూ పరస్పరం పరిచయం చేసుకుని మన అసలు ఆశయమేమిటో తెలుసుకుందాం..." అన్నాడు.

"నా పేరు వెంకట్రావు. దేశంలోని అవినీతికీ, అన్యాయానికీ నా కుటుంబం బలికాగా ఏకాకిగా మిగిలాను నేను. అవినీతి, అన్యాయం ధనవంతులతో ముడిపడి వున్నాయి. ప్రజలకు జరిగే అన్యాయం ప్రభుత్వంవల్ల కావచ్చు, ప్రభుత్వోద్యోగివల్ల కావచ్చు. కాని దాని వెనుకనున్న అసలు కారణం డబ్బు.

అందుకే నేనో నిర్ణయానికి వచ్చాను. దేశంలోని రాజకీయవాతావరణం మార్చాలి. దేశాన్ని నా గుప్పిట్లోకి తీసుకోవాలి. నేనంటే నేనొక్కణ్ణికాను. నాలా ఆలోచించి నాతో ఏకీభవించే ప్రతి ఒక్కడూ నాతో కలవచ్చు. ఇదే అభిప్రాయంతో మిడతలదండును ప్రచారం చేశాను. ఒకసారి నా ఆశయాలు బయటపడేసరికి ఎందరో నాకు సాయం చేయసాగారు.

అందర్నీ సభ్యులుగా స్వీకరించానుగానీ నాకు నాయకత్వం వహించడానికి భయం వేసింది. అప్పట్నించీ సభ్యులందర్నీ ఎంతో రహస్యంగా గమనించసాగాను. అలా గమనించి నాకు అండగా నిలవడానికి మీ పదిమందీ పనికివస్తారని నిశ్చయించుకున్నాను.

ఇంతకాలమూ మీరు నాకు చేసిన సహాయం అనన్యసామాన్యమైనది. ఇప్పుడు మన అసలు కార్యక్రమం వివరిస్తాను. మనం అతిత్వరలో మిడతలదండు పేరిట ఒక రాజకీయపక్షాన్ని ఏర్పాటు చేయబోతున్నాం. పీడిత ప్రజలకు ఆర్థికంగా సహాయపడబోతున్నాం.

ఇంతకాలమూ మనకీ వుద్దేశ్యమున్నట్లు ప్రభుత్వానికి తెలియదు. తెలియకుండా నేను చాలా జాగ్రత్తపడ్డాను. ధనికులకు మనం సింహస్వప్నం కాబోతున్నాం.

పేదప్రజలకు దగ్గర చుట్టాలం. వారి అభిమానంతో అతి త్వరలోనే దేశంలో విప్లవం తీసుకువచ్చి అన్ని రాజకీయ పక్షాలనూ సర్వనాశనంచేసి ప్రభుత్వాన్ని స్వాధీనం చేసుకుంటాం..." అతను ఆగాడు.

పదిమందిలో ఒకతను ముందుకు వచ్చి—"నా పేరు మురళి. నాకో చిన్న అనుమానముంది. మన పదిమంది వల్లనూ ఈ పని సాధ్యపడుతుందా అని నాకు సందేహంగా ఉంది!" అన్నాడు.

"అటువంటి సందేహం అవసరంలేదు. డబ్బుంటే ఏదైనా జరగవచ్చు. అందుకే మనమిప్పుడు ధనాన్ని సేకరిస్తున్నాం. ఒకటి కాదు, రెండు కాదు...వేలు కాదు, లక్షలు కాదు...కోట్లు...కోట్లకొద్దీ రూపాయలు పోగుచేసి మనం సుఖంగా జీవిస్తూనే పదిమందికీ సుఖ జీవనాన్ని ప్రసాదించాలి...ఇలా ప్రజల హృదయాల్లో స్థానం సంపాదించుకుంటే..."

"మన ప్రజలు మూర్ఖులు. మంచిచేసినవారిని గౌరవించడం వారికి చేతకాదు సరికదా వాళ్ళే మనని ప్రభుత్వానికి అప్పగించగలరు..." అన్నాడు జగన్నాథం పేరు గల వ్యక్తి.

వెంకట్రావు అతనివంక చురుగ్గా చూశాడు. "మన ప్రజలు మూర్ఖులన్న సంగతి నాకూ తెలుసు. అయితేవారి మూర్ఖత్వాన్ని మనమింకోవిధంగా వుపయోగించుకోవాలి. ఇప్పుడు ప్రభుత్వంలో వున్న రాజకీయపక్షం అదేచేసింది. కొంతకాలం తర్వాత మనమూ అదే చేయబోతున్నాము ఒకసారి మనచేతికి ప్రభుత్వం చిక్కితే—ఈ దేశంలో ఎన్నికలనేవి లేకుండా చేసేద్దాం..." అంటూ వెంకట్రావు తన నిర్ణయాలను వివరించి చెప్పాడు.

అతను చెప్పిన ప్రకారం భారతదేశానికి నియంతృత్వం కావాలని అతననుకంటున్నాడు. అతను మాట్లాడే పద్ధతినిబట్టి అది సాధించగల శక్తియుక్తులతనికున్నాయా అనిపిస్తోంది.

సుందరం అనే ఒకతను ముందుకు వచ్చి—"మీరు అన్యథా భావించవద్దు. మిడతలదండు ఎంతో చక్కగా ఆర్గనైజ్ చేసిన మీ ఆలోచనలు దేశాన్ని స్వాధీనం చేసుకోవడం విషయంలో మాత్రం సమగ్రంగా లేవు. మీది పసిబాలుడి ఆలోచనలాగున్నది" అన్నాడు.

వెంకట్రావు నవ్వి "మిడతలదండు పేరుతో సంచలనం కలిగించగలనని అనుకున్నప్పుడు కూడా కొందరు నన్ను ఇదేవిధంగా నిరుత్సాహపరిచారు. కానీ నిరుత్సాహానికి నాకూ ఆమడ దూరం. మీరే చూస్తూండండి. మనం ఎంత త్వరగా ముందుకు వెళ్ళబోతున్నామో..." అన్నాడు.

అతనింకా ఏదో అనబోతూండగా లత కదిలింది. ఆమె నెమ్మదిగా కాళ్ళూ, చేతులూ ఆడించి, కళ్ళు తెరిచి పరిసరాలు గమనించి వులిక్కిపడి లేచి కూర్చుంది.

"మిస్ లతా! మెలకువ వచ్చిందా?" అన్నాడు వెంకట్రావు.

"మెలకువ రావడానికి స్పృహపోయిన దెప్పుడు? నువ్వు మత్తు ఇవ్వడానికి ప్రయత్నించినప్పుడే నేనూపిరి బంధించాను..." అంది లత.

వెంకట్రావు ముఖం వివర్ణమైంది. "అయితే అంతా విన్నావన్న మాట!" అన్నాడు.

"అంతా విన్నానుకాబట్టి మనకు పరస్పర పరిచయా

లనవసరం. నానుంచి నువ్వేం సహాయం కోరుతున్నావో చెప్పు" అంది లత.

"నీ సామర్థ్యం తెలిసింది కదా. నువ్వు మిడతల దండుకు డబ్బు సంపాదించి పెట్టాలి."

"అలాగే కానీ ఆడదాని సంపాదనమీద ఆధారపడదామనుకుంటున్న మీరు_ నేను డబ్బు సంపాదిస్తూంటే ఏం చేద్దామనుకుంటున్నారు?"

సమాధానంగా వెంకట్రావు నవ్వాడు.

# 9

వీరభద్రం ఆ ఊళ్ళో పెద్దభూస్వామి. ఆయనా నలుగురు కొడుకులూ కలిసి సుమారు వంద ఎకరాల వ్యవసాయం చేస్తున్నారు. ఇప్పుడు హఠాత్తుగా ఆయన మనవడొకడు మాయమయ్యాడు. మాయమైన మర్నాడాయనకో వుత్తరం వచ్చింది.

"వందెకరాలున్నాయి మీకు. అన్నీ అడగం మేము. నీ ఇంట్లో అయిదుగురు మగవాళ్ళున్నారు నీతో కలిపి. మనిషికి రెండెకరాల చొప్పున మీ పాతేళ్ళలో అయిదుగురి పెంచుకుని మొత్తం పదెకరాలు దానంగా ఇచ్చేయి. నీ మనవడు నీదగ్గరకు సురక్షితంగా చేరతాడు. సందేహించావో ఒక్కొక్కడే ఒక్కొక్కడే చొప్పున నీ వంశం సర్వనాశనమవుతుంది___మిడతలదండు."

వీరభద్రం ఆ వుత్తరం చదువుకుని హడిలిపోయాడు. ఇంటిల్లపాదీ కలిసి సమావేశమై మరోదారి లేదని నిర్ణయించుకొని ఆ త్తరంలో వ్రాసినట్లే చేశారు. ఆయన మనవడాయనకు సురక్షితంగా చేరాడు.

అదే వూళ్ళో నాంచారయ్య వున్నాడు. అతను వడ్డీ వ్యాపారి. ఆ వూళ్ళో చిల్లర వ్యాపారం చేద్దామను

కుంటున్న నలుగురు పేదవాళ్ళకు నాంచారయ్య చేత తలో పదివేలూ యిప్పించింది మిడతల దండు.

ఆ వూరి ప్రెసిడెంటుకి నాలుగు భవంతులున్నాయి. ఒకదాన్ని గ్రామ పాఠశాలకు విరాళంగా ఇప్పించింది మిడతలదండు.

ప్రతి వూళ్ళోనూ మిడతలదండు సహాయక చర్యలు అధికమయ్యాయి. సామాన్య ప్రజలకు మిడతలదండు అంటే సద్భావం కలుగుతోంది. ధనికవర్గం మింగాలేకా, కక్కాలేకా నానా అవస్థా పడుతోంది.

ఆ సమయంలో ఒక నగరంలో కొత్త కట్టడం ప్రారంభమైంది. సుమారు పాతిక లక్షల వ్యయంతో నిర్మించబడుతున్న ఆ భవంతి మిడతలదండు ఆధ్వర్యంలో నిర్మించబడుతున్న మొత్తం పన్నెండుగురికి మాత్రమే తెలుసు. భవనం నిర్మించడానికి సంవత్సరం పట్టింది. అత్యద్భుతమైన ఆ భవనపు యజమానిగా ఒక యువతి ప్రవేశించింది. ఆమె పేరు స్వర్ణ.

ఇన్ కంటాక్సు డిపార్టుమెంటు రంగంలోకి ప్రవేశించింది. ప్రభుత్వం రహస్యపుటారాలు ప్రారంభించింది. దానినిబట్టి తెలిసిన వివరాలేవిటంటే స్వర్ణ అతిసామాన్యురాలు. ఆమె తలితండ్రులు సాధారణ జీవితం గడుపుతూండి ఈస్థాయికి వచ్చారు.

ఒక జమీందారు స్వర్ణనుచూసి ముచ్చటపడి ఈమెను పెంచుకున్నాడు. ఆయన చనిపోగానే ఆయన తాలూకు ఆస్తి సుమారు కోటిరూపాయల విలువచేసేది యీమెకు చెందింది. ఫలితంగా ఈభవనం నిర్మించబడింది. సంఘంలో అత్యున్నతస్థాయి వ్యక్తిగా జీవించాలన్నది స్వర్ణకోరిక.

అందుకే ఆమె ఈ అద్భుత భవననిర్మాణానికి తలపడింది.

లత మిడతలదండులో చేరినాక, ఒక సంవత్సరంలో సుమారు అయిదారుకోట్ల రూపాయలవరకూ సంపాదించి పెట్టింది. ఆమెశక్తి సామర్థ్యాలు వెంకట్రావుకు సంభ్రమాశ్చర్యాలు కలిగిస్తున్నాయి. అయితే ఆమెకు రెవరన్నా భయంలేదు. దేనికీ అదరదు, బెదరదు.

వెంకట్రావుకు కుడిభుజంగా వుంటూకూడా ఆమె తను పోలీసుల మనిషినని అంటూనే వుంటుంది. అందువల్ల అతనామెను వెయ్యికళ్ళతో కనిపెట్టవలసిందిగా తన అనుచరులను ఆదేశించాడు. అప్పుడప్పుడు లత పోలీసులతో మాట్లాడుతున్నట్లు ఆ అనుచరులకు అనుమానం వచ్చింది. అయితే అది తమను ఏడిపించడానికి ఆమె ఆడుతున్న నాటకమని అర్థంకావడానికివారికి కొద్ది రోజులు పట్టింది.

తనకు కావలసిన వారెవరికి ఫోన్ చేసినా ఆమె— "హలో పోలీస్ స్టేషన్ ఇన్స్పెక్టర్ చంద్రశేఖరం గారేనా మాట్లాడుతుంట. నేను, లతను మాట్లాడుతున్నానండీ" అంటూ ప్రారంభించేది. ఫోన్ అందుకున్న మిడతలదండు సభ్యుడు వచ్చి చెప్పే వరకూ ఆమెననుసరిస్తూన్న వ్యక్తికి బెంగగానే ఉండేది.

"అలాగని అజాగ్రత్తగా ఉండడానికి వీలులేదు. ఇలా నటించినటించి ఒకరోజున ఈమె నిజంగానే పోలీసులకు సమాచారం అందించవచ్చు" అన్నాడు వెంకట్రావు.

"అలా అని నేననుకోవడం లేదు. ఈమెది చిలిపి మనస్తత్వం" అన్నాడు మురళి.

"కావచ్చు, కానీ మన జాగ్రత్తలో మనముండాలి గదా!"

"ఆమె మనకు చేస్తున్న సహాయం సామాన్యమైనది కాదు. ప్రతిఫలంగా అనుమానించడమొక్కటే ఆమెకు మనమిస్తున్న కానుక" అన్నాడు మురళి బాధగా.

"ఇలాంటి సెంటిమెంట్లు పెట్టుకుంటే మనం మిగలం" అన్నాడు వెంకట్రావు.

మురళి మాట్లాడలేదు. అతను చాలా పర్యాయాలు లతననుసరించి వెళ్ళేడు. ఆమె చిలిపితనమూ, నిర్భయత్వమూ అతన్ని ఆకర్షించాయి. అతనామెను ప్రేమిస్తున్నాడు.

ఒకటి రెండు పర్యాయాలు తన ప్రేమనతనామెవద్ద చెప్పబోగా "నువ్వు ప్రేమిస్తున్నావని చెప్పినంత మాత్రాన నన్ను పూర్తిగా అర్థం చేసుకోగలననుకోకు. నేను యోగమాయను. ఎవరికీ అర్థంకాను" అని తేలిగ్గా తీసిపారేసింది. అంతకుమించి వివరంగా మురళికూడా ఏమీ చెప్పలేక పోయాడు. ఎటొచ్చీ అతని ప్రేమ బాధ్యతకు అడ్డురాలేదు. అతను జాగ్రత్తగా లతను కనిపెడుతూనే ఉన్నాడు.

ఒకరోజున వెంకట్రావు తన అనుచరులందర్నీ సమావేశ పరచి "నాకు ఇది అనూహ్యంగా ఉంది. లతను మీరు వేయికళ్ళతో కనిపెడుతున్నప్పటికీ పోలీసులకు మన గురించిన సమాచారం తెలుస్తూనే వుంది." అన్నాడు కోపంగా. అనుచరులందరి ముఖాల్లోనూ ఆశ్చర్యం స్పష్టంగా కనపడింది.

"మిడతలదండు బహుశా యెంతోకాలం నిలబడ

దేమో. ఎంతో జాగ్రత్తగా ఇంతకాలమూ మసలుకుంటూ వచ్చాము. ఇప్పుడు మన రహస్యాలు బయటపడడం నాకు నచ్చలేదు."

"ఏ రహస్యం బయటపడింది?"

"స్వర్ణపేరుతో వెలసిన కొత్తభవనం మిడతలదండు స్థావరమన్న రహస్యం."

"అయ్యబాబోయ్" అన్నాడు జగన్నాథం.

అది చాలా ముఖ్య రహస్యం.

"ఇప్పుడేం చేయాలి?" అన్నాడు ప్రసాద్.

"మీరందరూ ఒక్కొక్కరే ఆ భవనం చేరుకోవాలి. అక్కడ నేను మీ అందరకూ మన ముఖ్య కార్యక్రమం బయట పెట్టబోతున్నాను."

"ఇప్పుడేనా?"

"కాదు, ఎల్లుండి రాత్రి యెనిమిది గంటలకు."

"లత కూడా ఆ సమావేశానికి వస్తుందా?"

"ఆమె విషయంలో ఇంకా ఏ నిర్ణయమూ తీసుకో లేదు."

"రానివ్వండి. ఆమె మనతోపాటు వుండడమే మంచిది."

"మిస్టర్ మురళీ! లతపై నీకున్న నమ్మకం నాకు లేదు. కానీ సమావేశాని కామెను జతపరచడం తప్పనిసరి అను కుంటున్నాను. ఎందుకంటే మనమందరమూ సమావేశమై నప్పుడు ఆమెను వేరే బయట వదలదల్చుకోలేదు."

"ఇంత వరకూ ఆమె చందమామను మనకు అప్పగించ లేదు కూడా" అన్నాడు జగన్నాథం.

వెంకట్రావు సాలోచనగా, "చందమామకు ముహూర్తం ఎల్లుండి రాత్రి. అది మనకు దక్కకపోతే లతకు ప్రాణాలు దక్కవు" అన్నాడు.

# 10

ఆమె కెవ్వుమని అరిచింది. అతను త్వరగా పరిగెత్తాడు. మరోసారి నీటిలో మునిగి తేలిందామె. అతను సందేహించకుండా వెంటనే నీటిలో దూకాడు.

సరిగ్గా అయిదునిముషాలకు అతనామెను రెండుచేతు లతోటీ ఎత్తుకొని నది ఒడ్డుకు తీసుకువచ్చాడు. అక్కడ పడుకోబెట్టి ప్రథమచికిత్స ప్రారంభించాడు.

ఓ అయిదునిముషాల్లోనే ఆమె కళ్ళు తెరచి "నేనెక్క డున్నాను?" అంది. అప్పటికి నది ఒడ్డున మరికాస్తమంది జనం పోగయ్యారు.

"నా పేరు రాజారాం. అప్పుడప్పుడు ఇక్కడకువచ్చి పోతుంటాను. మీరెవరు?" అన్నాడతను.

"నా పేరు స్వర్ణ. అంతులేని సంపద ఉంది నాకు. ఒక్కత్తినీ డ్రయివ్ చేసుకుంటూ ఈనది ఒడ్డుకు వచ్చాను. స్నానం చేయాలనిపించింది. నదిలోదూకాను. హఠాత్తుగా ప్రవాహంలో పడిపోయాను" అందామె.

అది ఊరికి కాస్త దూరంగావున్న ప్రాంతం. సాధార ణంగా అక్కడ అట్టే జనముండరు. కానీ సెలవురోజు లలో పిక్నిక్‌కు జనం వస్తూంటారు. ఆరోజు సెలవురోజే కాబట్టి కాస్త జనం వున్నారు. ఒకొక్కరే పోగయి— జరిగింది తెలుసుకొని వెడుతున్నారు.

ఆడవాళ్ళు బట్టలు మార్చుకోవడానికి అనువుగా అక్కడ ఒక షెడ్డులాంటిది ఉంది. స్వర్ణ కారుదగ్గరకు

వెళ్ళి బట్టలు తెచ్చుకుని షెడ్లోకి వెళ్ళి మార్చుకునివచ్చింది.

అతను ఆమె వంక పరీక్షగా చూస్తూ—"చాలా అందంగా వున్నారు మీరు" అన్నాడు.

"ఇంత అందమూ మీ దయవల్లనే బ్రతికింది. మీ ఋణం తీర్చుకోలేను..." అందామె. ఆమె కళ్ళల్లో కృతజ్ఞత కొట్టవచ్చినట్లు కనబడుతోంది.

"అయితే నన్ను ప్రేమించగలరా?" అన్నాడతను చటుక్కున.

"ముందు కారెక్కండి" అంది స్వర్ణ ఏమీ చెప్పకుండా.

"నా ప్రశ్నకు సమాధానం దొరికితేగానీ కారెక్కను" అన్నాడు రాజారాం.

"జంటకోసం వెతుకుతున్నాను నేను. కానీ మిమ్మల్ని ప్రేమించగలనో లేనో ఈ క్షణంలోనే చెప్పమంటే కష్టం" అంది స్వర్ణ. "నాతో కారెక్కండి. మనం కలసి మెలసి స్నేహితుల్లా మసలుదాం. మన పరిచయం దానంతటదే ప్రేమకు దారితీస్తే ఏ బాధా లేదు."

"దారి తీయకపోతే..."

"ఏం చేస్తాం?" అంది స్వర్ణ.

"అప్పుడు నేనిదే నదిలో వురుకుతాను. నన్నెవ్వరూ రక్షించరు కూడా."

"కావాలని నీటిలో వురికినవాణ్ని రక్షించడం కష్టమే మరి!" అని నవ్వింది స్వర్ణ. "అయినా ముందు మన పరిచయం పెరగనివ్వండి. తర్వాత సంగతి ఆలోచిద్దాం."

"అలా అంటే ఎలా? అతనికి భవిష్యత్తు అంటే

చాలా భయం మరి..." అన్న మాటలు వినబడి రాజారాం, స్వర్ణ ఇద్దరూ వులిక్కిపడి అటు చూశారు. కారు వెనకనుంచి ఒక మనిషి వాళ్ళను సమీపిస్తున్నాడు. అతని చేతిలో రివాల్వర్ వుంది.

"ఎవర్నువ్వు?" అన్నారిద్దరూ అప్రయత్నంగా.

"మఫ్టీలో వున్న పోలీసినస్పెక్టర్ని. మిమల్నిద్దర్నీ అరెస్టు చేయడానికి వచ్చాను."

"ఎందుకు?"

"ఎందుకేమిటి? చేసిన నేరాలకు!"

"నీళ్ళలో పడిపోయిన అమ్మాయిని రక్షించడం నేరమని నాకు తెలియదే!" అన్నాడు రాజారాం.

"పోనీ బ్యాంకులు దోచడం, హత్యలు చేయడం నేరమని తెలుసా?"

స్వర్ణ ఆశ్చర్యంగా అతన్ని చూసి—"ఏమిటి మీరంటున్నది?" అంది.

"మిడతల దండు చేసిన అన్యాయాలూ, అక్రమాలూ అంత సులభంగా మాసిపోయేవి కాదు. అందుకు శిక్ష అనుభవించక తప్పదు."

"వీడెవడో పిచ్చివాడులాగున్నాడు. మఫ్టీలో వున్న ఇన్‌స్పెక్టరంటే నేను నమ్మను. వీడి మాటలు నాకేమీ అర్థం కావడంలేదు" అన్నాడు రాజారాం.

"అటువంటప్పుడు నేను చెప్పినట్లు చేయడమే మంచిది. పిచ్చివాడి చేతిలో తుపాకీ వుంది" అన్నాడు ఆ వ్యక్తి.

"ఏం చేయమంటావ్?"

"మర్యాదగా వూళ్ళోకి నడు. పారిపోడానికి ఏవిధ మైన ప్రయత్నాలూ చేయకు. నా రివాల్వర్ నైనా తప్పించుకోగలవు కానీ చుట్టూ వున్న పోలీసులను తప్పించుకోలేవు..." అన్నాడా వ్యక్తి. అతని మాటలు చాలా నమ్మకంగా వచ్చాయి.

విధిలేక ఇద్దరూ ముందుగా నడిచారు. వాళ్ళవెనకాలే అతను నడుస్తున్నాడు. దూరంగావున్న కొంతమంది ఈ సన్నివేశాన్నాశ్చర్యంగా చూశారు తప్పితే ఏమీ చేయ లేదు. ధైర్యవంతుడయిన ఒక విద్యార్థిమాత్రం ఈ ముగ్గు రికీ వీలయినంత దరిదాపుల్లోవుండి వీరి సంభాషణను నలు గురికీ వెళ్ళి చెప్పాడు.

వాళ్ళు ముగ్గురూ అలా నడుస్తూంటే వాళ్ళకుదూరంగా కొంతమంది మగవాళ్ళు వాళ్ళని అనుసరిస్తున్నారు. ఏం జరుగుతుందో చూడాలన్న కుతూహలం తప్పితే యింకే కారణమూ అనుసరించే ఆ మగవారికి లేదు. సరదాగా పిక్నిక్ కని వచ్చిన అక్కడి వ్యక్తులలో ఒక్క సాహసికుడుకూడా లేకపోవడం రాజారాం, స్వర్ణల దురదృష్టం.

కొంతదూరం అలా ముగ్గురూ నడిచేక వాళ్ళముందు ఒకజీపువచ్చి ఆగింది. అది పోలీసుజీపు అని చూడగానే తెలుస్తోంది. అందులోంచి డ్రెస్‌లోవున్న పోలీసులు దిగి మఫ్టీలోవున్న ఇన్‌స్పెక్టర్‌కి సెల్యూట్ చేశారు.

"వీళ్ళిద్దరకూ బేడీలు వేయండి"అన్నాడు ఇన్‌స్పెక్టరు.

తమను నడిపిస్తున్నది నిజంగా ఇన్‌స్పెక్టరేనని, తాము నడుస్తున్నది జైలు ప్రాంగణంలోనికనీ రాజారాంకీ, స్వర్ణకూ అర్థమయింది. అయితే ఇదంతా ఎలా జరిగిందో

అతనికర్థం కాలేదు. అతన్ని అనుసరించి వస్తున్న మధ్యమ సాహసికులు మాత్రం పోలీసు జీపుచూసేక తిరుగుముఖం పట్టేశారు ఎందుకయినా మంచిదని.

*　　*　　*

"మిడతలదండు నాయకుడి అసలుపేరు రాజారాం. అతను సామాన్యమైన వ్యక్తి. కానీ అతను ప్రేమించిన స్వర్ణ అనే అమ్మాయికి కోటీశ్వరుల జీవితంపై మోజు వుంది. ఆ అమ్మాయి అంటే రాజారాంకి పిచ్చిప్రేమ. ఆమె కోరికను తీర్చడానికతను నిశ్చయించుకున్నాడు. అతనికి వ్యాపారంచేసే తెలివితేటలులేవు. హత్యలూ, దొంగతనాలూ ఒంటరిగా చేస్తే ఏచిన్న పొరపాటువల్ల నయినా తను దొరికిపోవచ్చు. ఈ భయంతో అతను మిడతలదండు అన్నపేరు సృష్టించాడు.

కోట్లకొద్దీ రూపాయలు కూడబెట్టడమే అతని ఆశయమైనప్పటికీ దానికి ఓసంస్థ, ఆశయాలు—అంటూ రంగులు పూశాడు. అన్యాయాలూ, అక్రమాలూ జరుగుతున్నకొన్ని సంస్థలలోని కుళ్ళునతను బయటపెట్టి ఊరుకునేవాడు. ప్రజలను రెచ్చగొట్టే ప్రచారాలు చేసేవాడు.

దేశంలోని యువతరంలోని అమాయకులా విధంగా రెచ్చగొట్టబడ్డారు. వాళ్ళందర్నీ గుర్తించడానికీ, వాళ్ళకి ఆదేశాలివ్వడానికీ—తను బయటపడకుండావుండే రహస్య పద్ధతు లేర్పరచుకొని చాలా తెలివిగా వ్యవహరించాడు. అనుక్షణం అప్రమత్తుడై వున్న కారణంగా అతని అనుచరుల్లో చేరిన పోలీసువారికి తమ వ్యవహారాలు నడపడం చాలా ఇబ్బందిగా ఉండేది.

ఇతన్ని ఎదుర్కోవటానికి పోలీసుశాఖ సిబిఐ ఏజంట్

లతను నియమించింది. లత తను అందరికీ సిబిఐ ఏజంట్‌నని చెబుతూనే, మిడతలదండు వారికి తను పోలీసు శాఖతో సంబంధంలేని వ్యక్తినన్న నమ్మకాన్ని కలిగించడానికి చాలా తెలివిగా ప్రయత్నించి కృతకృత్యురాలయింది.

లత రంగంలో ప్రవేశించడంతో మిడతలదండు నాయకుడు కనీసం కొంతమంది ముఖ్యమైన అనుచరుల ముందు బయటపడక తప్పలేదు. తనపేరు వెంకట్రావని అతను వారికి అబద్ధం చెప్పాడు. అయితే అందరిదృష్టి లతమీద నేవుంది.

ఆ విధంగా మిడతలదండులో ముఖ్యుడుగా వుంటున్న పోలీసు మనిషి ప్రసాద్‌కు శాస్త్ర ఊపిరి పీల్చుకొనే సమయం వచ్చింది. అతను లతపై నిఘా పేరుతో వెంకట్రావుకు సంబంధించిన రహస్యాలు చాలా తెలుసుకున్నాడు. రాజారాం లేక వెంకట్రావు ఏదో దేశానికి సంబంధించిన గూఢచారి అనీ, ఆ దేశం వివరాలు తెల్సుకోవాలని ప్రభుత్వం అనుకోడంవల్ల అతన్ని కొంతకాలం పాటు ఉపేక్షించక తప్పలేదు.

ప్రసాద్ పరిశోధన ప్రకారం రాజారాంకు సంబంధించిన అసలు రహస్యం బయటపడింది. అతను యే దేశం కోసమూ ఈపనులు చేయడంలేదు. తన అనుచరుల్లో తన ముఖం తెలిసిన పదిమందినీ అతను హత్యచేయాలని నిర్ణయించుకున్నాడు. స్వర్ణకు ఆస్తి కలిసివచ్చినట్లుగా ప్రచారంచేసి, ఆమెను ప్రేమించినవ్యక్తిగా తను రంగంలోకి ప్రవేశించి శేషజీవితం హాయిగా గడిపేద్దామనుకున్నాడు.

తన అనుచరులను హత్యచేయాలన్న అతని పథకానికి

అవసరమైన సాక్ష్యాలు సంపాదించి, ఆ వివరాలు వారికి తెలియజెప్పి, ఆ తర్వాత వాళ్ళను పోలీసుల పాల్జేశాడు ప్రసాద్. స్వర్ణను నదిలోనుంచి రక్షించే నాటకం పూర్తయ్యాక పోలీసులు రాజారాంనీ, స్వర్ణనీ అరెస్ట్ చేశారు.

ఈ కేసులో ప్రసాద్, లతలు చూపిన ధైర్యసాహసాలను వర్ణించడం కష్టం. కానీ మన ప్రజలను చూస్తేనే జాలి వేస్తోంది. స్వార్థంకోసం ఏవో నీతులూ, ఆశయాలూ వల్లించే పరమ కిరాతకులనూ, దుర్మార్గులనూ వీళ్ళు అవలీలగానమ్మి సహకరిస్తున్నారు. వారికోసం తమ ప్రాణాలనూ, జీవితాలనూ త్యాగంచేస్తున్నారు.

తను కోట్లకొద్దీ కూడబెట్టాలని రాజారాం అనుకొని యువతరాన్ని రెచ్చగొడితే అందుకు అనుకూలముగా వాళ్ళు రెచ్చిపోయి ఎన్నోఘోరాలు చేశారు. ఏ దేశమూ పురిగొల్పకుండానే "చందమామ"ను సంపాదించి దాన్ని శత్రుదేశాలకు బేరంపెట్టాలని చూసిన దేశద్రోహి రాజారాం!

అటువంటి దేశద్రోహుల అసలురంగును గుర్తించి— హింసకూ, దౌర్జన్యానికీ పురిగొల్పే ఏ నాయకుడినీ గుడ్డిగా విశ్వసించడం మానేసి, మహాత్ముడు మనకు బోధించిన ధర్మసూత్రాలను ప్రతిపౌరుడూ పాటిస్తే, మన దేశానికీ ప్రగతిమార్గానికీ ఎంతోదూరముండదు. అటువంటి దినం త్వరలోనే రానున్నదని ఆశిస్తున్నాను..."

పోలీస్ కమిషనర్ ఉపన్యాసం పూర్తికాగానే అక్కడ చేరిన ప్రముఖులందరూ హర్షధ్వానాలు చేశారు.

—: ఐపోయింది :—

# మర్డర్ కాంట్రాక్ట్!

## మల్లేశ్వరరావు

ఫిబ్రవరి నెల సప్లిమెంట్ లోని వసుంధర నవల చదువుతూ సోఫాలో కూర్చుంది పార్వతి.

గణ గణమంటూ ఫోన్ మ్రోగింది.

పుస్తకం పక్కనపడేసి, రిసీవరెత్తి "హలో! పార్వతీ స్పీకింగ్" అంది.

"పార్వతీ! నేను అర్జంటుగా విశాఖపట్నం వెళ్ళాలి. సూట్ కేస్ సర్ది పెట్టి వుంచు. అరగంటలో యింటికి వస్తాను" శేఖరం గొంతు వినిపించింది ఫోన్ లో.

"నిజంగా వెళుతున్నారా?" అడిగింది భర్తను.

"అవును నిజంగానే."

"ఎందుకూ?" ఉన్నట్టుండి ఎందుకు వెళ్ళాలనుకుంటు న్నాడో అర్థంకాలే దామెకు.

"చిన్నపని వుంది."

"ఏమిటా పని?"

"అవన్నీ తర్వాత చెబుతాను."

"ఏం? ఎందుకో?"

"చెబితే వెళ్ళనివ్వవు గనుక."

"మళ్ళీ దొరగారు తిరిగిరావడం ఎప్పుడు?"

"చెప్పలేను."

"పోనీ, నేనూ మీతో వస్తాను. తీసుకెళ్ళరాదూ?"

"వద్దు."

"అంత సీక్రెటా? లేక నేను రాకూడనిదా?"

"రెండూ కాదు."

"మరి నేను కూడా వస్తే ఏం?"

ఒక్కక్షణం ఫోన్‌లో నిశ్శబ్దం.

"ఆల్‌రైట్! సిద్ధంగా వుండు. నేను రాగానే కార్లో ఎక్కిపోవాలి..."

"ఓ.కే." అంది. ఫోన్ క్లిక్‌మంది.

పార్వతి ఫోన్ పెట్టేసింది.

నగరంలో పెద్ద బిజినెస్ మాగ్నెట్‌లలో ఒకడైన రాజశేఖరం భార్య పార్వతి. అతని స్వస్థలంలోని వ్యాపారమే గాకుండా, విశాఖపట్నంలో ఒక బ్రాంచి వున్నది. ఆ బ్రాంచిని అతని ప్రాణమిత్రుడైన పరాంకుశం చేతిలో పెట్టేడు. పరాంకుశం తెలివితేటలమీద, వ్యాపార నిర్వహణా చాతుర్యంమీద అతనికి నమ్మకం వుంది. అందు

కనే సంవత్సరానికోసారి విశాఖపట్నం వెళ్ళి పుస్తకాలు చూసి వస్తుంటాడు. అదీ నామకానికే!

పార్వతి సూట్ కేస్ సర్దడంలో మునిగిపోయింది.

అరగంట తర్వాత యింటిముందు కారాగింది.

కారాగిన వెంటనే ఇంటికి తలుపుతాళం వేసుకువచ్చి రాజశేఖరం ప్రక్కన కూర్చుంది పార్వతి. డ్రైవరు సూట్ కేస్ తీసుకువచ్చి లోపల పెట్టేడు.

ఏర్ పోర్టువేపు దూసుకుపోయింది కారు.

## 2

సరిగ్గా నాలుగ్గంటలకి విమానం గోపాలపట్నం ఏర్ పోర్ట్‌లో ఆగింది.

రాజశేఖరం వెలుపలికొచ్చేడు. టాక్సీనిపిలిచి సూట్ కేస్ అందులో పడేసి ఎక్కేడు. పార్వతి అతని ప్రక్కన కూర్చుంది.

"సీతమ్మధార" అన్నాడు.

టాక్సీ రివ్వున దూసుకుపోసాగింది. యిరవై నిము షాల్లో టాక్సీ తమ బంగళాముందు ఆగింది. ఫేర్ చెల్లించి యిద్దరూ దిగేరు.

బంగళాముందు కారు ఆగడంతో నే నౌకరు రంగయ్య పరిగెత్తుకుంటూ వచ్చేడు.

కార్లోవున్న సూట్ కేస్ అందుకుని బంగళాలోనికి తీసుకువెళ్ళాడు రంగయ్య.

రాజశేఖరం, పార్వతి సోఫాలో కూలబడ్డారు. 'హమ్మయ్య' అని నిట్టూర్చింది పార్వతి.

ఎన్నడూ రాజశేఖరం యింత ముభావంగా వుండడం

చూడలేదు పార్వతి. అందుకే ఆశ్చర్యపోతోంది. అతని మౌనానికి కారణమేమిటో తెలియడంలేదు.

"ఏమండీ! నేను స్నానంచేసి వస్తాను," అని లేచింది పార్వతి.

"వెళ్ళు. నాకు ఓ చిన్నపని వుంది. యీలోగా అది పూర్తిచేసుకుని వస్తాను."

మాట్లాడుతూనే లేచి మొహం కడుక్కున్నాడు. కాస్త టాయిలెట్ అయి, మెట్లుదిగి బంగళాలోనుంచి బయటపడ్డాడు. తలుపులు మూసి మేడమీదకు వెళ్ళింది పార్వతి.

టాక్సీ ఆపి ఎక్కాడు రాజశేఖరం.

# 3

ఉదయం ఎనిమిది కావస్తూంది.

పోలీస్ జీప్ సీతమ్మధార బంగళాముందు ఆగింది. జీప్ నుంచి పోలీస్ డాక్టర్, వేలిముద్రల నిపుణుడు, ఫోటోగ్రాఫర్, నలుగురు పోలీసులు దిగేరు, యిన్స్పెక్టర్ సుధాకర్తో సహా.

అందరూ పోర్టికోదాటి లోనికొచ్చేసరికి దాదాపు ఏభైయ్యేళ్ళ ముసలిమనిషి వారికి ఎదురొచ్చేడు. అతడి వేషధారణబట్టి అతడు నౌకరని యిట్టే పోల్చెయ్యవచ్చు. అతని కళ్ళల్లో ఆందోళన, బాధ, భయం ద్యోతకమౌతున్నాయ్.

"శవం ఎక్కడ?" రొటీన్ డ్యూటీ మొదలుపెట్టేడు సుధాకర్.

"పైన, రెండోగదిలో...రండి చూపిస్తాను" అంటూ పైకి దారితీసేడు నౌకరు.

సుధాకర్‌తో పాటు అందరూ అతన్ని అనుసరించేరు.

పైన...గది అంతా అధునాతనంగా వుంది. ఖరీదైన ఫర్నిచర్, గోడలమీద శృంగారానికి సంబంధించిన అందమైన ఫోటోలు, కళ ఉట్టిపడుతున్నట్టుండే నగ్నశిల్పాలు అంతా శోభాయమానంగా వుంది. బెడ్‌లైట్ వెలుగుతూ వుంది.

ఆ గది మధ్యలో పెద్ద మంచం వుంది. దానిమీద వెల్లకిలా, మంచానికి అడ్డంగా పడున్నాడు రాజశేఖరం. కాళ్ళు సగానికి పైగా నేలమీదికి వేళ్ళాడుతున్నాయి. గుండె ప్రాంతంలో రక్తపుగాయం కనిపిస్తోంది. దాన్ని బట్టి పిస్తోలువలన మరణం సంభవించిందని తెలుస్తోంది.

పరిసరప్రాంతంలో హత్యాయుధమేదీ కనిపించలేదు. హంతుడు కాలు తగిలి టేబిల్ మీదున్న టీపాయ్ నేలబడి పగిలినట్టుంది.

శవం ముందు నిలబడి పరీక్షగా చూసేడు. హతుడి కళ్ళల్లో ఆశ్చర్యం స్పష్టంగా కనిపిస్తోంది. దాన్నిబట్టి అతనేదో విపరీతాన్ని చూసినట్టనిపిస్తోంది. ఆ విపరీతమేదో హంతకుడిలోనే వుండి వుంటుంది.

హంతకుడికి సంబంధించిన ఆధారాలేమైనా దొరుకుతాయేమోనని గదంతా ఒకటికినాలుగుసార్లు వెతికించేడు_ తనూ వెదికేడు. అతని ప్రయత్నం ఫలించలేదు.

"రాత్రి పన్నెండు గంటలు దాటేక మరణం సంభవించింది..." డాక్టర్ తన పరీక్ష పూర్తి చేసుకొచ్చి చెప్పేడు సుధాకర్‌తో.

ఆ పైన_ఫోటోగ్రాఫర్‌కి సైగ చేసేడు. పోలీస్ డాక్టర్, వేలిముద్రల నిపుణుడు, ఫోటోగ్రాఫర్ ఎవరి

డ్యూటీలో వారు పదేక ఆలోచిస్తూ బయటికి నడిచేడు సుధాకర్.

బయట — యింతకుముందు ఆ గదిలోనికి తీసుకొచ్చిన నౌఖరు నిలబడి వున్నాడు.

"ఫోన్ చేసింది నువ్వేనా?" అన్నాడు అతనుద్దేశించి.

అవునన్నట్టు తలూపాడు.

"నీ పేరు?"

"రంగయ్యంటారు,"

"ఎంతకాలంనుండీ పన్చేస్తున్నా విక్కడ?"

"ఈ బంగళా పని చేస్తున్నాను బాబూ."

"రాజశేఖరంగారు ఎలాంటి మనిషి?"

"ఆయన దేవుడు బాబూ. మనుషుల్లో తప్పపుట్టిన మారాజు. ఎనకటి జన్మలో ఏం పాపం చేసుకున్నారో ఏమో - హైదరాబాదులో నిక్షేపంలా గుండేవారు. యిక్కడికొచ్చి యిలా అయిపోయేరు."

"సరే నీకేం తెలుసో చెప్పు..."

"హైదరాబాదులో కాకుండా బాబుగారికి యిక్కడ కూడా వ్యాపారం వుంది. సంవత్సరానికోసారి వచ్చి చూసి పోతుంటారు బాబుగారు. అయ్యగారు వచ్చినప్పుడు తప్ప మరి నాకు పనుండదు. మిగతా రోజుల్లో ఈ బంగళా ఖాళీగా వుంటుంది..."

"అది సరే... రాత్రి వేళ నువ్వెక్కడుంటావ్?"

"బంగళాకి ఎడం ప్రక్కన చిన్న పాక వుంది... అందులో వుంటాను."

"నిన్నరాత్రి ఎన్ని గంటలకి పడుకున్నావ్?"

"పదకొండు దాటింది బాబూ. ఆ యేలవరకు బయట కూకుంటాను. తర్వాత తలుపులన్నీ సరిగా వున్నాయో లేదో చూసుకుని వచ్చి పడుకుంటాను..."

"అయితే నిన్న రాత్రి పిస్తోలు పేలిన శబ్దంగాని, యింట్లో యెవరైనా ప్రవేశించిన అలికిడిగాని వినిపించ లేదా?"

"లేదండి. నాది మొద్దు నిద్ర" అన్నాడు బుర్ర గోక్కుంటూ.

"రాజశేఖరంగారితో యింకెవరూ రాలేదా?"

"ఎందుకు రాలేదండి... మొదట శవాన్ని చూసింది అమ్మగారేనండి."

"ఎక్కడుందామె?"

"రండి" అంటూ ప్రక్క గదిలోకి దారితీసేడు. వెంట సుధాకర్ వెళ్ళేడు.

అప్పుడే పార్వతి కాస్త తేరుకుని లేచికూర్చుంది. పార్వతి మంచం ప్రక్కనే ఒకామె నిల్చొనుంది. ఆమె పార్వతిని ఓదారుస్తోంది. ఆమె పని మనిషి.

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ లోనికివచ్చేక ఒక ప్రక్కకి ఒదిగి నిల్చుందామె.

పార్వతివేపు చూసేడు సుధాకర్.

ఎర్రబారిన కళ్ళు అంతవరకు ఆమె ఏడ్చిందన్న సంగతి గుర్తు చేస్తున్నాయి.

"బాధపడి ప్రయోజనం లేదు...మనం చేయగలిగిం దల్లా హంతకుణ్ణి ఉరికంబం ఎక్కించడమే."

పార్వతి రెండు చేతులతో మొహాం కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

"చూడండి పార్వతిగారూ! మీరు రాజశేఖరం గారితో కలిసి విశాఖపట్నం వచ్చేరుకదా...ఎందు కొచ్చిందీ మీ భర్త చెప్పారా?"

"లేదు. కాని బయల్దేరిన దగ్గర్నుంచి ఆయన ఏదోలా వున్నారు. కారణం తెలుసుకోలేకపోయేను." పైట చెంగుతో కళ్ళు తుడుచుకుంటూ అంది.

"ఆయన్ని చంపేంత కక్ష ఎవరికైనా వుందా?"

"వ్యాపారమన్నాక అనేక లావాదేవీలు. వాటి వెనుకవున్న కక్ష గురించి నాకు తెలియదు."

"ఈ మధ్య మీ భర్తలో మార్పు ఏమైనా కని పెట్టారా?"

"దేనికో భయపడుతున్నట్లుగా కనిపించేరు."

"అతను చనిపోయినట్లు మీ కెలా తెలిసింది?"

"బారెడు ప్రొద్దెక్కినంతదాకా నిద్రపోయే అల వాటు లేదాయనకి. ఎనిమిది గంటలు కావస్తున్నా లేవక పోవడంతో వెళ్ళి చూసేను..."

తర్వాత జరిగిందేమిటో నౌకరు చెప్పిందాన్ని బట్టి అర్థం చేసుకున్నాడు సుధాకర్.

మరో రెండు మూడు ప్రశ్నలు వేసేడుగాని అంత కంటే ఎక్కువ సమాచారం లభించలేదు సుధాకర్‌కి.

సుధాకర్ ఒక్కక్షణం ఆలోచించేడు. రాజశేఖరంకి శత్రువులెవరూ వున్నట్టు తెలియలేదు. రాత్రివేళ పిస్తోలు పేలిన శబ్దం ఎవరూ వినలేదు. బహుశా సైలెన్సర్ పిస్తో లయి వుంటుంది. హత్యాయుధం దొరకలేదు. హత్యకి కారణం అంతుబట్టడంలేదు.

యింతలో అంబులెన్స్ వచ్చిందంటూ టూటౌన్ సిక్స్ వచ్చి చెప్పేడు.

"శవాన్ని మార్చ్యురీకి పంపించు" అని అతన్ని ఆదేశించేడు.

"సార్! బయట చూసేం. పిస్తోలు దొరకలేదు కానీ, సిమెంట్ పైపుమీద ఎవరిలో అడుగులు కనిపించేయి. మన ఫోటోగ్రాఫర్ అవన్నీ తీస్తున్నారు" అని వినయంగా తెలియజేసేడు.

అది విని తల పంకించి హంతకుడు బయటనుండి వచ్చినట్లు నిర్ధారణ చేసుకున్నాడు సుధాకర్. సుధాకర్ లేచి నిలబడ్డాడు. "ఆల్ రైట్! మీరు మాత్రం కాస్త జాగ్రత్తగా వుండండి" అని బయటికి నడిచేడు.

మరికొన్ని నిముషాలకి పోలీసు బలగమంతా యిల్లు విడిచి వెళ్ళిపోయింది.

రంగయ్య చిన్నగా నిట్టూర్చి, పార్వతి మంచం ప్రక్కనే కూలబడ్డాడు.

# 4

క్రితం రోజు రాత్రే బొంబాయినుండి వచ్చేడు డిటెక్టివ్ సురేంద్ర.

ప్రొద్దుటే కాఫీతాగి, పేపరు తిరగేస్తున్నాడు. ఏదో వార్తను చదువుతూ ఉన్నట్టుండి గతుక్కుమన్నాడు. హడావుడిగా లేచి టెలిఫోన్ వద్దకు వెళ్ళేడు. తీవ్రంగా ఆలోచిస్తూ ఒక నిముషంపాటు టెలిఫోన్ వద్ద నిలబడిపోయేడు.

సిగరెట్ పీలుస్తూ, రిసీవరెత్తి ఏదో నంబరు డయల్ చేశాడు.

"టూ టౌన్ పోలీస్ స్టేషన్" అంది అవతలి కంఠం.

"డిటెక్టివ్ సురేంద్రను మాట్లాడుతున్నాను. ఇన్‌స్పెక్టర్ సుధాకర్ వున్నాడా?"

"నమస్తే సర్! లోపల గదిలో వున్నారు. లైన్‌లో వుండండి, పిలుస్తాను."

కాసేపట్లో యిన్‌స్పెక్టర్ సుధాకర్ గొంతు వినిపించింది.

"హలో సురేంద్రా! ఏమిటింత అకస్మాత్తుగా నేను గుర్తుకొచ్చేను? నీలాంటి బిజీమనిషి గొంతు కనీసం టెలిఫోన్‌లో అయినా వింటున్నందుకు సంతోషంగా వుంది. బొంబే వెళ్ళావని విన్నాను. బొంబేలో ఏదన్నా కేసు తగిలిందా, ఏమిటి?"

"లేదు మహానుభావా! యిక్కడ కేసుల బాధపడలేక దూరంగా పారిపోవాలనిపించింది...అదిసరే గాని, నీనుండి నాకో సహాయం కావాలి సుధాకర్!"

"ఎప్పుడూ లేనిది కొత్తగా అడుగుతున్నావేంటి? ఏం కావాలి నీకు?"

"పేపర్లో కల్పనా ప్రొడక్టివ్ కంపెనీ యజమాని రాజశేఖరం హత్య విషయం చదివేను..."

యింకేదో చెప్పబోతుండగా "ఈ కేసులో నీ యింట్రెస్టేమిటి? నీ క్లయింటెవరు?" కేసు సురేంద్ర చేతిలో పడుతున్నందుకు, తత్ఫలితంగా తనకు పరోక్షంగా సురేంద్ర సహాయకారి కాబోతున్నందుకు సుధాకర్ లోలోన సంతోషించేడు.

"హంతుడే నా క్లయింటు. రాజశేఖరం నా క్లాస్‌మేట్. విశాఖపట్నం వచ్చినప్పుడల్లా నన్ను కలుస్తుంటాడు. అతని హత్య గురించి యిప్పుడే చదివేను. ఎలాగైనా హంతకుణ్ణి పట్టుకోవాలని నిర్ణయించుకున్నాను."

"వెరీగుడ్, నువ్వీ కేసులో సహాయపడుతున్నందుకు

నాకు కూడా సంతోషంగా వుంది. హంతకుడు తేలిగ్గా పట్టుపడ్డాడు కూడా.''

''అది సరే. నీ పరిశోధన ఎంతవరకు వచ్చింది? వివరాలు చెప్పు?''

రంగయ్య ఫోన్ చేసిం దగ్గర్నుంచీ తన పరిశోధన వివరించేడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్. ''ఆ రోజు ఉదయం కొద్దిగా వర్షంపడడంవలన తోటలో నేల కాస్త తడిగా వుంది. ఆ తడిలో ఏవో పాదముద్రలు కనిపించేయి. సిమెంట్ పైపుమీద ఆవే అడుగులున్నాయి. అడుగు జాడలనుబట్టి హత్య చేసినది మగాడేనని నిర్ణయించుకున్నాను. అంతేగాకుండా తలుపులుమీద కూడా వేలిముద్రలు లభించేయి. హంతకుడి చేతికి నాలుగువేళ్ళే!''

''ఈజిట్!''

''నిజమే. కాని నాలుగు వ్రేళ్ళున్న వాళ్లు ఎందరో వున్నారు. ఎందర్నని పరిశోధిస్తాం?''

''వ్రేలిముద్రలు ఆ యింట్లో ఎవరివీ కావా?''

''కాదు. ఆ యింట్లో హతుడి భార్య, నౌకరుతప్ప, వేరెవరూ లేరు.''

''హత్యచేసిన మనిషి తన వేలిముద్రల్ని అంత తేలిగ్గా విడుస్తాడా? హత్యచేసిన వెంటనే వాటి పని చూసుకునే వెళ్తాడు. ఏమంటావ్?''

''నువు చెప్పింది నిజమే. ఒకటి జరిగుంటుంది. హత్య చేసిన తర్వాత అతనికి క్రిందనుంచి ఏదో అలికిడి తగిలుంటుంది. అందుకని వెంటనే పారిపోయుంటాడతను. యీ రకంగా వేలిముద్రలు తుడిచివేసే అవకాశం అతనికి లేకపోవచ్చు.''

"గుడ్ వెరీగుడ్ పాయింట్." అతన్ని మెచ్చు కున్నాడు సురేంద్ర సాయంత్రం తను కలుస్తానని చెప్పి ఫోన్ పెట్టేశాడు.

# 5

కల్పనా ప్రొడక్టివ్ కంపెనీముందు ఆగింది జావా మోటారు సైకిల్. దానిమీద నుంచి దిగేడు డిటెక్టివ్ సురేంద్ర. మోటారుసైకిల్ని ప్రక్కకుతీసి స్టాండువేసి ఆఫీసు వేపు చూసేడు.

కల్పనా ప్రొడక్టివ్ కంపెనీకి యజమాని రాజశేఖరం. కాని అతను మెయిన్ సంస్థను చూసేందుకు తన మకాంని హైదరాబాదులో ఏర్పాటు చేసుకుంటూ, విశాఖపట్నం లోని బ్రాంచి వ్యవహారాలు చూసేందుకు పరాంకుశాన్ని నియమించేడు. పరాంకుశం అతని ప్రాణస్నేహితుడు.

లోనికి నడిచేడు సురేంద్ర.

పరాంకుశం రివాల్వింగ్ ఛెయిర్లో కూర్చొనున్నాడు. లోపలకు వచ్చిన మనిషి ఎవరా అన్నట్లు చూసేడు సురేంద్ర వేపు.

"అయామ్ డిటెక్టివ్ సురేంద్ర" అంటూ తనను తను పరిచయం చేసుకున్నాడు.

"గ్లాడ్ టు మీట్ యూ" అంటూ పరాంకుశం రివాల్వింగ్ ఛెయిర్లోంచి లేచి నిలబడి చేయి అందించేడు. "కూర్చోండి" అన్నాడు వెంటనే. అతను కుర్చీలో కూర్చున్నాడు.

"వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ?" సభ్యత అతని గొంతులో ఉట్టిపడుతోంది.

"రాజశేఖరం హత్యకేసు విషయంలో పరిశోధిస్తూ మీ దగ్గరికి వచ్చేను" అన్నాడు నాందిగా.

"అడగండి."

"శేఖరం విశాఖపట్నం వస్తున్నట్లు మీకు తెలుసా?"

"లేదు. శేఖరం ఎప్పుడొచ్చినా టెలిగ్రాం యిచ్చే వాడు. కాని యీసారి అలా జరగలేదు."

"వ్యాపారం పూర్తిగా అతనిదేనా? లేక అతను కేవలం భాగస్వామియేనా?"

"లేదు. యిది హైదరాబాదు కంపెనీకి బ్రాంచి మాత్రమే. రెండు కంపెనీల బాధ్యతను తను చూసుకునే వీలులేక నన్ను నియమించేడు. వ్యాపారం పూర్తిగా అతనిదే. అసలు శేఖరం సంవత్సరానికోసారి వస్తుంటాడు. కాని ఈసారి...?"

"ఈసారి?" రెట్టించాడు సురేంద్ర.

"నెల తిరక్కుముందే మళ్ళీ వచ్చాడు."

"ఎందుకొచ్చిందీ చెప్పాడా?"

"ఆ! అర్జంటుగా డబ్బుకావాలట."

"ఎంత?"

"రెండు లక్షలు!"

"ఎందుకో అడిగారా?"

"అడిగేను. కాని అతను చెప్పడానికి యిష్టపడలేదు. వ్యాపారంనుంచి అంతడబ్బు ఒక్కసారి తీసేస్తే మంచిది కాదని చెప్పేను. అతను వినలేదు. ఎలాగయినా సర్దుబాటు చేయమన్నాడు. నువ్వేదయినా బ్లాక్ మెయిలింగ్ కేసులో చిక్కుకున్నావా అని అడిగేను. అతను నన్ను కసురుకున్నాడు. రెండులక్షలు యిచ్చివేస్తే వ్యాపారం మూసివేయవలసి వుంటుందని ఆఖరి అస్త్రాన్ని ప్రయోగించాను. అయినా భయం లేదన్నాడు."

"అయితే ఏం చేసేరు? రెండు లక్షలు ఇచ్చేరా?"

"మరుసటిరోజు మధ్యాహ్నం వస్తే, అప్పటికి సర్దుబాటు చేయగలనని చెప్పాను."

"వచ్చాడా?"

"ఆ! వచ్చాడు. బ్రీఫ్ కేస్ తీసుకొని వెళ్ళిపోయాడు"

"అలా వెళ్ళేక మళ్ళీ కన్పించాడా?"

"ఆరోజేగా హత్య చేయబడింది."

"ఈహత్య యెందుకు జరిగిందంటారు?"

"నేనెలా చెప్పగలను?"

"ఊహించి చెప్పవచ్చుగా. అతను తీసుకెళ్ళిన డబ్బుకోసం హత్య జరిగిందేమో?" కదిలించి చూసేడు.

"మే బి ఆర్ మే నాట్. కాని అతనేదో బ్లాక్ మెయిలింగ్ కేసులో చిక్కుకున్నాడని నా అనుమానం"

"అలా అని ఎందుకనుకుంటున్నారు?"

"శేఖరంలాంటి మంచి మనిషిని హత్య చేసేంత శత్రువులెవరుంటారు?"

"శేఖరం మంచివాడే అయినప్పుడు బ్లాక్ మెయిలింగ్ కేసులో యిరుక్కునేంత చెడ్డపని మాత్రం అతనెందుకు చేస్తాడు?" ఎదురుప్రశ్న వేసాడు. దాంతో పరాంకుశం తికమక పడినట్టున్నాడు.

"అదేమో! నేను చెప్పలేను."

"హత్య జరిగే సమయంలో మీరెక్కడున్నారు?" అతని కళ్ళలోకి చూసేడు.

"అంటే...మీరు నన్ను అనుమానిస్తున్నారా?"

"కనిపించిన ప్రతి ఒక్కరిని అనుమానించడం మా వృత్తిలక్షణం. చెప్పండి."

"ఈ వూళ్ళో నేలేను. రాజమండ్రి వెళ్ళాను."

"ఎందుకెళ్ళేరు?"

"కంపెనీ తాలూకు సరుకు అమ్మకం నిమిత్తం ఇంకో పార్టీతో ఒప్పందంవుంది. అది పూర్తిచేసుకుని రావాలని వెళ్ళాను. వచ్చాక తెలిసింది ఈ ఘోరం."

"ఆల్ రైట్! అవసరమైతే మళ్ళీ కలుస్తాను" అని చెప్పి బయటపడ్డాడు.

# 6

ఫోన్ మ్రోగింది.

"యస్! డిటెక్టివ్ సురేంద్ర స్పీకింగ్" అన్నాడు సురేంద్ర రిసీవరెత్తి.

"ఏం మహానుభావా! యిప్పటికి నాలుగుసార్లు ఫోన్ చేసాను. తమరిగొంతు వినేభాగ్యం కలుగలేదు."

ఫోన్‌లో బిగ్గరగా వినిపించింది ఇన్‌స్పెక్టర్ సుధాకర్ గొంతు.

"ఓ! సుధాకరా! ఏమిటి విషయం?"

"పాత నేరస్తుల జాబితాలో హత్యాస్థలంలో దొరికిన వేలి ముద్రల్ని పోల్చిచూసేను. అవి రౌడీ మస్తాన్ వేలి ముద్రలతో సరిపోయాయి. అతని కుడిచేతికి బొటనవేలు లేదు. అతన్ని అరెస్టుచేసి లోపల పడేసాను."

"హత్య చేసినట్లు అంగీకరించాడా?"

"అదే జరిగితే నాలుగుసార్లు నీకు ఫోన్ చెయ్యాల్సిన ఖర్మ నాకేమిటి? తనుహత్య చేయలేదనే అంటున్నాడు."

"నాలుగు తగల్నియ్ లేకపోయేవ్? నిజం దానంతట అదే పరిగెత్తుకు వస్తుంది."

"ఆపనీ చేసేను. కాని ప్రయోజనం లేదు. ఏం చేయాలో అర్థం గావడం లేదు. నువ్వు వస్తే ప్రయోజనముంటుందని అనుకుంటున్నాను."

"ఆల్ రైట్! పదినిముషాల్లో అక్కడుంటాను" అని చెప్పి ఫోన్ పెట్టేశాడు.

సరిగ్గా పదినిముషాలకి జావా మోటర్ సైకిల్ స్టేషన్ ముందు ఆగింది.

గేటు దగ్గరున్న జవాను లేచి సెల్యూట్ చేసాడు. అతని సెల్యూట్ ని అందుకొని, హుందాగా నడచుకుంటు లోన అడుగుపెట్టేడు.

సుధాకర్ ఏవో ఫైల్స్ లో మునిగిపోయున్నాడు. అడుగుల శబ్దానికి తలెత్తి, సురేంద్రను చూసి ఆదరంగా రిసీవ్ చేసుకున్నాడు. కేసును గురించి మరోసారి ఆలోచిస్తున్నాననీ. రౌడీ మస్తాన్ హత్య యెందుకు చేశాడో అర్థంగావడం లేదనీ సుధాకర్ వ్యక్తం చేసాడు.

"అది తర్వాత ఆలోచిద్దాం...మస్తాన్ని చూసివద్దాం పద" అన్నాడు సురేంద్ర వెంటనే.

అలాగే అంటూ సెల్ వేపు దారితీశాడు సుధాకర్. సురేంద్ర అతన్ని అనుసరించాడు. కానిస్టేబుల్ సెల్ తలుపులు తెరచి వెనక్కి వెళ్ళిపోయాడు. సురేంద్ర, సుధాకర్ లోనికినడిచారు. లోపల ఓమనిషి వున్నాడు.

అతను రౌడీ మస్తాన్! అతనివేపు చూసాడు డిటెక్టివ్ సురేంద్ర.

రౌడీ మస్తాన్ సుమారు ఆరడుగుల ఎత్తుగలిగి, విశాలమైన వక్షస్థలంతో గంభీరంగా వున్నాడు. ముఖంమీద స్ఫోటకం మచ్చలు చంద్రునిలోని మచ్చలవలెవున్నాయి.

ఎడమ చెంపమీద రెండు కత్తిగాట్లు వున్నాయి. వంకీలు తిరిగిన తలవెంట్రుకలు గంపలా రేగివున్నాయి. మెలి తిరిగిన మీసాలు, నలుపురంగు బనీను, గళ్ళలుంగీ కట్టు కున్నాడు. మెడలో బంగారం చైను.

"రౌడీ మస్తాన్ నువ్వేనా?" అతనివేపు చూసాడు సురేంద్ర తాపీగా.

"నేనెవరో తెలియకుండానే నన్ను తీసుకువచ్చారా?" ఎదురుప్రశ్న వేసాడు.

"అడిగిన ప్రశ్నకు సరిగా సమాధానం చెప్పరా ఇడి యట్" అంటూ పిడికిలి బిగించి మస్తాన్ మీదకు విసర బోయేడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

చప్పున అతన్ని వారించేడు సురేంద్ర. వెంటనే సుధా కర్‌ని వెళ్ళిపొమ్మన్నట్లు కనుసైగ చేసాడు. అర్థంచేసు కుని అక్కడ్నించి వెళ్ళిపోయాడు సుధాకర్. తలుపు దగ్గరున్న పోలీసు అతని వెంటనే వెళ్ళిపోయాడు.

"మిస్టర్ మస్తాన్! మర్యాదగా అడిగిన ప్రశ్నలకు సక్రమంగా సమాధానం యిస్తావని ఆశిస్తున్నాను. లేక పోతే నిన్ని వుచ్చునుంచి భగవంతుడుకూడా రక్షించ లేనంతగా యిరుక్కుపోతావ్. ఏమంటావ్?" స్థిర గంభీర స్వరంతో అన్నాడు డిటెక్టివ్ సురేంద్ర.

రౌడీ మస్తాన్ పేరువింటే విశాఖపట్నం అంతా గజ గజలాడుతుంది. అతనిపేరు చెబితే ఊర్లో గూండాలు, రౌడీలూ మంచినీళ్ళు ముట్టరు. నరాల్లోని రక్తం గడ్డ కట్టుకుపోతుంది. అతని తీరుతెన్నులు చూస్తూంటే అసలు అతనికి భయమనేది తెలియనట్టుంది. పోలీసులు, పోలీసాక్షీ సర్లంటే అతనికి లక్ష్యమున్నట్టు లేదు.

ఏమనుకున్నాడో, ఏమో సమాధానాలు ఇవ్వడానికి అంగీకరించాడు.

"అడగండి" అన్నాడు నెమ్మదిగా.

"కల్పనా ప్రొడక్టివ్ కంపెనీ యజమాని రాజశేఖరం నీవు తెలుసా?" అడిగేడు అతన్ని తేరిపార చూస్తూ.

"తెలీదు" అన్నాడు గతుక్కుమంటూనే.

"పోనీ, సీతమ్మధార దగ్గరున్న బంగళా తెలుసా?"

"తెలుసు."

"ఎలా?"

"నేను రోజూ అటువేపునుండే వెళుతుంటాను."

"ఆ బంగళాలోకి ఎప్పుడయినా వెళ్ళావా?"

"లేదు."

"బాగా ఆలోచించుకుని చెప్పు. దొంగతనం చేయడానికిగాని వెళ్ళావా?"

"లేదు, వెళ్ళలేదు."

"వెళ్ళకపోతే ఎలా హత్య చేయగలిగావ్?"

"హత్యా? అబద్ధం...నాకేం తెలీదు," అరిచేడు.

"బుకాయించి ప్రయోజనంలేదు మస్తాన్! నిన్ను పట్టిచ్చే ఆధారాలన్నీ దొరికాయి. తలుపులమీద నీ వేలి ముద్రలు, సిమెంటు పైపుమీద, బంగళాతోటలో నేలమీద నీ అడుగుజాడలు నిన్ను దోషిగా పట్టివ్వక తప్పదు. కనుక నువ్వు నీ నేరాన్ని అంగీకరించడం మంచిది..."

"నాకేం తెలీదు." మొండిగా సమాధానం ఇచ్చేడు.

"మస్తాన్! అబద్ధాలాడి ప్రయోజనంలేదని ముందే చెప్పాను. నీచేత నిజం యెలా చెప్పించాలో నాకు బాగా తెలుసు..."

అని అంటుండగానే మస్తాన్ తెరచివున్న తలుపుకేసి పరిగెత్తాడు.

అంతే! సురేంద్ర నోట్లోంచి విచిత్రమైన అరుపు ధ్వనించింది.

అది ఫ్లయింగ్ కిక్!

సురేంద్ర, మస్తాన్ మీదికి గాలిలోంచి ఎగిరిదూకేడు. అతనికాళ్ళు మస్తాన్ గుండెల్ని హత్తుకున్నాయి. అంతే, మస్తాన్ చెట్టులా విరుచుకు పడిపోయాడు. పొలికేక లాంటిది అతని నోట్లోంచి వెలువడింది.

ఫ్లయింగ్ కిక్ సాధారణమైనది కాదు. దాని తాకిడికి వజ్రకాయుడయినా, ఇనుప తలుపులయినా విరిగి పడవలసిందే! ఆ కిక్‌లో అంతశక్తి వుంది. ఇది కరాటే విద్యలో ఒకభాగం.

ఇన్‌స్పెక్టర్ సుధాకర్, నలుగురు పోలీసులు పరిగెత్తుకుంటూ వచ్చారు.

తలుపుల దగ్గర పడివున్న మస్తాన్‌ని చూసి జరిగిందేమిటో గ్రహించాడు సుధాకర్.

"అరగంటవరకు మస్తాన్ లేవడు. పద" అని కానిస్టేబుల్ వేపు చూసి "తెలివిరాగానే చెప్పండి... జాగ్రత్త" అని బయటకి నడిచాడు. అతని వెనకాలే వచ్చాడు సుధాకర్.

క్షణంముందు మొండిగా సమాధానాలిచ్చే యేనుగు లాంటి మస్తాన్ విరుచుకు పడిపోవడాన్ని చూసి బెంబేలెత్తిపోయారు పోలీసులు. ఇప్పుడు సురేంద్రవేపు చూడ్డానికే భయంగావుంది వాళ్ళకి.

సురేంద్ర ఉస్సురుమంటూ కుర్చీలో కూలబడ్డాడు.

సుధాకర్ తన సీట్లోకి చేరుకున్నాడు.

కానిస్టేబుల్‌ని పిలిచి కాఫీ పట్రమ్మని చెప్పాడు. అయిదు నిముషాల్లో పొగలుగ్రక్కే కాఫీలు వారిముందు ప్రత్యక్షమయ్యాయి.

"నిజం ఒప్పుకుంటాడంటావా?" కాఫీసిప్ చేస్తూ అడిగాడు సుధాకర్.

"ఏమో మెలకువ వచ్చాక గానీ తెలియదు."

మళ్ళీ సురేంద్రే అన్నాడు.

"హత్యాస్థలంలో లభించిన వేలిముద్రలు, పాదముద్రలు ఓసారి చూపించు" అని, కాఫీకప్పు క్రింద పెట్టేసి సిగరెట్ వెలిగించుకున్నాడు. గట్టిగా పొగపీల్చివదిలేడు. అతనిలో ఆలోచనలు రగులుకుంటున్నాయి.

"మస్తాన్ తాలూకు వేలిముద్రలు ఏవీ?"

అవికూడా తీసిచ్చేడు సుధాకర్. రెంటినీ అయిదు నిమిషాలు పరీక్షగా చూసేడు. తల పంకించాడు.

"రాజశేఖరాన్ని చంపినందువలన మస్తాన్‌కి కలిగే ప్రయోజనం ఏమిటి?" సుధాకర్ ఇందాకట్నుంచి ఆలోచిస్తున్న ప్రశ్నయిది! అదే అడిగాడు సురేంద్రని.

"సింపుల్. ఇది మస్తాన్ మెదడులో పుట్టిన బుద్ధి కాదు. మస్తాన్ డబ్బిస్తే యెంతపని చేయడానికయినా సిద్ధం. మస్తాన్, రాజశేఖరాన్ని హత్య చేసేందుకు నియమించబడ్డ కిరాయి హంతకుడు."

అదిరి పడ్డాడు సుధాకర్.

"కిరాయి హంతకుడా?" ఆశ్చర్యంగా నోరెళ్ళబెట్టాడు.

"అవును. ఇప్పుడు, అతన్ని ఎవరు నియమించారో మనం తెలుసుకోవాలి."

ఇంతలో ఓ పోలీసు వచ్చేడు.

"సార్! అతను కళ్ళు తెరిచాడు" అని చెప్పాడు వినయంగా.

# 7

ఆఖరి దమ్ములాగి సిగరెట్ ఏష్ ట్రేలో పడేసి మస్తాన్ దగ్గరకి నడిచాడు. సురేంద్రని చూడగానే మస్తాన్ మొహంలో భయం తాండవించింది. ఇప్పుడతని మొహంలో మునుపటి గాంభీర్యం, మొండితనం గోచరించడం లేదు. మొహం నీరసంతో తోటకూర కాడలా వేలాడుతుంది. అది ఫ్లైయింగ్ కిక్ ప్రభావమని తెలుస్తోంది.

"ఇప్పటికయినా నిజం చెబుతావా?"

"లేదు, నేనీ హత్యచేయలేదు" భయం అతని నరనరాల్లోను వ్యాపించినట్టు అతనిగొంతు చిన్నబోయింది.

"ఇందాక చూపించింది సేంపిల్. నువ్వు హత్యచేసిన సంగతి నాకు తెలుసు. కాని ఆ హత్య వెనకవున్న నిజం నాకా్కవాలి. నిన్ను నేరస్థుడిగా నిరూపించే ఆధారాలన్నీ నాదగ్గరున్నాయి. నిజం నీచేత చెప్పించాలనే నా ప్రయత్నం. సిమెంట్ పైపుమీదున్న నీ పాదముద్రలు, తలుపులమీద దొరికిన నీ వేలిముద్రల ఆధారంతో నిన్ను హంతకుడిగా నిరూపించి ఉరికంబం యెక్కించడం విచిత్రంకాదు. నిజం నీచేత చెప్పించాలనే నాప్రయాస."

"నేను నిజమే చెబుతున్నాను. నమ్మరేం?" అమాయకుడిలా మొహం పెట్టాడు.

"యూ బాస్టర్డ్!" అంటూ పిడికిలి బిగించి అతని మొహంలోకి విసరబోయేంతలో మస్తాన్ కెవ్వుమని అరిచాడు. ఎందుటాకులా వణికిపోసాగాడు.

"వద్దు...నిజం చెప్పేస్తాను" గజగజ వణికిపోతున్నాడు.

"అలారా దారికి...ఇప్పుడు చెప్పు, రాజశేఖరాన్ని యెందుకు హత్యచేసావ్?"

మస్తాన్ చెప్పడం ప్రారంభించాడు.

"ఆరోజు నా గుడిసెముందు నక్కి మంచంలో కూలబడ్డాను.

అప్పుడు సరిగ్గా ఆరుగంటలవుతుంది. ఇంకా చీకటి పడలేదు. ఇంతలో నన్ను వెతుక్కుంటూ ఓ మనిషి వచ్చేడు.

"మస్తాన్ ఎవరు?" అని అడిగేడు నన్ను చూసి.

"నేనే మస్తాన్ని! ఏం కావాలి?" అని అడిగేను అతని వేపు చూసి.

"టాప్ సీక్రెట్ గా నువ్వో పని చేయాలి. అందుకు నువు కోరినంత డబ్బిస్తాను. అలా అని నేను యివ్వలేనంతగా డిమాండు చేయవద్దు" అని నవ్వేడతను.

"విషయమేమిటో చెప్పండి" అన్నాను చుట్ట వెలిగించుకుంటూ.

"ముందు లోపలికి పోదాం పద"

"అలాగే" అంటూ నేను గుడిసెలోనికి దారితీసేను. అతను నా వెనకాలే లోనికి వచ్చేడు. కుర్చీలో కూర్చున్నాడు.

"ఇప్పుడు చెప్పండి. ఏం చేయాలి?"

"రాజశేఖరం అనే మనిషిని హత్యచేయాలి నువ్వు!" ఓ మారు చుట్టూ చూసి అన్నాడతను.

"ఓ మర్డర్ కాంట్రాక్టా? యింతకీ అతనెవరు?"

"చార్మినార్ ప్రాంతంలోవున్న కల్పన ప్రొడక్టివ్ కంపెనీ యజమాని" అంటూ అతను వివరాలు చెప్పేడు.

"ఈ హత్యవలన నీకు కలిగే లాభం ఏమిటి?" అని అడిగేను.

"నీకనవసరం. నీకు కావలసింది ప్రతిఫలం. అడిగి తీసుకో. హత్యవలన కలిగే లాభాల గురించి అడగకు" కటువుగా అన్నాడతను.

"అల్ రైట్! పాతిక వేలు యిచ్చి వెళ్ళండి" అన్నాను. కాస్త ఎక్కువే చెప్పాను. నేనెంత అడిగినా అతను యిస్తాడని అర్థమైపోయింది నాకు.

"ఇప్పుడు కాంట్రాక్టు నాకు నచ్చని కారణంగా నేను వెళ్ళిపోతే?" సందేహం వెలిబుచ్చేడతను.

"కన్సల్టింగ్ ఫీజు వెయ్యిరూపాయలు చెల్లించాల్సి వుంటుంది."

"ఇవ్వకపోతే?"

"నువు హత్యచేయమని చెప్పిన వ్యక్తికి ఈ సమాచారం అందుతుంది అంతే."

"పాతిక వేలు యివ్వడానికి అభ్యంతరం లేదు. కాని పూర్తిగా యిప్పుడే యివ్వాలా?"

"అవును. హత్యవల్ల నీకు కలిగే లాభం చెప్పలేదు. నువ్వెవరో నాకు తెలియదు. తీరా హత్య జరిగేక నువు ఒప్పుకున్న డబ్బు యిస్తావన్న నమ్మకం ఏమిటి?"

"హత్య చేయకముందే డబ్బిస్తే నువు చేస్తావన్న

గ్యారంటీ ఏమిటి? ఆ డబ్బు తీసుకుని ఉడాయిస్తే?" ఎదురుప్రశ్న వేసేడు.

"నీకు నమ్మకముంటేనే యివ్వు. లేదంటే ఈ పనికి మరొకర్ని చూసుకోండి" అన్నాను.

"ఆల్ రైట్! యిప్పుడే యిస్తాను" అని చెప్పి జేబులోంచి నూరురూపాయల నోట్లకట్టలు తీసి నా ముందుంచేడు. నేను వాటిని అందుకుని ముద్దుపెట్టుకున్నాను.

"చాలా సంతోషం! నాకు రెండురోజులు గడువిస్తే పని పూర్తిచేస్తాను."

"నో! నో! ఈ రాత్రికే పని పూర్తిచేయాలి" అంటూ రాజశేఖరాన్ని ఎలా హత్యచేయాలో ఓ ప్లాను వివరించి చెప్పాడతను. ఆ ప్లాను నాకు నచ్చింది. అతను చెప్పిన ప్రకారమే పని పూర్తిచేసేను."

"అయితే హత్యచేసేవా?" కోపంగా అడిగేడు సురేంద్ర.

తల వంచుకున్నాడు మస్తాన్.

కిరాయికోసం హత్యచేయడానికి సిద్ధపడ్డ మస్తాన్ని చూడగానే సురేంద్రకి ఒళ్ళు మండుకొచ్చింది. చెంప చెళ్ళుమనిపించేడు. మస్తాన్ చెంప ఎర్రగా కంది పోయింది.

"నీదగ్గరికొచ్చిన మనిషెవరో తెలుసా?"

"తెలీదు" చెంప తడుముకుంటూ చెప్పాడు.

"అతను కనిపిస్తే గుర్తుపట్టగలవా?"

"గుర్తుపట్టలేను. అతనేదో మారువేషంలో ఉన్నట్టున్నాడు, ఆ వేషాన్ని మార్చేసుకుని వుంటాడు."

"అతని వేషాన్ని వర్ణించు."

"సన్నగా—పొడుగ్గా వుంటాడు. పైజామా, షర్వానీ, పిల్లిగడ్డం, తురకవాళ్ళ టోపీ, గిల్టుఫ్రేమున్న కళ్ళజోడు, ఫ్రెంచ్ కట్ మీసాలు."

"అంతకంటే ఆధారాలు లేవా?"

"అతని ఎడమకాలు పొట్టిలాగుంది. కాలు నేలమీద యీడుస్తున్నట్లుగా వుంది."

సురేంద్ర మస్తిష్కంలో ఆ ఆకారం రూపు దిద్దుకుంటుంది.

"అతని పేరు అడగలేదా?"

"అడిగేను. ఏన్సర్ హుస్సేన్ చెప్పేడు."

అది మారుపేరు కావచ్చునని ఊహించేడు సురేంద్ర.

హత్యకు కారణమైన వాళ్ళు తెరచాటున వుండే ఈ పని చేయించారన్నమాట. అంటే యిది బ్లాక్ మెయిలింగ్, పగ వాటికి సంబంధించిన హత్య కాదన్నమాట. తనెవరూ అనుమానించకుండా, గుర్తించకుండా కిరాయి హంతకుడ్ని నియమించడం, మారువేషం ధరించడం ద్వారా తన పని సానుకూలం చేసుకున్నాడు హంతకుడు. హంతకుడు ఘటికుడులాగే వున్నాడు.

హంతకుడెవరు? రాజశేఖరాన్ని తొలగించినందువలన హత్యచేయమని చెప్పిన వ్యక్తికి కలిగే లాభం ఏమిటి?

డబ్బు! ఎస్. డబ్బుకోసమే యీ హత్య జరిగుంటుంది. రాజశేఖరానికి, భార్య కాక యింకెవరూ వారసులెవరూ లేరని ఎంక్వయిరీలో తేలింది.

మరింకెవరు ఈ హత్య చేయించారు? అతని మస్తిష్కంలో ఏదో రూపం అలుముకుంటుంది.

చకచక అడుగులేసుకుంటూ బయటికి నడిచేడు.

"సుధాకర్! మస్తాన్ పట్టుబడిన విషయం రహస్యంగా వుంచు" అని చెప్పి మోటారుసైకిల్ ఎక్కి వెళ్ళిపోయేడు.

# 8

"మీ అమ్మగారున్నారా?" అని అడిగేడు డిటెక్టివ్ సురేంద్ర రంగయ్యని.

"కూర్చోండి బాబూ. చెప్పివస్తాను" అంటూ లోపలికి వెళ్ళేడు రంగయ్య.

సోఫాలో కూర్చున్నాడు సురేంద్ర. గదినంతటినీ ఓ సారి పరీక్షగా చూసేడు.

'నీటు'గా పేర్చినట్లుందా గది. గోడలకి సుభాష్ చంద్రబోస్, కందుకూరి వీరేశలింగం, శాస్త్రీజీ ఫోటోలు వేలాడుతున్నాయి. గదిలో మూలకి ఓ టేబిల్ వుంది. చిన్నచిన్న వస్తువులేవో దానిమీద చోటుచేసుకున్నాయి. నాలుగు కుర్చీలు ఒక వరుసమీద వున్నాయి. గదిమధ్యలో చిన్న టీపాయ్‌వుంది.

అడుగుల సవ్వడి అయింది. అటువేపు చూసేడు సురేంద్ర.

ఎదురుగా ఓ స్త్రీ! ఆమె పార్వతి!

ఆమె యింకా భర్తపోయిన దుఃఖం నుంచి తేరుకోనట్లే కనిపించింది.

తనెవరో పరిచయం చేసుకుని, వచ్చిన పని చెప్పేడు.

"మిమ్మల్ని ఈ దశలో బాధపెడుతున్నందుకు క్షమించాలి" అన్నాడు నాందిగా..

"అడగండి" అంది పార్వతి దుఃఖాన్ని దిగమింగుతూ.

"రాజశేఖరం ఎటువంటి మనిషి?" అడిగేడు మొదటి ప్రశ్నగా.

"అంటే?" అర్థంగాక ఎదురుప్రశ్న వేసింది పార్వతి.

"అతని ప్రవర్తన ఎటువంటిది? శత్రువులెవరైనా వున్నారా?"

"ఆయన గురించి చెప్పాలంటే చాలా మంచివారు. ఇతరుల పని కూడా తనమీద వేసుకుని చేసే ఉపకార స్వభావంకల మనిషి. అటువంటి మనిషికి శత్రువులున్నారంటే నమ్మలేం. కాని వుండేవుంటారు. లేకుంటే యిలా ఎందుకు జరుగుతుంది."

"హత్య జరగడానికి ముందు అతనెలా వున్నాడు."

"ఏదో ఆందోళనలో వున్నట్లు హడావుడిగా పని చేస్తున్నట్లు అనిపించింది. ఎక్కడ్నుంచో రెండు ఫోన్ కాల్స్ కూడా వచ్చేయి. ఆయన ఆందోళనకి, హడావుడికి కారణం తెలీక ఫోన్ కాల్స్ ఎక్కడ్నుంచి అని అడిగేను. కాని చెప్పలేదు..."

"అదేమిటో మీరు వూహించగలరా?"

"లేదు."

"పరాంకుశం పట్ల మీ అభిప్రాయం?"

"చాలా మంచివాడు. మా కుటుంబంలో ఓ మనిషిలా కలిసి పోతాడు."

"ఐతే రాజశేఖరానికేమన్నా వ్యసనాలున్నాయా?',

ఆ ప్రశ్నలోని అంతరార్థం గ్రహించింది పార్వతి.

"వ్యాపారం అన్నాక పదిమందితో కలసి తాగవలసి వస్తుంది. ఆయనకది అలవాటు అవునో కాదో

గాని తాగుతారు. ఇకపోతే ఒకటిరెండుసార్లు సైప్టిస్టు లలితతో ఎవరితో కనిపించేరట.''

''ఆరాత్రి మీరెక్కడ పడుకున్నారు?''

''మేడమీద ఆయన గదిపక్కనే మరోగదివుంది. ఆ గదికీ, ఈ గదికీ మధ్యద్వారంవుంది. ఆయనకి సింగిల్ గా పడుకోవడం అలవాటు. నేను ప్రక్కగదిలో పడుకున్నాను.'' ఆప్రశ్న సురేంద్ర ఎందుకు వేశాడో అర్థమయింది పార్వతికి.

''ఆల్ రైట్! అవసరమయితే మళ్ళీ కలుస్తాను'' అని చెప్పి బయటకు వచ్చేడు.

సురేంద్ర మోటర్ బైక్ స్టార్టుచేయబోతూ ఏదో గుర్తుకువచ్చి మళ్ళీ లోపలికి వెళ్ళేడు. పార్వతి యెవరితోనో ఫోన్ లో మాట్లాడుతోంది. సురేంద్రనిచూసి ఠక్కుమని ఫోన్ పెట్టేసింది కంగారుగా.

''మళ్ళీ వచ్చారేమిటి?'' చిరాకు పడింది.

''ఓ విషయం మిమ్మల్ని అడగడం మరిచేను''అన్నాడు ఆమె కంగారును గమనించి.

''ఏమిటి?'' అంది విసుగ్గా.

''ఆరోజు రాత్రి ఎన్నిగంటలకు నిద్రపోయేరు మీరు?''

''యించు మించుగా పదకొండవుతుంది.''

''అయితే ఆరాత్రి మీకేవిధమయిన శబ్దంగాని,అరుపు గాని వినిపించలేదా?''

''లేదు. నిద్రపట్టకపోతే ఆయన నిద్రమాత్రలు యిచ్చేరు. వేసుకుని పడుకున్నాను. మరి తెల్లవారే వరకు తెలివిరాలేదు.''

"ఆఖరి ప్రశ్న. పరాంకుశం దగ్గర్నుండి రెండులక్షల రూపాయల బ్రీఫ్ కేసుతో బయల్దేరినట్లు చెప్పాడతను. ఆ బ్రీఫ్ కేసు ఏమయిందో తెలుసా?"

"రావడం మాత్రం బ్రీఫ్ కేసుతో వచ్చారు. ఫోన్ కాల్స్ వచ్చాక, మళ్ళీ వెంటనే దాన్ని తీసుకుని వెళ్ళిపోయారు. అందులో ఎంతవుందో చెప్పలేను" అంది.

"ఆల్ రైట్! ఇక నేవెళతాను" అని చెప్పి బయట పడ్డాడు.

ఒకనిమిషం తర్వాత మోటారుసైకిల్ స్టార్టయి వెళ్ళిపోయిన శబ్దం వినిపించింది పార్వతికి.

నిట్టూర్చి వెనక్కి తిరిగింది పార్వతి.

# 9

డిటెక్టివ్ అసిస్టెంటు నరేంద్ర వాచీకేసి చూసుకున్నాడు. నాలుగయింది.

దాదాపు తను అక్కడికివచ్చి నాలుగ్గంటలయింది. ఆ రోడ్డు అంతా అటూయిటూ తిరుగుతూ తచ్చాడుతున్న కారణంగా కాళ్ళులాగడం మొదలుపెట్టాయి. యెండ యెక్కువగా వుండడంతో ఒళ్ళంతా చమటపట్టింది. వచ్చి ఎదురుగావున్న రెస్టారెంట్ లో కూర్చున్నాడు.

వెయిటర్ వచ్చాడు. వేడి 'టీ' తీసుకురమ్మన్నాడు. తెచ్చాక మెల్లగా సిప్ చేస్తూ ఎదురుగావున్న భవనం కేసి చూస్తున్నాడు. 'టీ' త్రాగినప్పటికి పదినిముషాలుపట్టింది.

హోటల్లోని జనం వస్తూపోతూ ఉన్నారు. వెయిటర్ అతనికేసి వింతగా చూడసాగాడు.

'ఒక్క 'ట్రీ' తాగి అరగంట రెస్టారెంట్‌లో గడి పేసినట్లున్నాదే' అన్నట్లుంది వాడిమొహం.

అయినా తనులేచి పోదల్చుకోలేదు. అక్కణ్నుంచి ఎదురుగావున్న భవనం బాగా కనిపిస్తుంది. పైగా బయట మండుటెండ. తిరగాలంటే కాళ్ళునొప్పి.

డిటెక్టివ్ సురేంద్రకు ఫోన్ చేసి యింతవరకు అతను బయటకు రాలేదని చెప్పాడు. మరోగంట వెయిట్ చేయమని చెప్పాడు సురేంద్ర.

నరేంద్ర సరేనని ఫోన్ పెట్టేశాడు.

మరో అరగంట గడిచింది.

సన్నగా, పొడుగ్గావున్న ఓవ్యక్తి భవనం ముఖద్వారం వద్ద ప్రత్యక్షమయ్యాడు. అతను తిన్నగావచ్చి గారేజ్‌లో వున్న కార్లో కూర్చుని స్టార్టు చేసాడు. కారు గారేజ్ లోంచి రోడ్డుమీదకు దూకింది.

నరేంద్ర యింతసేపూ కాచుకున్నది అతని కోసమే!

కారువెళ్ళిన నిముషానికి వెనుక టాక్సీవస్తూ కనిపించింది. ఖాళీగాకూడా వుంది. ఆపేడు నరేంద్ర. టాక్సీ ఆగింది. ఎక్కి కూర్చున్నాడు.

"డ్రయివర్! ముందు వెడుతున్న కారు నీదృష్టి పథంలోనుండి దాటిపోకుండా చూడు. నీకు పదిరూపాయలు బక్షీస్" ఆశ చూపేడు.

పదిరూపాయలమాట వినగానే టాక్సీ కదిలించాడు డ్రయివర్. రివ్వున దూసుకుపోయింది టాక్సీ.

సరస్వతి జంక్షన్‌లోంచి, అల్లిపురం, చావుల మదుం దాటుకుంటూ రైల్వే క్వార్టర్స్‌వేపు దూసుకుపోతోంది ముందు పోతున్న కారు. టాక్సీదాన్ని అనుసరించసాగింది.

ఉన్నట్టుండి ఒక ఇంటిముందు ఆగింది ముందుకారు.

నిర్మానుష్యంగా వుంది. నిశ్శబ్దంగా వుంది.

ఫర్లాంగు దూరంలోనే టాక్సీ ఆపుచేయించి, మీటరు ఛార్జీ మీద పదిరూపాయలు యిచ్చి టాక్సీని పంపించేసేడు నరేంద్ర.

కారులోని మనిషి దిగేడు. దిగిన తర్వాత చుట్టూ ఎవరన్నా మనుషులున్నారేమో అన్నట్టు నలువేపులకూ చూసాడు. నరేంద్ర సిగరెట్ వెలిగించుకుని, అతన్ని చూసి చూడనట్టు సందులోకి తిరిగేడు. కాని సందు తిరిగిన వెంటనే అతనిమీద దృష్టి నిలిపేడు.

ఆగంతకుడు ఆ యింటివేపు నడిచాడు.

మరుక్షణం తలుపు తాళంతీసి లోపల ప్రవేశించాడు. జరుగుతున్నదంతా సందులో నుంచి గమనిస్తున్నాడు నరేంద్ర. తలుపులు మళ్ళీ మూసుకున్నాయి.

అయిదు నిముషాలు ఆగి నరేంద్ర ముందుకడుగేసాడు. తలుపులముందు ఆగేడు.

లోపల ఎవరివో గొంతు వినిపిస్తోంది. నరేంద్ర తొంగి చూసాడు.

"మార్నింగ్ మైడియర్ బ్యూటీ!" అది ఆగంతకుడి గొంతు.

"ఇంకా ఎవరిగురించి ఆలోచిస్తున్నావ్? నిన్ను రక్షించే వారెవరయినా వున్నారనా? నిన్ను రక్షించడం ఎవరి తరమూ కాదు. నేను చెప్పినట్లువిను. నీ భవిష్యత్ బంగారం చేసుకో. ఈ కాయితాలమీద సంతకం పెట్టు. ఆతర్వాత మనం మన్మథసామ్రాజ్యంలో మునిగితేలుదాం" అతను జేబులోంచి కాయితాలేవో తీశాడు.

“ఛీ!” ఆమె అసహ్యించుకుంది.

“సంతకం చెయ్యకపోతే నీ బ్రతుకు ఈ అంధకారంలో తెల్లవారిపోవలసిందే. పోనీ, నీకిష్టం లేకపోతే నీమానాన నిన్ను వదలిపెడతాను. నీ యిష్టం వచ్చినచోటుకి వెళ్ళి పోవచ్చు. సంతకం చేసేయ్.”

“ఈ కంఠంలో ప్రాణముండగా జరగనిపని. చచ్చేందు కయినా సిద్ధమే.”

“అదే నీ యిష్టమయితే నిన్ను చంపక తప్పదు డార్లింగ్!” వికటంగా నవ్వాడా ఆగంతకుడు.

“నువు చంపినాసరే సంతకం చేయను.”

“...కాని నిన్ను మామూలుగా చావనివ్వను. ముందు నిన్ను తృప్తిగా అనుభవించి, ఆ తర్వాత ఒక్కొక్క కండ వలిపిస్తాను. ఒక్కొక్క ఎముక ఊడగొడతాను. ఆ బాధలకు తట్టుకోలేక నువ్వే సంతకం చేస్తావ్. అప్పటికీ సంతకం చేయకపోతే నువ్వు నీభర్తను చేరుకోవడం తథ్యం” కర్కశంగా నవ్వాడు.

“దుర్మార్గుడా! నాభర్తనేం చేసావ్?” వణికిపోతూ అడిగింది.

“పంపించేసాను... పరలోకానికి...”

“ఆఁ” నివ్వెరపోయింది.

బయట నరేంద్రకు రక్తం వుడుకుతోంది. ఒక్క డైవింగ్ చేసి హంతకుడ్ని పట్టుకోవాలనుంది. కాని బాస్ యెట్టి పరిస్థితిలోనూ ఆవేశపడవద్దని చెప్పినందువలన నరేంద్ర కోపాన్ని అణచుకున్నాడు.

“రేపు ఉదయం వరకు టైమిస్తున్నాను. బాగా ఆలోచించి నిర్ణయించుకో.”

"ఇంకా నిర్ణయించుకోవాల్సిందేం లేదు. యెలాగూ నా భర్తలు చంపేవ్. నాద్వారా నువ్వు అనుకున్నది సాధించిన తర్వాత నన్ను కూడా బ్రతకనిస్తావన్న నమ్మకం లేదు. నీయిష్టం వచ్చినట్లు చేసుకో" ఆవేశంగా అరిచింది.

"ఆవేశపడకు డార్లింగ్! నువ్వు నన్ను నమ్మాలి."

"నమ్మాలా? నిన్నా? కుక్కని అందలం యెక్కించినట్లు ఆయన నిన్ను నమ్మి అంతా నీచేతికి అప్పగించారు. నిన్ను నమ్మినందుకు ఏం చేసావ్? దుర్మార్గుడా! డబ్బు కోసం దేవుడులాంటి మనిషిని పొట్టన బెట్టుకున్నావు కదరా!"

"అయితే నీ నిర్ణయం మారదా?"

"చస్తే మారదు. నన్నుకూడా యిప్పుడే చంపేయ్. నీ కసి తీరుతుంది."

"మంకుపట్టు పట్టకు డార్లింగ్! నేనెవరో, ఏమిటో నీకు తెలుసు. తలచుకుంటే సాధించకుండా వదలనని నీకు తెలుసు. మరింకా నువ్వు మంకుపట్టు పట్టుకుని కూర్చుంటున్నా వెందుకో? వెధవ డబ్బుకోసం జీవితాన్ని, సుఖాన్ని కాదనుకుంటావా?"

"వెధవ డబ్బుకోసం నువ్వు ప్రాణాలే తీయగాలేనిది నేను ఆ డబ్బుకోసం ప్రాణాన్ని యిస్తే తప్పా?"

"వద్దు డార్లింగ్! పంతాలకు పోవద్దు. సంతకం చేసేయ్. నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను. హాయిగా చిలకా గోరింకల్లాగా వుందాం."

"ఛీ! దుర్మార్గుడా! నీ నోటితో నన్ను 'చెల్లీ' అని పిలిచేవాడివి గుర్తుచేసుకోరా! నీనాలిక తెగిపడిపోతుంది" ఆవేశంగా అరిచిందామె.

చెంప చెళ్ళుమంది. చెంప తడుముకుందామె. చెంప మీద వేలిముద్రలు అచ్చుతేలినయ్. క్షణంసేపు అంతా చీకటిగా కనిపించింది. కళ్ళల్లో నీళ్ళు నిండుకున్నాయి.

"ఆడదాని మీద చెయి చేసుకోవడానికి సిగ్గులేదూ?",

"ఇది కేవలం సేంపిల్. నువ్వు సంతకం చేయకపోతే ఫలితం యింతకంటే దారుణంగా వుంటుంది. రేపు ఉదయం వరకు టైమిస్తున్నాను. బాగా ఆలోచించుకుని నిర్ణయించుకో. సంతకం చేసి సుఖాన్ని వరిస్తావో, మొండి పట్టుదలతో సంతకం చేయకుండా మృత్యువునే వరి స్తావో నీ నిర్ణయంమీద ఆధారపడి వుంటుంది. జాగ్రత్త"

తలుపులు తెరుచుకున్నాయి. ఆగంతకుడు బయటకు వచ్చాడు. అంతే! నరేంద్ర చేయి విసురుగావచ్చి అతని ముఖాన్ని పచ్చడి చేసింది.

# 10

డిటెక్టివ్ సురేంద్ర ఇంట్లో ఎలక్ట్రిక్ దీపాలు దేదీప్య మానంగా వెలుగుతున్నాయి. ఇంటిముందు కార్లు, టాక్సీలు జీపులూ ఆగేయి. అనేకమంది పోలీస్ కానిస్టేబుల్స్ ప్రకాశవంతంగా వున్న తోటలో పచార్లు చేస్తున్నారు. లోపల కుర్చీలు నిండివున్నాయి.

సురేంద్ర చెప్పడం ప్రారంభించాడు.

"ఈ కేసులో ముఖ్యపాత్రలు రెండు. ఒకటి పరాం కుశం, రెండు కార్లా" అంటూ పార్వతివేపు చూసాడు.

పార్వతి హఠాత్తుగా కుర్చీలోంచి లేచి ద్వారంవేపు దూసుకు పోయింది బాణంలా. ఇన్స్పెక్టర్ సుధాకర్ ఆమె వెనకగానే లేడిలా దూసుకుపోయి, మరుక్షణంలో

ఆమెను తీసుకువచ్చి కుర్చీలో కుదేసాడు. ఆమె తలవంచు కుంది. అదే సమయంలో పక్క హాలునుండి అసలు పార్వతి బయటకు వచ్చింది.

శార్లా ఎవరో కాదు. స్వయంగా పార్వతికి చెల్లెలు. అయిదారేళ్ళ క్రితం ఎప్పుడో యిద్దరికీ సరిపడని కారణంగా విడిపోయారు. తర్వాత పార్వతి హైదరాబాదులో రాజశేఖరం కంపెనీలో టైపిస్టుగా చేరడం,ఆమెను నచ్చి పెళ్ళిచేసుకోవడం జరిగింది.

శార్లా విక్రమ్‌హోటల్లో కేబరే డాన్సర్. అనుకోకుండా ఓరోజు విక్రమ్ హోటల్లో శార్లా తటస్థపడింది పరాంకుశానికి. అతనిలో ఆలోచన తలుక్కుమంది. ఆమెలో ఆశను రగిలించాడు. అతనితో చేతులు కలిపింది

పరాంకుశానికి వున్న వ్యసనాల వలన కంపెనీ డబ్బు రెండు లక్షలదాకా హరించుకు పోయింది. పరాంకుశానికి శాల్కా, చేతులూ ఆడని సమయంలో శార్లా కనిపించడం పథకం రూపొందించడం జరిగింది.

అయితే అకస్మాత్తుగా పరాంకుశం కంపెనీ డబ్బు కరిగించేసాడని తెలిసి రాజశేఖరం ఊడిపడ్డాడు. దాంతో పరాంకుశం గొంతులో ఏదో అడ్డం పడినట్లయింది. పుస్తకాలన్నీ చెక్ చేసి రెండులక్షల రూపాయలు కనిపించనట్లుగా లెక్క తేల్చేడు రాజశేఖరం.

ఎదురుచూడని యీ సంఘటనకు నీరుకారి పోయాడు పరాంకుశం. మరుసటిరోజు సాయంకాలానికల్లా డబ్బు తెచ్చివ్వమనీ, లేకపోతే కథ చాలా దూరం వెళుతుందని హెచ్చరించి వెళ్ళిపోయాడు రాజశేఖరం.

పరాంకుశానికి ఎటూ దారి కనిపించలేదు. కరిగిపోయిన రెండులక్షల రూపాయలు తెచ్చి ఇవ్వలేదు. ఇవ్వకుండా జైల్లో కూర్చోలేడు. ఆలోచించగా అతనికి ఒకేదారి దొరికింది. తరువాతెప్పుడో చేయాలనుకున్న పని ఇప్పుడే చేయాలి. అది రాజశేఖరాన్ని పైకి పంపించేయడం!

ఆ ఆలోచన వచ్చిన వెంటనే మారువేషం వేసుకుని రౌడీ మస్తాన్‌ని కలసి మర్డర్ కాంట్రాక్టు కుదుర్చుకొని రాజశేఖరాన్ని రాత్రికి రాత్రే హత్యచేయించాడు.

అయితే కార్లా, పరాంకుశం చెప్పిన అబద్ధాలే వారిని పట్టిచ్చాయి.

వేలిముద్రల సహాయంతో రౌడీ మస్తాన్‌ని పట్టుకున్నాంగాని, హత్య చేయించిన వ్యక్తి ఎవరో తెలియలేదు. తనతో కాంట్రాక్టు కుదుర్చుకున్న వ్యక్తికి ఓకాలు పొట్టిదని రౌడీ మస్తాన్ క్లూ యిచ్చాడు. అది పరాంకుశంకు సరిపోయింది. పైగా అతనికి వ్యసనాలు ఎక్కువ.

హత్య జరిగిన రోజున తన దగ్గర్నుండి రాజశేఖరం రెండులక్షలు తీసుకువెళ్ళాడని అతను బ్లాక్ మెయి-లింగ్‌లో చిక్కుకున్నట్టు అనుమానంగా వుందని చెప్పాడు పరాంకుశం. కార్లాదాన్ని సమర్థిస్తూ అతనికి ఆ రోజు యెక్కడ్నుంచో రెండు ఫోన్‌కాల్స్ వచ్చాయని చెప్పింది.

టెలిఫోన్ ఎక్స్ఛేంజికి ఫోన్ చేసి ఆరోజు ఆ బంగళాకు ఎక్కడెక్కడ్నించి ఫోన్‌కాల్స్ వచ్చాయో అడిగాను. పార్వతి (కార్లా) పరాంకుశానికి చేసిన ఫోన్‌కాల్ తప్ప వేరొకటేదీ ఆ బంగళాకు ఫోన్‌కాల్ రాలేదని తేలింది.

అలాగే హైదరాబాదు బ్యాంకుకు ఫోన్ చేసి రాజశేఖరం అకౌంటులో పదిలక్షలకుపైన బేలన్స్ వున్నట్లు తెలుసుకున్నాను. రెండులక్షలకోసం తన దగ్గరకొచ్చాడన్న పరాంకుశంమాట అబద్ధమని తేలింది.

పరాంకుశాన్ని ఫాలోకమ్మని నరేంద్రను పంపాను.

నరేంద్ర అతనిని బంధించి, పార్వతిని విడిపించి తీసుకువచ్చాడు.

ఇదీ రాజశేఖరం హత్య వెనుకవున్న కథ!'' అని ముగించాడు డిటెక్టివ్ సురేంద్ర.

—:ఐపోయింది:—

# ప్రేమ సమాధి!

అజీజ్

ముసక చీకటి!

ఆ చుక్కల వెలుగులో దారి చూసుకుంటూ ముందుకు సాగుతున్నాడు పరంధామయ్య. ఆయన అడుగులకి లయగా, చెప్పులు చేసే కిరకిర చప్పుడు తప్ప, పరిసరాలన్నీ నిశ్శబ్దంగా ఉన్నాయి.

కందిచేనులో పాలేర్లకి పనులు పురమాయించి, ఇంటికి తిరుగు ప్రయాణమయ్యేసరికి సంజె చీకట్లు ముసురుకున్నాయి. అడపాదడపా ఆయనలా పొలానికెళ్ళి రావడం పరిపాటే.

ఊరు యింకో ఫర్లాంగుదూరమే ఉందనడానికి సూచనగా కొద్దిదూరాన శిథిలావస్థలోవున్న నాయుడుగారి

మేడ కనిపిస్తోంది. ఆ మేడచుట్టూ చిన్న పిట్టగోడ కట్టి వుంది.

చూసే నాథుడు లేక, ఆలనాపాలనా లేక, ఆ కాంపౌండులో పిచ్చి మొక్కలు బాగా పెరిగివున్నాయి.

ఒకనాడు పూల చెట్లతో, ఘుమఘుమలాడే సన్నజాజి తీగలతో నూతన వధువులా వెలుగొందిన ఆమేడ, ఇప్పుడు చీకట్లో భూతనిలయంలా కనిపిస్తూ, రాత్రిళ్ళు ఆ దారిన వెళ్ళేవారి గుండెల్లో రకంత గుబులు రేకెత్తిస్తుంది.

ఆ మేడ మెయిన్ గేటు దాటి, ముందుకు సాగబో తున్న పరంధామయ్య కాళ్ళకి బ్రేకులు పడ్డాయి. కళ్ళు చిట్లిస్తూ మేడవేపు చూసాడు. ఆయన ఆశ్చర్యానికి కారణం లేకపోలేదు.

మేడకింద అంతస్తు కిటికీలోంచి సన్నని మసక వెలుతురు కనిపిస్తోంది! తను పొరబడుతున్నాడా, అన్న సందేహంతో కళ్ళజోడుతీసి, కండువాతో తుడిచి పెట్టుకుని చూసేడు.

సందేహం లేదు. లోపల దీపం వెలుగుతోంది!

ఐదేళ్ళనుంచి మనుష సంచారం లేకుండా, పాడుపడున్న ఇంట్లో దీపం వెలగడమా? ఎవరు వచ్చారు?

కొంపదీసి... నైవేద్య తిరిగి రాలేదుకదా? ఔను. ఆమె తప్ప ఆ ఇంటికి వారసులంటూ ఇంకా యెవరున్నారీ లోకంలో? పన్నెండేళ్ళ క్రితం, ఇల్లు విడిచి పోయిన వ్యక్తి, ఐదేళ్ళక్రితం తండ్రి మరణించినా, కడ చూపు కోసంకూడా రాని వ్యక్తి ఊహించని విధంగా యెలా వచ్చిందిప్పుడు?

సందేహ నివృత్తికోసం ఒక్కసారి ఆమెను చూడా లన్న జిజ్ఞాస మొలకెత్తింది పరంధామయ్యలో.

కాంపౌండ్ గేటుమూసి వుంది. అటు నడిచాడు. కొక్కెం యెత్తి మెల్లిగా తోసాడు గేటుని. తెరుచుకో లేదు. చాలాకాలం చలనంలేక, తుప్పుపట్టి బిగుసుకు పోయివుంది.

కాస్త గట్టిగా తోసిచూసాడు. అరున్నొక్క రాగాలు పలుకుతూ తెరుచుకుంది. సాధ్యమైనంతవరకు చెప్పులు కిరకిర వినిపించకుండా అడుగులేస్తూ, కాంతి కనిపిస్తున్న కిటికీని సమీపించాడు.

ఆయన కిటికీగుండా లోనికి చూడటం, అదే సమ యంలో ఓ స్త్రీ ఆకారం, కిటికీముందునుంచి మరోగది లోకి వెళ్ళడం లిప్తపాటులో జరిగిపోయాయి. ఆ ఆకా రాన్ని చూడగానే పరంధామయ్య గుండె ఝల్లుమంది.

గుర్తించలేక పోయాడు, ఆమె నైవేద్య ఔనో కాదో? తెల్లచీర, విరబోసుకున్న జుత్తు. ఇవే ఆ మసక వెలుగులో పరంధామయ్య చూడగలిగింది. ఆమె అడుగు లకి లయగా, సన్నని గజ్జెల మోత కూడా వినిపించినట్టు స్ఫురించింది ఆయనకు తరువాత!

ఊపిరి బిగబట్టి, పదినిముషాలు అక్కడే నిల్చున్నాడు. మళ్ళీ ఆమె ఇవతలికి రాలేదు. తలుపు తడదామా? అన్న ఆలోచన వచ్చిందాయనకు క్షణకాలం. ధైర్యం చాలక వెనుదిరిగాడు.

యథాప్రకారం గేటుమూసి, ఊరివైపు అడుగులు వేశాడు. మగాడు తనకే ఆ ప్రదేశం అంత భయాన్ని

రేక తిస్తోంటే ఆడది ఒంటరిగా ఆ లంకంత యింట్లో ఎలా వుండగలుగుతుందో?

ఇంతకీ, ఆమె ఈ రోజే వచ్చిందా? నాలుగురోజుల క్రితం తను పనిమీద పొరుగూరెళ్ళాడు. ఈరోజే తిరిగి వచ్చాడు. రాగానే పొలం చూట్టానికెళ్ళాడు. ఆమె రెండుమూడు రోజులక్రితం వచ్చివుంటే ఆ సంగతి తనకు తెలీదు.

ఊరివైపు పురోగమిస్తున్న అడుగుల్లాగే, ఆయన మస్తిష్కం పన్నెండేళ్ళ వెనక్కి తిరోగమిస్తోంది.

పాపం నైవేద్య!

పంటకొచ్చిన పనసపండులాటి ప్రాయంలో, పాపిష్టి ప్రేమలోపడి, బ్రతుకంతా బీడుపాలు చేసుకుంది.

ఆ రోజుల్లో జగపతినాయుడుగారు ఆ ఊరికల్లా పెద్ద జమీందారు. ఆ ఊళ్ళోనేగాక, ఆ చుట్టుపక్కల గ్రామాల్లోకూడా ఆయనకి మంచిపరపతి ఉండేది. ఆయన ఒక్కగానొక్క కూతురే నైవేద్య.

బాల్యంలోనే ఆ పిల్లతల్లి మరణించడంతో, నాయుడుగారామెని అల్లారుముద్దుగా పెంచారు. యుక్తవయసులో నైవేద్య ఓ యువకుడికి మనసిచ్చింది. అతనెవరో పరాయివాడేంకాదు. ఆ కుటుంబానికి సన్నిహితుడూ, నాయుడుగారి స్నేహితుడూ అయిన శివశంకరం కొడుకు పార్వతీశం.

బాల్యంనుంచీ, నైవేద్యా, పార్వతీశం ఒకేచోట ఆడుతూ పాడుతూ పెరిగారు. ఊళ్ళో స్కూల్ ఫైనల్ పాసయ్యాక, పైచదువులకోసం మద్రాసు వెళ్ళిపోయాడు పార్వతీశం.

హాస్టల్లో కాక, మద్రాసులోనే నివసిస్తున్న వాళ్ళ మేనత్త ఇంట్లోవుండి చదువుకోసాగాడు. అతని చదువు పూర్తయ్యాక నాయుడుగారు నైవేద్య నతనికే యిచ్చి పెళ్ళి చేస్తారని ఊళ్ళో అందరూ అనుకునేవారు.

పార్వతీశం బుద్ధిగా చదువుకుంటూ బి. ఏ. పూర్తిచేసి ఎల్.ఎల్.బి.లో చేరాడు. అక్కడే కథ అడ్డం తిరిగింది.

పార్వతీశం లా పూర్తవగానే, మద్రాసులోని అతని అత్తకూతురుతో అతని వివాహం జరిగిపోయింది. ఊళ్ళో అంతా నివ్వెరపోయారు.

ఆ అమ్మాయి పేరు ఉపాసన. అక్కడే అతనితో బాటు కాలేజీలో చదివేదట. ఆమెని అతనికే యిచ్చి చెయ్యాలని వాళ్ళ పెద్దలు మొదటినుంచీ అనుకునేవారట.

పార్వతీశానికా పెళ్ళి ఇష్టం లేకపోయినా పిరికివాడు గనుక పెద్దలముందు నోరువిప్పలేక పోయాడు.

ఆ సంఘటన, నైవేద్య మనసుని అగాధంపాలు చేసింది. పార్వతీశం భార్యా సమేతంగా స్వంత ఊరువచ్చి, ఇక్కడే ప్రాక్టీసు ప్రారంభించాడు.

అతను వచ్చిన ఐదారు నెలలతర్వాత నైవేద్య హఠాత్తుగా ఇంట్లోంచి వెళ్ళిపోయింది ఎవ్వరికీ చెప్పా చెయ్యకుండా. తనకా ఊరిమీదా, ఇంటిమీదా, చివరికి జీవితంమీదా విరక్తి పుట్టిందని, మనశ్శాంతి వెదుక్కుంటూ పోతున్నాననీ తనకోసం గాలించ వద్దనీ ఓ ఉత్తరం మాత్రం రాసిపెట్టి వెళ్ళింది.

అంతే! ఆ తరువాత మళ్ళీ ఆమెగురించి ఎవ్వరికీ తెలియదు.

నాయుడుగారు ఆమెను వెతకడానికి డబ్బును మంచి నీళ్ళలా ఖర్చుపెట్టేరు. లాభం లేకపోయింది. ఆయనకి దగ్గరి బంధువులంటూ ఎవ్వరూ లేరు. ఉన్న ఒక్క కూతురూ అలా అయిపోయిందే అన్న మానసిక వేదనతో మంచం పట్టేరు.

తమ కుటుంబ వినాశానికి మూలకారకుడైన పార్వతీశంపట్ల మాత్రం ఆయన ఎన్నడూ ద్వేషాన్ని ప్రకటించ లేదు. పైగా అతనిపట్ల సానుభూతి చూపేవారు. అంతే కాదు, తన మరణానంతరం యావదాస్తికి అతన్నే ట్రస్టీగా నియమించారు.

నైవేద్య ఇల్లువదలి వెళ్ళాక, దేశం నలుమూలలనుంచీ ఆమె పార్వతీశంపేర అనేక ఉత్తరాలు రాసిదింట. మనోవ్యాధితో నాయుడుగారు వివేళ్ళక్రితం మరణించారు. అప్పటినుంచి పార్వతీశమే వారి ఆస్తిపాస్తుల్ని ఆజమాయిషీ చేస్తున్నాడు.

స్వతహాగా అతను చాలా నెమ్మదస్తుడు. అటువంటి వాడికి ఉపాసనవంటి కోపిష్టీ, దురహంకారి ఐన భార్య దొరికింది. ఊళ్ళో ఎవరికీ ఆమెపట్ల సదభిప్రాయంలేదు. మొగుణ్ని రాచిరంపాన పెడుతుందిట. పట్నంలో పుట్టి పెరిగింది గనక, ఈ ఊరంటే ఆమెకి తగని రోత.

వారానికి రెండు సార్లైనా మద్రాసు వెళ్ళివస్తుంది. అంతేకాదు, అక్కడ క్లబ్బుల్లో విచ్చలవిడిగా తిరిగి వస్తుందని ఊళ్ళో అంతా చెవులు కొరుక్కుంటూంటారు. ఇందుకు మొగుడి మెతకదనమే కారణం. అంతా, పార్వతీశం లలాట లిఖితం!

ఇల్లు దగ్గరపడటంతో పరంధామయ్య ఆలోచనలు చెదిరిపోయేయి.

భార్య అందించిన చెంబుతో కాళ్ళు కడుక్కుంటూ, చెప్పేడు. "పొలంనించి వస్తోంటే, ఊరవతల నాయుడు గారి మేడలో దీపం వెలుతురు కనిపించింది..."

"ఔనంటోయ్! ఊర్నించి మీ రొచ్చేక చెప్పడం మర్చాను. మూడ్రోజుల్నించీ ఊరంతా ఒకటే గుస గుసలు. ఆ మేడలో రాత్రి పూట దీపాలు వెలగడం ఒక రిద్దరు చూసారట.

నైవేద్య వచ్చి వుంటుందనీ, వెళ్ళి పలకరిద్దామనీ, పాత పరిచయస్థులు కొందరు, పగటిపూట వెళ్ళారుట. నైవేద్య తలుపు తెరవకుండా, లోపలినించే మాట్లాడిందిట వాళ్ళతో!"

"ఏమని?"

"తన ఆరోగ్యం బావులేదనీ, కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకోదల్చాననీ, ఇప్పుడప్పుడే ఎవ్వరూ తన విశ్రాంతికి భంగం కలిగించవద్దనీ, కోలుకున్నాక ఊళ్ళోకి వచ్చి, అందర్నీ పలకరిస్తాననీ చెప్పిందిట!"

"పార్వతీశం ఉన్నాడా ఊళ్ళో?"

"ఏమో, నాకు తెలీదు! ఆ మేడలో ఆమె తప్ప మరె వ్వరూ వున్నట్టు లేదుట. దిక్కూ మొక్కూ లేని అటు వంటి పాడుబడ్డ ఇంట్లో ఓ ఆడకూతురు ఒంటరిగా వుంటుందని తలచుకుంటేనే నాకు ఒళ్ళు జలదరిస్తోంది సుమండీ!" అంది పరంధామయ్య భార్య.

ఉదయం వెళ్ళి పార్వతీశాన్ని కలుసుకోవాలి అను కుంటూ ఇంట్లోకి నడిచాడాయన.

# 2

మర్నాడు పరంధామయ్య ఇంకా పార్వతీశం ఇంటి కెళ్ళకముందే, ఊరివాళ్ళ గుంపొకటి వచ్చిందాయన ఇంటికి.

వాళ్ళంతా నైవేద్యమీద ఫిర్యాదులు తీసుకొచ్చేరు.

"మనూళ్ళో ఇన్నాళ్ళూ వేశ్యాగృహాలు లేవని గర్విస్తూ వచ్చాం! మూడు రోజుల్నించీ, నాయుడుగారి మేడలో దీపాలు వెలుగుతున్నాయి. అంతేకాదు, ఆ ఇంట్లో, ఓ స్త్రీ ఆకారంకూడా కనిపిస్తోంది."

పన్నెండేళ్ళ క్రితం ఇల్లొదిలి పోయిన నాయుడుగారి కూతురు నైవేద్యవ తప్ప, ఆ ఇంట్లో ప్రవేశించే అధికారం ఎవరికుంది? ఎంత ప్రయత్నించినా ఊళ్ళో ఎవ్వరూ ఆమెని చూడలేక పోతున్నారు.

కాని, చీకటి పడగానే ఓ పురుషుడు ఒంటరిగా ఆ ఇంట్లో కెళ్ళడం, ఒకరిద్దరి కంటబడింది. మనూళ్లో ఇటువంటి చాటు మాటు వ్యవహారాలు జరగడం మేము సహించం!" అన్నాడో వృద్ధుడు.

"ఔను. రెండ్రోజుల క్రితం, ఆ ఇంటి చుట్టుపక్కల, చీకట్లో ఓ వ్యక్తి తచ్చాడుతూండటం నా కళ్ళారా చూసాను!" అన్నాడు మరొకడు.

పరంధామయ్య కాసేపాలోచించి, "మీ సూచనల ద్వారా ఆమె, ఆ ఇంట్లో, నీతి బాహ్యమైన జీవితం గడుపుతున్నట్టు నిర్ధారణ కాదు. ఆ పురుషుడు ఆమె తీసుకవచ్చిన నౌఖరే కావచ్చు.

లేదా, కాలప్రభావంవల్ల ఆమె మనోగాయాలు మాని, ఎవ్వరైన్నా పెళ్ళి చేసుకనుండవచ్చు. అతనామె భర్తే

అయుండవచ్చు. ఐనా, ఇక్కడ వ్యభిచారం చేసే ఖర్మ ఆమెకేం పట్టింది?" అన్నాడు.

అప్పుడు తట్టింది వాళ్ళకా ఆలోచన. "ఐతే, ఇంట్లోంచి ఎందుకు బైటికి రావడంలేదు? సాటి మనుషుల్ని దేనికి కలవడంలేదు? ఇరవై నాలుగ్గంటలూ తలుపులు మూసుకుని ఇంట్లో దేనిచేస్తూంది?" అడిగిందో స్త్రీ.

"బహుశా, కాలం ఆమె అందాన్ని హరించివేసిందేమో? ఏదైనా దుర్ఘటనకి గురై అవిటిదయిందేమో? సిగ్గుపడి బైటికి రావడం లేదేమో? ఆ విషయాలన్నీ నాకు వదిలి మీరు మీ పనులు చూసుకోండి!" అంటూ వాళ్ళని పంపేసి, చెప్పులు తొడుక్కుని, లాయర్ పార్వతీశం ఇంటికి బైలుదేరాడు పరంధామయ్య.

ఆయన పార్వతీశం ఇంటిని సమీపించడం, అదే సమయంలో పార్వతీశం భార్య ఉపాసన కారు నడుపుతూ గేటుగుండా బైటికి రావడం ఒకేసారి జరిగాయి.

బహుశా, ఆమె పట్నానికి ప్రయాణమై వుంటుంది. పరంధామయ్య కారుకడ్డం రావడంతో ఆపి, కనుబొమ లెగరేసింది.

"పార్వతీశం ఉన్నారా అమ్మా?" అడిగాడు.

"లేరు! కోర్టు పనిమీద వారం రోజులైంది మద్రాసు వెళ్ళి" చాలా పొడిగా జవాబిచ్చింది ఉపాసన.

"మళ్ళీ ఎప్పుడొస్తారో?"

"రేపు రావచ్చునుకుంటాను!" అంటూ కారు స్టార్టు చేసింది ఉపాసన.

ఆమె అలా పుల్ల విరుపుడుగా మాట్లాడుతోంటే, ఆమె ముందు నైవేద్య విషయం కదపడానికి మనస్కరించలేదు పరంధామయ్యకు.

తిరుగుముఖం పట్టేడు ఇంటికి.

ఏది ఏమైనా, ఒక్కసారి వెళ్ళి నైవేద్యని పలకరించాలి. ఆమె యోగక్షేమాలు కనుక్కోవాలి, అని నిశ్చయించుకున్నాడు. అందరిలా ఆమె తనతో మాట్లాడ్డానికి నిరాకరించదు. బాల్యంలో 'మామయ్యా' అని నోరారా ఆప్యాయంగా పిలిచేది.

పనులు ముగించుకొని సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో బైలుదేరాడు పరంధామయ్య నైవేద్య ఇంటికి.

అప్పటికే, పరిసరాలని చీకట్లు ముసురుకున్నాయి. గేటు తోసి కాంపౌండ్‌లో అడుగుపెట్టాడు. నిన్నట్లాగే, కిటికీగుండా ఇంట్లో వెలుగుతున్న దీపం వెలుగు కనిపిస్తోంది.

మూసి ఉన్న తలుపుని సమీపించాడు. ఇంట్లో అసలు మనుషులున్న అలికిడే లేదు! మునివేళ్ళతో మెల్లిగా తట్టాడు తలుపుని. లోపలినించి జవాబు రాకపోవడంతో, కాసేపాగి, గట్టిగా తట్టాడు.

నిశ్శబ్దం!

అలా కాదని, "అమ్మాయ్, నైవేద్యా!" పిలిచాడు గట్టిగా.

రెండు నిమిషాల తరవాత, ఎవ్వరో అవతలినించి తలుపుని సమీపిస్తున్న అడుగుల సవ్వడి వినిపించింది. తలుపు దగ్గర ఆగిపోయింది శబ్దం.

"ఎవ్వరు?" సన్నగా పలికింది స్త్రీ స్వరం.

"నేనమ్మా, పరంధామయ్యని! మునసబు పరంధామయ్యని!"

"అలాగా! ఏం కావాలి?"

''అదేమిటమ్మా! నీవు తిరిగొచ్చావని తెలిసి, చూసి పోదామనొచ్చాను.''

''మీ పేరు నాకు జ్ఞాపకం లేదండీ!''

''పన్నెండేళ్ళ మాట కదా! పేర్లెలా జ్ఞాపకం వుంటాయి? నన్ను చూస్తే తప్పక గుర్తుపడతావమ్మా! ఇంటికి వచ్చిన అతిధిని ఇలా తలుపుదగ్గిరే నిల్చోబెట్టి మాట్లాడతావా?''

కాసేపు నిశ్శబ్దం! గడియతీస్తున్న చప్పుడు, కిర్రు మంటూ తెరుచుకుంది తలుపు కొద్దిగా.

''లోనికి రావచ్చా అమ్మా?''

''రండి!''

లోన అడుగుపెట్టాడు పరంధామయ్య.

అది విశాలమైన హాలు, పదేళ్ళనించీ, గోడలు సున్నానికి నోచుకోక రంగువెలసి నల్లబారేయి. ఆ ఇంటికి కరెంటు ఎప్పుడో పోయింది. ఎదురుగా, గూట్లో వెలుగుతోంది చిన్న దీపం. దాని కడ్డంగా నిల్చునుంది ఆమె!

అక్కడ తెల్లచీరలో ఓ స్త్రీ నిల్చున్నట్టు కనిపిస్తోందే తప్ప, ఆమె మొహాన్ని పోల్చుకోలేక పోతున్నాడు పరంధామయ్య.

''ఊరొచ్చాక పార్వతీశాన్ని కలిశావా అమ్మా?''

''రాగానే ఆయనకి కబురంపాను. పనిమీద మదరాసు వెళ్ళాడని తెలిసింది.''

''నీ వెంట ఓ పురుషుడుకూడా ఉన్నట్టు ఊళ్లో అంతా చెప్పుకుంటున్నారు. పెళ్ళిగానీ చేసుకున్నావా...?''

ఆమె పేలవంగా నవ్వింది. ''ఆజన్మ బ్రహ్మచర్యం పుచ్చుకున్న నాకు పెళ్ళేమిటండీ?''

"ఐతే, అతను నీ సాక్షిగా ఉంటాడు."

"నేనెవ్వర్నీ నా వెంట తీసుకురాలేదు. అతనెవ్వరో నాకు తెలీదు!"

పరంధామయ్య నిశ్శబ్దంబోయి, "ఈ లంకంత ఇంట్లో ఒక్కర్తివీ ఎలా ఉంటున్నావమ్మా? నీ తిండి తిప్పలూ ఎవ్వరు చూస్తున్నారు? అవసరమైన వస్తువులు ఎలా అందుతున్నాయి?" అడిగాడు.

"ఇంతకాలం ఒంటరిగా జీవించినదాన్ని, అలవాటై పోయింది. ఈ ఒంటరితనం నన్నేమీ భయపెట్టదు. నా అవసరాలు నేను చూసుకోడంకూడా నా కలవాటే!"

"పగలూ, రాత్రీ నీవిలా బందీగా బ్రతకడం మాకు బాధాకరంగా ఉందమ్మా! పన్నెండేళ్ళ తరవాత నిన్ను చూసి ఆనందించాలని ఊళ్లో అంతా తహతహలాడి పోతు న్నారు. ఓసారి అందర్నీ పరామర్శించివస్తే బావుండేది."

"నిజమే! కొద్దిరోజులు విశ్రాంతి తీసుకుని, అవసరమై నప్పుడు అందర్నీ కలుసుకుంటాను."

ఆమె అక్కడే నిల్చుని మాట్లాడుతోంది. కదలడం లేదు. కనీసం మర్యాదకైనా పరంధామయ్యను కూర్చో మన్లేదు. పన్నెండేళ్ళ ఎడబాటు ఆమెలో ఊరివాళ్ళ మీద మునుపటి మమకారాన్నీ, ఆప్యాయతనీ తుడిచిపెట్టి ఉందనుకుని, నిట్టూర్చాడాయన.

"సరే, వెళ్ళొస్తానమ్మా! నావల్ల ఏదైనా సహాయం కావలిస్తే కబురుచెయ్!" అన్నాడు వెనుదిరుగుతూ.

"అలాగే! థాంక్స్!"

ఇంట్లోంచి బైటికి వచ్చి, గేటువైపు నడిచేడు పరంధా మయ్య. వెనక తలుపు మూసుకున్న చప్పుడు!

గేటు తెరిచి బైటికి రాబోతున్న పరంధామయ్య ఉలిక్కిపడ్డాడు. కాంపౌండ్లో ఏపుగా పెరిగివున్న గడ్డి పొదల్లోంచి ఓ రాయి రివ్వున వచ్చి, ఆయన పాదాల ముందు పడింది!

చటుక్కున వంగి దాన్ని అందుకున్నాడు. దానికేదో కాగితం చుట్టి వుంది! గబగబ ఆ కాగితం విప్పి, జేబులోంచి లైటర్ తీసి వెలిగించాడు. ఆ వెలుగులో, కాగితం మీద ఒకే ఒక పంక్తి స్పష్టంగా కనిపిస్తోంది.

'ప్రాణాలమీద ఆశ ఉంటే, నైవేద్యకు దూరంగా ఉండు!' ఆ వాక్యం చదివి నిర్ఘాంతపోయాడాయన.

తను ఇంట్లోకి వెళ్ళడం, నైవేద్యతో మాట్లాడి రావడం. అంతా బైట ఉండి ఎవ్వరో గమనించేరన్న మాట. ఎవ్వరు? ఏమిటీ హెచ్చరిక? చుట్టూ కలయ చూశాడు.

సరిగ్గా అదే క్షణంలో గడ్డి పొదలమధ్య సరసర చప్పుడైంది. భయంతో పరంధామయ్య గుండె వేగంగా కొట్టుకుంది. అంతవరకూ అక్కడ పొంచివున్న వ్యక్తి పారిపోతున్నాడా? గుండెలరచేతిలో పట్టుకుని అక్కడే నిల్చున్నాడు పరంధామయ్య.

రెండు నిమిషాల తరవాత, మళ్ళీ నిశ్శబ్దం ఆవరించింది పరిసరాలని. పరంధామయ్య మనసు కీడును శంకిస్తోంది. ఆ ఘటన ఆయన్ని కాస్త భయపెట్టినా, ధైర్యాన్ని మాత్రం సడలించలేదు.

నైవేద్య ఏదో అనూహ్యమైన ప్రమాదంలో ఇరుక్కున్నట్టు తోచి, ఆరాటంతో వెనుదిరిగి, మళ్ళీ ఇంటివైపు నడిచాడు. మెట్లెక్కి మూసి వున్న తలుపు తట్టేడు.

అదే అడుగుల శబ్దం!

తలుపు కవతల ఆగిపోయింది. "ఎవ్వరు?"

"నేనేనమ్మా, పరంధామయ్యని! నీతో ఓ ముఖ్య విషయం చెప్పాలి."

"ఏమిటి?"

"నేను గేటు దాటుతుండగా, చీకట్లో ఎవ్వరో. రాయికి ఉత్తరం చుట్టి, నావైపు విసిరేరు. అందులో, 'ప్రాణాలమీద ఆశ ఉంటే, నైవేద్యకి దూరంగా వుండు' అని రాసి వుంది!"

"ఐతే?"

"నువ్వేదో ప్రమాదంలో వున్నావని, నా మనసు ఆందోళన పడుతోందమ్మా."

"ఆ ఉత్తరం మీకోసం రాయబడింది. నాకోసం కాదు!"

"అందుకే, నువ్వు ప్రమాదంలో వున్నావంటున్నాను."

"భయపడకండి. నన్ను నేను కాపాడుకోగలను!"

ఈమె ఆడదా? ఆదిశక్తా?? ప్రమాదం పొంచి వుంది మిత్రో అని మొత్తుకుంటున్నా, అంత నిశ్చింతగా మాట్లాడుతోందేమిటి?

"సరేనమ్మా. వస్తాను! నీకంత ధైర్యం వున్నప్పుడు అంతకన్నా ఏంకావాలి?" అంటూ వెనుదిరిగేడు పరంధామయ్య.

వడివడిగా అడుగులేస్తూ, అరగంటలో ఊరు చేరుకున్నాడు. దారి పొడవునా, ఆయనకు నైవేద్య ప్రవర్తన చాలా చిత్రంగా తోచింది.

ఆమెకు దూరంగా ఉండకుంటే తన ప్రాణాలు పోతా

యని ఆ ఉత్తరంలోని హెచ్చరిక! ఆ లెఖ్ఖన ఇప్పుడు తనూ ప్రమాదంలో వున్నాడు. ఈ విషయాన్ని అంత సులభంగా వదలకూడదు. ఇప్పుడే తేల్చిపారెయ్యాలి.

తిన్నగా పోలీస్ స్టేషన్ చేరుకున్నాడు పరంధామయ్య. సబిన్స్పెక్టరుకు ఆ ఉత్తరం చూపి, మొదటినుంచీ అంతవరకూ జరిగినదంతా పూసగుచ్చినట్టు వివరించాడు:

అంతావిన్న ఇన్స్పెక్టర్ కాసేపు తీవ్రంగా ఆలోచించి "మీ వెంట నేనూ వస్తాను. ఈ వ్యవహారం ఏమిటో ఈరాత్రే తేల్చేద్దాం!" అన్నాడు.

# 3

పరంధామయ్య, సబిన్స్పెక్టర్ని, ఓ హెడ్ కానిస్టేబుల్ని వెంట బెట్టుకుని బయలుదేరాడు నాయుడుగారింటికి. అప్పుడు రాత్రి పదిగంటలవుతోంది.

గేటు తెరచి, నిశ్శబ్దంగా కాంపౌండ్లో ప్రవేశించారు.

"తలుపు తట్టేముందు, ఓసారి మేడచుట్టూ తిరిగి చూద్దాం పదండి." అంటూ వెనకవైపు నడిచాడు యిన్స్పెక్టర్.

పిచ్చి మొక్కల్నీ, గడ్డినీ దాటుకుంటూ వెనక్కి వెళ్లారు ముగ్గురూ. ఇన్స్పెక్టర్ జేబులోంచి టార్చితీసి వెలిగించాడు. అక్కడ ఒకప్పుడు మామిడితోట ఉండివుంటుందనడానికి గుర్తుగా, మచ్చుకి మూడు మామిడిచెట్లు మిగిలివున్నాయి.

టార్చి వెలుగులో, నేలమీద కనిపించిన దృశ్యం చూసి క్షణకాలం చకితులయ్యారు. ఎవరో కొత్తగా నేలను తవ్వినట్లు అక్కడక్కడా గుంతలు కనిపిస్తున్నాయి.

మేడ వెనక దొడ్డితలుపు మూసివుంది. ఇన్స్పెక్టర్

అటునడిచి, మునివేళ్ళతో తోసాడు దాన్ని. కిర్రు మంటూ తెరుచుకుంది.

ముగ్గురూ ఒకరిముఖాలొకరు చూసుకున్నారు.

"తను ప్రమాదంలో ఉన్నానని తెలిసి కూడా, నైవేద్య యిలా దొడ్డితలుపు దేనికి తెరిచిపెట్టింది?" ఇన్ స్పెక్టర్ ఆశ్చర్యంగా అన్నాడు.

"అదే నాకూ అర్థం కావడంలేదు" అన్నాడు పరంధామయ్య.

ఒకరివెనుక ఒకరు లోనికి ప్రవేశించారు. అది చావిడి. అక్కడ మరో తలుపుంది. తోసాడు ఇన్ స్పెక్టర్.

తెరుచుకుంది. లోనికి నడిచారు. చిమ్మచీకటి. ఇన్ స్పెక్టరు టార్చి వెలిగించాడు. అది హాలు!

"నేను వచ్చినప్పుడు ఆ గూట్లోనే గుడ్డిదీపం వెలుగుతోంది" అన్నాడు పరంధామయ్య.

మేడలో ఎక్కడా చడీచప్పుడూ లేదు. భయంకర నిశ్శబ్దం! కింద రెండుమూడు గదులున్నాయి. అన్నీ గాలించారు. ఎవ్వరూ లేరు. ఇల్లంతా దుమ్మూ, దూళీ పేరుకునుంది.

"అమ్మాయ్ నైవేద్యా!" పిల్చాడు పరంధామయ్య.

జవాబు లేదు!

హాలుపక్కనే, పైకెళ్ళడానికి మెట్లున్నాయి.

మెట్లవెపు నడిచాడు ఇన్ స్పెక్టర్. వాటిమీదా అంగుళం ఎత్తు దుమ్ము కనిపిస్తోంది. అదివరకు యెవరో చాలాసార్లు పైకెళ్ళినట్టు పాదముద్రలు అస్తవ్యస్తంగా పడున్నాయి. పైకి చేరుకున్నారు ముగ్గురూ.

అక్కడ మూడు గదులున్నాయి. రెండుగదుల తలు

పులు తెరుచున్నాయి. అందులో యెవరూ లేరు. మూడో గది మూసివుంది. తలుపుతో సాదు ఇన్ స్పెక్టర్. సన్నగా చప్పుడుచేస్తూ తెరుచుకుంది.

లోన అడుగుపెట్టి కెవ్వుమన్నాడు పరంధామయ్య.

ఓ గోడవారగా నులకమంచం. మంచంపైన పరుపు. ఆ పరుపుమీద పడుంది ఆమె వెల్లికిలా! సజీవంగా కాదు. నిర్జీవంగా!!

రెండు వక్షోజాలమధ్య పిడివరకూ దిగిన కత్తి. ధారలుగా కారిన రక్తం! విరబోసుకున్న జుత్తు.

టార్చివెలుగు మొహంమీద పడగానే "ఇన్ స్పెక్టర్ ఈమె నైవేద్య కాదు!" అన్నాడు పరంధామయ్య.

"ఎవ్వరు మరి?"

"నేనింతవరకూ ఈ అమ్మాయిని చూళ్లేదు!"

"సాయంత్రం మీరు చూసిందీ, మాట్లాడిందీ ఈమె కాదా?"

"ఈమే!"

"మరి నైవేద్య కాదంటారేమిటి?"

"నేను చూసినప్పుడు హాల్లో గుడ్డిదీపం వెలుగుతుంది. పైగా ఈమె దానికడ్డంగా నిల్చుని మాట్లాడింది. నేనెంత కళ్లు చించుకున్నా ఈమె మొహం చూడలేక పోయాను. ఆ ఒడ్డూ పొడుగూ నాకు బాగా జ్ఞాపకం. ఆమె ఈమే!"

ఇన్ స్పెక్టర్ ఆయన్ని శవం దగ్గరికి తీసికెళ్ళి, "బాగా చూసి చెప్పండి. పన్నెండేళ్ళ దీర్ఘ సమయం మనిషిలో ఎన్నో మార్పులు తెస్తుంది." అన్నాడు.

పరంధామయ్య కాసేపు శవాన్ని పరిశీలించి, "కాదు.

నై వేద్య కాదు. ఆ కుందనపు బొమ్మకీ, ఈమెకీ ఎక్కడా పోలికల్లేవు!'' అన్నాడు.

''ఐతే, నైవేద్యలా నటిస్తూ మూడు రోజుల్నించీ ఈమె ఇక్కడెందుకుంది?''.

''అదే నాకూ బోధపడటం లేదు. ఈమె వచ్చింది మొదలు ఓ గుర్తు తెలియని వ్యక్తి ఈ చుట్టుపక్కల తిరుగుతూ కనిపించాడుట. బహుశా వాడే ఈ పని చేసుంటాడు'' అన్నాడు పరంధామయ్య.

ఇన్స్పెక్టర్ సాలోచనగా తలూపుతూ, గదంతా కలయచూశాడు. ఓ మూల టేబిల్ మీద పెద్ద సూట్ కేస్ కనిపించింది. గబ గబ అటు నడిచి, సూట్ కేస్ తెరిచాడు.

చీరలూ, బ్లౌజులూ, టాయిలెట్ సామాన్లూ గాక, డజనుకు పైగా రకరకాల డ్రైఫుడ్ టిన్స్ ఉన్నాయందులో.

''చూశారా! భోజనం వండుకునే అవసరం లేకుండా వెంట డ్రైఫుడ్ టిన్స్ కూడా తెచ్చుకుంది. ఈ మూడు రోజులూ వీటితోనే గడిపుండాలి!'' అంటూ సూట్ కేస్ లోని సామానంతా బోర్లించాడు ఇన్స్పెక్టర్.

అడుగున చిన్న వేనిటీ బ్యాగ్ కనిపించింది. దాన్నందుకుని తెరిచాడు. నూటయాభై రూపాయలూ, కొంత చిల్లరా, ఓ విజిటింగ్ కార్డ్ బైటపడ్డాయి. ఆతృతగా ఆ కార్డందుకుని చూసాడు.

మిస్. గీతాంజలి,
బ్లూస్టార్ నైట్ క్లబ్.
మద్రాసు.

"హమ్మయ్యా! హతురాలి ఊరూ పేరూ తెలిసేయి. ఈ మాత్రం చాలు. వెంటనే మద్రాసు క్రయింబ్రాంచికి మెసేజ్ పంపాలి. ఇది హత్యకేసు. వాళ్ళే పరిశోధిస్తారు. నువ్విక్కడే శవాన్ని చూస్తూండు, నేవెళ్ళి మెసేజ్ పంపుతాను" అని హెడ్ కానిస్టేబుల్‌కు చెప్పి, పరంధామయ్యను వెంటబెట్టుకుని బైలుదేరాడు సబిన్‌స్పెక్టర్.

## 4

మద్రాసు క్రయింబ్రాంచి హెడ్‌క్వార్టర్స్ నించి ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి, సార్జంట్ డేవిడ్ పంపబడ్డారక్కడికి.

రాజారెడ్డి ఆ యువతి శవాన్నీ, ఇంటినీ క్షుణ్ణంగా పరిశీలించాడు. పరంధామయ్య చెప్పిన కథనం విన్నాడు. తెలతెలవారుతుండగా, శవాన్ని మార్చ్యురీకి స్థానిక సివిల్ హాస్పిటల్‌కు తరలించారు. అప్పటికే ఆ వార్త దావానలంలా వ్యాపించింది ఊరంతా.

ఆ మేడ ముందు ఇద్దరు కానిస్టేబుళ్ళని కాపలా నియమించి, మిగతా అందరూ స్థానిక పోలీస్ స్టేషన్ చేరుకున్నారు.

"ఈ కేసులో ఒకే ఒక విషయం చాలా క్యూరియస్‌గా ఉంది. మేడ వెనక, కొత్తగా తవ్వబడ్డ గుంతలు! ఏమిటవి? ఎవరు తవ్వేరు? ఆ గుంతలకీ, ఆమె హత్యకీ సంబంధం ఉందా? ఒక అనామకురాలు, నైవేద్యగా నటిస్తూ, ఆ మేడలో దేనికి తిష్టవేసింది?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి తీవ్రంగా ఆలోచిస్తూ.

అదే సమయంలో, టేబిల్ మీది టెలిఫోన్ గణగణమంది. సబిన్‌స్పెక్టర్ రిసీవర్ అందుకుని, "ఎస్! పోలీస్ స్టేషన్" అన్నాడు.

"నేను, పార్వతీశం మాట్లాడుతున్నాను. మద్రాసు నించి రాగానే, కొద్దిరోజులుగా నాయుడుగారింట్లో జరిగిన విచిత్ర సంఘటనలు తెలిసేయి. మీతో మాట్లాడి వివరాలు తెలుసుకోవాలనుంది!"

"రండి. వెంటనే బైలుదేరి రండి."

"థాంక్స్!" అవతల ఫోన్ డిస్కనెక్ట్ అయింది.

రిసీవర్ దించి, ఫోన్ ఎవరు చేశారో చెప్పాడు సబిన్‌స్పెక్టర్.

"హమ్మయ్య! పార్వతీశం సమయానికి వచ్చాడు" అన్నాడు పరంధామయ్య.

ఐదు నిమిషాల తరవాత పోలీస్ స్టేషన్ ముందు, ఓ ఫియట్ కారు వచ్చి ఆగింది. బక్కపల్చగా ఉన్న ఓ వ్యక్తి కారు దిగి, లోనికి వచ్చాడు.

"వీరే, లాయర్ పార్వతీశం!" అంటూ రాజారెడ్డికి పరిచయం జేసేడు సబిన్‌స్పెక్టర్.

నలభై ఏళ్ళుంటాయి పార్వతీశానికి. కోల మొహం. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తున్నట్టుండే కళ్ళు. అక్కడక్కడా నెరసిన ఉంగరాల జుత్తు. కళ్ళకి అద్దాలు.

అతను కూర్చున్నాక, "నాయుడుగారు మరణిస్తూ, ఆయన యావదాస్తికీ మిమ్మల్నే ట్రస్టీగా నియమించారు కదూ?" అడిగాడు రాజారెడ్డి.

పార్వతీశం తలూపి, "ఇప్పుడా ఆస్తికి ఏకైక వారసురాలు నైవేద్య! పన్నెండేళ్ళ క్రితం ఆమె ఇల్లు విడిచి వెళ్ళిపోయింది.

ఆ బెంగతో నాయుడుగారు మంచంపట్టి, ఐదేళ్ళ క్రితం పోయేరు. విచిత్రం ఏమిటంటే, తండ్రి మరణించిన

ఆర్నెల్ల తరవాత హఠాత్తుగా నైవేద్య నాకో ఉత్తరం రాసింది!'' అన్నాడు.

''ఏమని?''

''తను ఇల్లు విడిచేటప్పుడు తెచ్చుకున్న నగా నట్రా అమ్ముకుంటూ, ఇంతకాలం దేశంలోని వివిధ పుణ్య క్షేత్రాలు దర్శిస్తూ గడిపేసనీ, ఇప్పుడు చేతిలో డబ్బంతా హరించుకుపోయిందనీ, వెంటనే డబ్బు పంపమనీ కలకత్తా నించి రాసింది ఆ ఉత్తరం!

అలా అనుకోకుండా ఆమె ఆచూకీ తెలిసినందుకు నేనెంతో సంతోషించాను. దురదృష్టవశాత్తూ ఆ వార్త విని ఆనందించడానికి నాయుడుగారీ లోకంలో లేరు.

నైవేద్య కోరిన ప్రకారం, ఆమె పేర ఐదువేల రూపాయల చెక్కు పంపాను. దానితో బాటు ఆమె తండ్రి మరణించిన విషయం తెల్పుతూ వెంటనే ఇంటికివచ్చి, ఆ స్తిపాస్తులు చూసుకోమని జాబురాసాను.

కొద్దిరోజుల్లోనే ఆమెనుండి రెండో వుత్తరం వచ్చింది. తండ్రి మరణం తననెంతగానో కృంగదీసిందనీ, ఇంటికి రాలేననీ, వస్తే తండ్రి జ్ఞాపకాలు వేధిస్తాయనీ, తను ఒక చోట స్థిరంగా ఉండననీ, చిరునామా మారినప్పుడల్లా తెలీజేస్తాననీ రాసింది.

తరవాత, దేశం నలుమూలలనించీ ఆమె ఉత్తరాలు రాసాగాయి డబ్బుకోరుతూ. కోరినంత పంపేవాణ్ని. చివరికి భూమీపుట్రా అమ్మే స్థితికూడా వచ్చింది. దానికామె అభ్యంతరం చెప్పలేదు.

ఇన్నాళ్లూ ఆమె ఆ స్తిపాస్తులు కొద్దికొద్దిగా అమ్ముతూ డబ్బు పంపేను. వారంరోజులక్రితం ఆమె రాసిన చివరి

ఉత్తరం మద్రాసునించే వచ్చింది! అందులో అర్జంటుగా ఆరువేలు కావాలని రాసింది. తన చిరునామా తెల్పకుండా, కేరాఫ్ జనరల్ పోస్టాఫీస్ పేర డబ్బు పంపమని కోరింది!"

"పంపారా?"

పార్వతీశం పెదవి విరిచి, "నా స్వంత డబ్బులో కొంత పంపవలసి వచ్చింది. కారణం, ఇప్పుడామె ఆ స్త్రీలో మిగిలినదల్లా రెండే రెండు వస్తువులు" అన్నాడు.

"ఏమిటవి?

"ఒకటి వాళ్ళ ఇల్లు. రెండోది..." అంటూ ఆగి పోయాడు పార్వతీశం.

"చెప్పండి!"

"క్షమించండి ఇన్స్పెక్టర్! నేను చెప్పకూడదు. ఆ రహస్యాన్ని వైదేహి తప్ప మరెవ్వరికీ చెప్పవద్దని, నాయుడుగారు మరణిస్తూ నాచేత ప్రమాణం చేయించారు. మరణించినవారి చివరికోరిక మన్నించడం మన సాంప్రదాయం!

ఆ రహస్యం ఉత్తరాల్లో రాసేది కాదు గనక, వైదేహి రాసే ఉత్తరాల్లో నేనెప్పుడూ దాని ప్రస్తావన ఎత్తలేదు. ఏదో ఒకనాడామె తిరిగి వస్తుందికదా, అప్పుడు చెబుదామని ఊరుకున్నాను.

ఇప్పుడు ఆ సంతా హారించుకుపోయింది. పైగా, ప్రస్తుతం వైదేహి మద్రాసులోనే ఉంది. ముఖాముఖి కలుసుకుని చెబుదామని, మద్రాసు వెళ్ళి ఎంత గాలించినా ఆమె ఆచూకీ దొరకలేదు.

తను కనిపిస్తే, బలవంతంగా ఎక్కడ ఇంటికి లాక్కుపోతారో అని భయపడి, కనిపించకుండా జాగ్రత్తపడు

తోంది కాబోలు!"

"నేనోకసారి ఆమె రాసిన ఉత్తరాలు చూడాలను కుంటున్నాను. దానివల్ల ఆమె సైకాలజీ స్టడీ చెయ్య వచ్చు. చూపిస్తారా?" అడిగాడు ఇన్స్పెక్టర్.

"తప్పకుండా! ఇప్పుడే పట్టుకొస్తాను" అంటూ లేచాడు పార్వతీశం.

కార్లో వెళ్ళి, పది నిముషాల్లో తిరిగి వచ్చాడు.

అతని చేతిలో చిన్న ఉత్తరాల కట్ట వుంది. దాదాపు పాతిక ఉత్తరాలు వుంటాయవి. వాటితో బాటు నైవేద్యకు డబ్బు పంపిన రసీదులూ వున్నాయి.

కట్ట విప్పి, మొదటి ఉత్తరం అందుకున్నాడు ఇన్స్పెక్టర్ రాజారెడ్డి. అది పన్నెండేళ్ళ క్రితం నైవేద్య ఇల్లు విడిచిపోతూ రాసిన ఉత్తరం!

'డియర్ పార్వతీశం!

జీవితంలో మనం ఏవేవో అనుకుని ఊహా హార్మ్యాలు నిర్మించుకుని అలాగే జరుగుతాయను కుంటాము. కాని, పీధి వీచే వడగాడ్పుల కవన్నీ త్రుటిలో శిధిలమౌతాయని నా కిప్పుడే తెలిసింది.

నీవంటి పిరికివాడికీ, అర్భకుడికీ మనసిచ్చి నే నెంత పొరబాటు చేశానో ఇప్పుడే గ్రహించాను. నా మనసు విరిగిపోయింది. జీవితంమీదే విరక్తి పుట్టింది. నీకు దూరంగా, దిగంతాల కందనంత దూరంగా పారిపొమ్మని, మనసు పదేపదే ఆరాట పెడుతుంది.

వెళుతున్నాను. మనశ్శాంతిని వెదుక్కుంటూ వెళ్ళిపోతున్నాను. అది దొరికిననాడే నిక్షేపంగా

తిరిగి వస్తాను. అంతవరకూ సెలవ్. నాన్నగారికి ధైర్యం చెబుతూ వుండు. నేను తప్ప ఆయనకీ లోకంలో మరెవ్వరూ లేరు! ఉంటాను.

ఇట్లు

నైవేద్య'

ఆ తరవాత, చాలాకాలానికి కలకత్తానించి రాసింది ఉత్తరం. అదే ఆమె డబ్బు పంపమని కోరుతూ రాసిన మొదటి ఉత్తరం.

ఆ తరవాతి ఉత్తరాలన్నీ దేశంలోని వివిధ ప్రదేశాల నించి వచ్చినవి. చివరి ఉత్తరం మాత్రం కొద్ది రోజుల క్రితమే మద్రాసునించి పోస్ట్ చెయ్యబడింది.

ఉత్తరాలు చూడటం పూర్తయ్యాక, రసీదులు పరిశీలించాడు రాజారెడ్డి. అన్నీ పెద్దపెద్ద మొత్తాల్లో డబ్బు పంపినవి.

తిరిగి వాటిని కట్టకట్టి పార్వతీశానికిస్తూ, "ఆల్ రైట్! మీరు వెళ్ళి రెస్టు తీసుకోండి. అవసరమైతే మళ్ళీ పిలిపిస్తాం!" అన్నాడు ఇన్ స్పెక్టర్.

పార్వతీశం వెళ్ళిపోయాడు.

## 5

టెలిఫోన్ మోగింది.

సబ్ ఇన్ స్పెక్టర్ రిసీవర్ అందుకుని, "ఎస్, స్పీకింగ్!" అన్నాడు.

"నేను. హాస్పిటల్ నించి డాక్టర్ ప్రభుదాస్ మాట్లాడుతున్నాను. మీరు తక్షణం ఇక్కడికి రావాలి!"

"ఏం జరిగింది?"

"మీరు పంపిన శవాన్ని నేను మార్చ్యురీ జరపబోతుండగా, ఓ వ్యక్తి వచ్చి, ఇక్కడ పెద్ద గొడవచేస్తున్నాడు. మనిషి బాగా తాగి వున్నాడు. పేరు ఆనందరావుట. ఆ శవాన్ని ఒక్కసారి చూసి తీరాలని పట్టుబడుతున్నాడు."

"ఎందుకు?"

"ఆమె నైవేద్య ఔనో, కాదో చూసి గుర్తుపడతాడట!"

"ఆల్ రైట్! అతన్నక్కడే ఆపి వుంచండి. క్షణంలో వచ్చేస్తాం!" అంటూ రిసీవర్ దించి, ఆ విషయాన్ని రాజారెడ్డికి వివరించాడు సబిన్స్పెక్టర్.

"ఏ ఆనంతరావు? బట్టలదుకాణం ఆనందరావేనా?" అడిగాడు పరంధామయ్య మధ్యలో.

"ఔను. వాడే! ఊళ్లో తప్పతాగి, గొడవచేసేది వాడేగా?"

"అర్థమైంది. నైవేద్య యుక్తవయసులో, ఆమెని అజ్ఞాతంగా ఆరాధించిన వాళ్ళలో అతనూ ఒకడు. అతనిది ఏకపక్షం ప్రేమ. నైవేద్య ఇల్లు విడిచిపోవడంతో, ఆమెని మర్చిపోడానికి తాగుడలవాటు చేసుకున్నాడు.

తప్పతాగి, నైవేద్య నామం జపిస్తూ వీధుల్లో తిరిగేవాడు. దారికి తేవాలని పెద్దలు పెళ్ళిచేసారు. ఐనా, తాగుడు మానలేదు. అదీ కథ!" అన్నాడు పరంధామయ్య.

"ఆ దేవదాసెవరో మనమూ చూద్దాం పదండి." అన్నాడు ఇన్స్పెక్టర్ రాజారెడ్డి లేస్తూ.

అందరూ జీప్లో హాస్పిటల్ చేరుకున్నారు.

ఆనందరావు వరండాలో బెంచీమీద కూర్చొని వున్నాడు.

నోటికి విరామం లేకుండా ఏదో వాగుతున్నాడు. "ప్లీజ్...ఒక్కసారి ఆమెని చూడనివ్వండి...నా సర్వస్వాన్ని ఒక్కసారి చూడనివ్వండి డాక్టర్! ఆమె... నైవేద్య ఔనో...కాదో చిటికెలో, చెప్పేస్తాను..."

రాజారెడ్డి అతని భుజం తట్టి—"నీకా అవసరం లేదు. ఆమె నైవేద్య కాదని తేలిపోయింది." అన్నాడు.

ఆనందరావ్ ఇన్‌స్పెక్టర్ని ఎగాదిగా చూసి, "నన్నాపడానికి నువ్వెవరు?" అన్నాడు అరుస్తూ.

ఇన్‌స్పెక్టర్ ఏదో చెప్పబోతుండగా, అప్పుడే హాస్పిటల్లోంచి వరండాలోకి వచ్చిన ఓ మధ్య వయస్కురాలు, ఆనందరావుని చూసి తక్కున ఆగిపోయింది.

"ఇన్‌స్పెక్టర్ గారూ! రాత్రి నాయుడుగారింటి దగ్గర ఇతను అనుమానాస్పదంగా తిరుగుతుండటం నా కళ్లారా చూశాను" అంది సబిన్‌స్పెక్టర్‌తో.

అది విని అక్కడున్నవాళ్ళంతా నివ్వెరపోయారు.

ఆనందరావామెని మింగేసేలా చూస్తూ, "ఔను. వెళ్ళాను. నీకెందుకు" అన్నాడు రంకెలేస్తూ.

ఇన్‌స్పెక్టర్ అతన్నాపి, "ఆ మేడదగ్గరికెందుకెళ్లావు?" అడిగాడు.

"ఇంకా ఎందుకు? నైవేద్యని చూట్టానికి. ఆమె ఊళ్లోకి వచ్చి మూడు రోజులైనా ఎవ్వర్నీ కలవలేదు. ఎవ్వరూ ఆమెని చూళ్ళేదు. కనీసం నేనైనా ఒక్క చూపు చూసివద్దామని వెళ్ళాను."

"ఇతను కిటికీ దగ్గర నిల్చుని, తొంగి తొంగి చూస్తూ

కనిపించాడు నాకు. ఇతనే ఆమెని చంపుంటాడు!" మధ్యలో అందుకుందా స్త్రీ.

ఆమెమీద కురకబోతున్న ఆనందరావు నాపి, "అప్పుడు టైం ఎంతై వుంటుంది?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"తొమ్మిది గంటలనుకుంటాను."

"అంత రాత్రి మీరక్కడేం చేస్తున్నారు?"

"ఆఁ, అలా అడగకండి ఇన్‌స్పెక్టర్." అన్నాడు ఆనందరావ్.

"పనిమీద రంగాపురం వెళ్ళొస్తున్నాను. అక్కణ్నించి బైలుదేరేసరికి చీకటి పడింది. ఇతను నాయుడు గారింటి గేటు తెరుచుకుని లోనికెళ్ళడం చూశాను, మసక చీకట్లో.

ఏం చేస్తాడో చూద్దామని అక్కడే నిల్చున్నాను. దొంగలా కిటికీని సమీపించాడు. అప్పుడా కిటికీ తెరిచుంది. లోపల చిన్న దీపం వెలుగుతోంది. అందుకే, నేనతన్ని బాగా గుర్తుపట్టగలిగేను."

"ఔను...వెళ్ళాను...అంతేగాని, ఆమెని చంపలేదు.. నా ఆరాధ్యదేవతని చేజేతులా ఎలా చంపుతాననుకున్నావ్?" అరిచాడు ఆనందరావు.

అదే సమయంలో మరో స్త్రీ అక్కడికి వచ్చి, ఆనందరావుని చూసి, "ఇక్కడేం చేస్తున్నారండీ? తాగితే ఒక్కచోట పడుండరుగదా! పదండి ఇంటికి" అంది అతని రెక్క పుచ్చుకుంటూ.

"ఎవ్వరీమె?" అడిగాడు రాజారెడ్డి పరంధామయ్యని.

"ఆనందరావు భార్య!"

"ఇప్పుడతను మనలో లేడు. తర్వాత మాట్లాడదాం. వెళ్లనివ్వండి" అన్నాడు సబిన్స్పెక్టర్తో.

భార్యవెంట వెళ్లిపోయాడు ఆనందరావ్.

డాక్టర్తో శవపరీక్ష ప్రారంభించమని చెప్పి, తిరిగి జీపులో బయలుదేరారంతా.

# 6

పోలీసు స్టేషన్ ముందు జీపాపి, వాళ్లు లోనికెళ్లారో లేదో, ఓ అంబాసిడర్ కారువచ్చి ఆగింది గేటుదగ్గర.

నాయుడు గారింటిముందు కాపలా వుంచి వచ్చిన కానిస్టేబుళ్లూ, ఫుల్ సూటులోవున్న ఓ ఆరడుగుల వ్యక్తి దిగి లోనికి వచ్చారు.

"ఏం జరిగింది? ఈయనెవరు?', అడిగాడు సబిన్స్పెక్టర్ వాళ్లని.

"ఆకార్లో ఈయన నాయుడుగారింటికివచ్చి, ఒక్కసారి ఆ యింట్లోకెళ్ళి చూడనివ్వమని మాతో పేచీకి దిగాడు. అనుమానంవేసి, లాక్కొచ్చాం" అన్నాడో కానిస్టేబుల్.

సబిన్స్పెక్టర్ ఆ వ్యక్తిని ఎగాదిగాచూసి, "యెవ్వరు మీరు? నాయుడుగారింట్లో మీకేం పని?" అడిగాడు.

అతను మౌనంగా జేబులోంచి ఓ విజిటింగ్ కార్డుతీసి బల్లమీద గిరాటేశాడు. సబిన్స్పెక్టర్ కార్డందుకుని చూసాడు.

'మిస్టర్ దివాకర్,
ప్రొప్రయిటరాఫ్ బ్లూస్టార్ నైట్క్లబ్,
మద్రాసు' అని వుంది.

ఆ చిరునామా చదివి నివ్వెరబోయాడు సబిన్‌స్పెక్టర్. కారణం రాత్రి హత్యచెయ్యబడ్డ యువతి పర్సులోనూ ఇదే అడ్రస్ ముద్రించిన కార్డు దొరికింది. దీన్ని కేవలం కాకతాళీయమనుకోవాలా? లేక...

ఆలోచిస్తూ దాన్ని రాజారెడ్డి కండించి "నా రెండో ప్రశ్నకు మీరింకా జవాబివ్వలేదు" అన్నాడు అతన్ని చూస్తూ.

ఈమధ్య ఆయింటిని అమ్మబోతున్నట్టు లాయర్ పార్వతీశంగారు పత్రికల్లో ప్రకటించిన వార్తచూసి, దాని ఖరీదు ఎంతవుంటుందో ప్రత్యక్షంగా అంచనా వేసుకుందామని బయలుదేరాను.

ఆ ఇంటిముందు పోలీసులు కాపలా వున్నారు. అక్కడ వారి కాపలా ఎందుకో నాకు తెలియదు. ఐనా, ఎలాగూ ఇంతదూరం వచ్చాను గనక, ఓసారి లోపలకెళ్ళి చూద్దామని ట్రైచేశాను. అంతే. ఇక్కడికి లాక్కొచ్చారు వీళ్ళు. నేనోసారి లాయర్ పార్వతీశంగార్ని కలుసుకోవాలనుకుంటున్నాను" అన్నాడతను.

"గీతాంజలి తెలుసా మీకు?" హఠాత్తుగా అడిగాడు ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి అతన్ని.

అతని కనుబొమలు ముడిపడ్డాయి. "ఏ గీతాంజలి?"

"ఆ పేరుగల వారెవ్వరూ మీక్లబ్‌లో లేరా?"

"లేరే!"

"ఆల్‌రైట్! పార్వతీశంగార్ని కలుసుకోవాలన్నారు కదూ? వెళ్ళండి."

"థాంక్స్! వస్తాను" అంటూ బయటకి నడిచాడతను.

"డేవిడ్! ఫాలోహిమ్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్

రాజారెడ్డి సార్జంట్‌తో.

అప్పటికే దివాకర్ తన కారెక్కి వెళ్ళిపోయాడు.

సార్జంట్ గబగబ బయటకెళ్ళి జీపెక్కాడు.

పావుగంటలోపల తిరిగి వచ్చింది జీపు.

"అతను లాయర్ ఇంటికి వెళ్ళలేదు సార్. అరవై మైళ్ళ స్పీడుతో మద్రాసువైపు పోతున్నాడు" అన్నాడు డేవిడ్.

ఇన్‌స్పెక్టరిద్దరూ వొకరి మొహాలొకరు చూసు కున్నారు.

"వెంటనే పార్వతీశాన్ని పిల్చుకురా!" అన్నాడు రాజారెడ్డి.

సార్జంట్ వెళ్ళి పదినిముషాలలో అతన్ని వెంటబెట్టు కొచ్చాడు.

"మీరా ఇల్లు అమ్మబోతున్నట్టు పత్రికల్లో ప్రకటిం చారా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"లేదే! ఎవరుచెప్పారు మీకు?" నోరు తెరిచాడు పార్వతీశం. ఇన్‌స్పెక్టర్ జరిగింది అతనికి వివరించాడు.

అంతా విన్న పార్వతీశం భ్రుకుటి ముడివడింది. సాలో చనగా తలూపి, "ఇప్పుడర్థమయింది! ఇన్‌స్పెక్టర్ గారూ! ఇక దాచి లాభంలేదు. నాభార్య ఉపాసనకి క్లబ్బులో పేకాట ఆడే దురలవాటుంది.

ఆమె దురదృష్టమో, నాఖర్మో తెలీదుగానీ ఉపాసన తరచూ జూదంలో ఓడిపోతుంది. అప్పుడప్పుడూ క్లబ్బు వాళ్ళకి బాకీపడుతుంది. అవి చెల్లించేది నేనే. ఆమెనా దురలవాటునుంచి తప్పించడానికి నేనుచేసిన ప్రయత్నా లన్నీ విఫలమయ్యాయి.

ప్రస్తుతం ఆమె మద్రాసులోనే వుంది. బ్లూస్టార్ నైట్ క్లబ్బులోనే తరచూ ఆడుతుంది. బహుశా, ఈ మధ్య ఏ పెద్ద మొత్తమో అక్కడ బాకీపడుంటుంది. అందుకే నన్ను కలుసుకొని, బాకీకింద నాయుడుగారి ఇల్లు కొనెయ్యమని అతన్ని ఆమే పంపివుంటుందని నా అనుమానం!'' అన్నాడు నీరసంగా.

''అటువంటి భార్యని మీరింతకాలం ఎలా భరిస్తున్నారు? ఇన్ని అవస్థలు పడేకంటే, విడాకుల ద్వారా ఆమెనించి విముక్తి పొందవచ్చుగా?'' అన్నాడు యిన్స్పెక్టర్.

పార్వతీశం పేలవంగా నవ్వి ''నాలో అంత ధైర్యమే వుండివుంటే ఆమెనసలు కట్టుకునే వాణ్నేకాదు.'' అన్నాడు.

అదే సమయంలో టెలిఫోన్ మోగింది.

సబిన్స్పెక్టర్ రిసీవర్ అందుకుని ''ఎస్...స్పీకింగ్!'' అన్నాడు.

''ఇన్స్పెక్టర్! మీరు వెంటనే హాస్పిటల్ కిరాగలరా!'' అవతలినించి డాక్టర్ కంఠం వినిపించింది ఆత్రుతగా.

''వాట్ హేపెండ్ సార్?''

''మీరు తక్షణం ఇక్కడికి రావాలి. శవంలోంచి ఆశ్చర్యకరమైన వస్తువొకటి బయటపడింది!''

''ఇప్పుడే వస్తున్నాం!'' అంటూ రిసీవర్ క్రెడిల్ చేసి రాజారెడ్డికి సంగతి వివరించాడు.

పార్వతీశాన్ని పంపేసి సార్జంట్, సబిన్స్పెక్టర్లతో శీఘ్రం వెళ్ళాడు రాజారెడ్డి.

7

హాస్పిటల్ వరండాలో నిల్చుని వాళ్ళకోసమే ఎదురు చూస్తున్నాడు డాక్టర్. వాళ్ళు జీప్ దిగగానే, "నా వెంటరండి!" అంటూ ముగ్గుర్నీ మార్చ్యురీ గదిలోకి తీసి కెళ్ళాడు.

గదిమధ్య టేబిల్ మీద వెల్లకిలా పడుకోబెట్టి వుంది గీతాంజలి శవం. "చెప్పండి ఏం జరిగింది?" అడిగాడు రాజారెడ్డి ఆత్రంగా.

డాక్టర్ జేబులోంచి మడతపెట్టిన చిన్న మైనపు కాగితంతీసి అందించాడతనికి. ఆత్రంగా కాగితం విప్పి చూసాడు ఇన్ స్పెక్టర్.

అది మ్యాప్! ఇండియన్ ఇంక్ తో వేసిన ఇంటి మ్యాప్!

"ఎక్కడ దొరికింది మీకు?" అడిగాడు ఆశ్చర్యంగా.

"శవాన్ని మార్చ్యురీ చెయ్యబోతూ, తలకాస్త పైకి యెత్తడానికి చెయ్యి పెట్టేను. వెంట్రుకలమధ్య ఏదో వున్నట్టు వేళ్ళకి తగిలింది. ఏమిటా అని పరీక్షగా చూశాను. ఇది కనిపించింది. ఆమె జుత్తు అడుగున గమ్ తో అతికించి వుంది!" అన్నాడు డాక్టర్.

మ్యాప్ ను జాగ్రత్తగా పరిశీలించాడు ఇన్ స్పెక్టర్.

అది నాయుడుగారి ఇంటిమ్యాప్!

ఇంటి ముందుభాగమూ, వెనక భాగమూ స్పష్టంగా చిత్రించి వున్నాయి. వెనకభాగంలో దూర దూరంగా నాటిన మూడు మామిడిచెట్లు, ఆ చెట్లనడుమ ఓ సమాధి ఆ సమాధికి కొద్దిదూరంలో నేలపై క్రాస్ గుర్తూ వేసి వున్నాయి.

"ఇది నాయుడుగారి ఇంటిమ్యాపే. నేను మద్రాసు నుంచి వచ్చి, ఆ ఇంటి పరిసరాలను చూసినప్పుడు

పెరట్లోవున్న ఈ సమాధి నన్నాకర్షించింది. హడా వుడిలో అప్పుడు దాని విషయం మర్చాను.

నాయుడుగారు హిందూవులు. మరణించిన వారిని దహనం చెయ్యడం హిందూధర్మం. హిందువులయిన నాయుడుగారి ఇంటి పెరట్లో సమాధి ఏమిటి?'' అడిగాడు రాజారెడ్డి సబిన్స్పెక్టర్ని.

అతను భుజాలెగరేసి, ''నేనీ ఊరికి ట్రాన్స్ఫరై ఏడాదే అవుతోంది. నాకివేమీ తెలీవు...ఆఁ, పరంధామయ్యకి తప్పక తెలిసి వుంటుంది ఈసమాధి గురించి'' అన్నాడు.

సార్జంట్ని పంపి, వెంటనే పరంధామయ్యను పిలిపించారు.

ఆయన ఆ కాగితాన్ని చూసి, ''ఔను. ఇది నాయుడుగారి ఇల్లే. మీరన్నట్టు నిజంగానే ఈ సమాధికో కథ వుంది.

చిన్నప్పుడు నైవేద్య ఓ కుక్కని పెంచేది. అదంటే ఆ పిల్లకి పంచప్రాణాలు. ఒకరోజు కుక్క జబ్బుపడి మరణించింది.

ఆ దుఃఖాన్ని భరించలేక పోయింది నైవేద్య. దాన్ని ఇంటి పెరట్లో పాతి ఈ సమాధి కట్టించింది. పోతే, మ్యాప్లో కనిపిస్తున్న ఆ క్రాస్ గుర్తేమిటో నాకర్థం కావటం లేదు'' అన్నాడు.

ఇన్స్పెక్టర్ సాలోచనగా తలూపుతూ దాన్ని మడత పెట్టి, పర్సులో భద్రం చేసుకున్నాడు. ''హతురాలు దీన్నింత జాగ్రత్తగా వెంట్రుకలమధ్య దాచుకుందంటే, తప్పకుండా ఇందులో యేదో రహస్యం ఇమిడివుందన్న మాట!

ఉదయం యిక్కడ ఆనందరావ్ ఈమె శవాన్ని ఒక్కసారిచూస్తానంటూ గొడవచేశాడు. రాత్రిళ్ళు అతను నాయుడుగారింటి పరిసరాల్లో తచ్చాడుతూ కనిపించాడు. పదండి. ఇప్పుడతని మత్తు దిగివుంటుంది'' అంటూ వేను దిరగ బోయాడు ఇన్‌స్పెక్టర్.

సరిగ్గా ఆదేక్షణంలో తలుపుదగ్గర బూట్సుల శబ్దం వినిపించింది. ''కదలకండి! చేతులెత్తినిల్చోండి అక్కడే'' అన్న కంచుకంఠం విని స్తబ్ధులయ్యారు అంతా.

గుమ్మంలో రెండు భారీశరీరాలు నిల్చున్నాయి. ఇద్దరి చేతుల్లోనూ మెరుస్తున్నాయి పిస్తోళ్ళు.

''మీలో ఎవరయినా, ఏకాస్త పిచ్చిపని చేసినా, నిర్దయగా కాల్చిపారేస్తాం! చేతులెత్తండి'' ఆజ్ఞాపించాడొకడు.

గత్యంతరంలేదు. చేతులెత్తారంతా!

ఒకడు పిస్తోలుతో వాళ్ళని కవర్ చేస్తూ తలుపుదగ్గరే నిల్చున్నాడు. రెండోవ్యక్తి మెరుపులా శవంపడున్న టేబుల్ని సమీపించి, శవాన్ని అమాంతం భుజాన వేసుకున్నాడు.

గదిలోవున్న వాళ్ళంతా గుడ్లప్పగించి చూస్తున్నారీ దృశ్యాన్ని. శవంతోసహా అతను తలుపుని సమీపించాడు. దురదృష్టవశాత్తూ సార్జంట్ డేవిడ్ తలుపు దగ్గరే వున్నాడు.

ఒకడు సార్జంట్ డొక్కలో పిస్తోలు పొడిచి, ''మా వెంట ఇతన్ని తీసుకెళ్తాం. మీరు మమ్మల్ని వెంబడించవచ్చు. వెంబడించకుండా బుద్ధిగా వున్నారంటే, కొద్ది దూరంలో ఇతన్ని వదిలేస్తాం. లేదా, చంపి కైలాసానికి

పంపిస్తాం'' అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ తలూపాడు.

''పద.'' అంటూ పిస్తోలు మొనతో సార్జంట్‌ని అవతలకి తీసుకెళ్ళారు.

మరుక్షణం కారుబయట టపటపా అయిన చప్పుడు.

ఊహించని ఆ సంఘటన అందర్నీ దిగ్భ్రాంతుల్ని చేసింది.

''ఆ మూర్ఖులకి శవంతో ఏమిటి పని? దేనికి తీసికెళ్ళారు?'' అడిగాడు డాక్టర్ అయోమయంగా.

ఇన్‌స్పెక్టర్ పలకలేదు. తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

సార్జంట్ సురక్షితంగా తిరిగివస్తాడా లేదా అని అందరి గుండెలూ పీచుపీచు మంటున్నాయి.

# 8

గంట తరవాత తిరిగి వచ్చాడు సార్జంట్ డేవిడ్. అతని మోచేతులమీదా, మొహంమీదా చిన్నచిన్న దెబ్బలు కనిపిస్తున్నాయి.

''వాళ్ళతో ఫైట్ చేసి తప్పించుకున్నావా?'' అడిగాడు ఇన్‌స్పెక్టర్.

''నో! కారు మద్రాసు రోడ్‌మీదికి మళ్ళి, మైలు దూరం వెళ్ళాక, తమనెవ్వరూ వెంబడించడం లేదని నిశ్చయించుకుని, నడుస్తున్న కార్లోంచి నన్ను తోసేశారు. ఓ లారీ ఎక్కి వచ్చాను.''

''వాళ్ళ సంగతి తరవాత చూద్దాం! ముందు ఆనంద రావుని కలుసుకోవాలి పదండి.'' అంటూ బైటికి నడిచాడు రాజారెడ్డి.

నలుగురూ జీపెక్కి బైలుదేరారు.

పరంధామయ్య చూపిన ఇంటి ముందు దిగారు. తలుపు మూసుంది. తట్టాడు సార్జంట్.

"ఎవరూ?" అంటూ తెరిచింది ఆనందరావు భార్య.

"ఆయన ఉన్నాడా ఇంట్లో?"

"మళ్ళీ తాగి పడుకున్నారండీ!"

సబిన్‌స్పెక్టర్ మొహం చిట్లించాడు. "మాట్లాడే స్థితిలో లేడా?"

ఆమె తల తిప్పి—"మీరెందుకొచ్చారో నాకు తెలుసు! ఆ యువతిని మావారే చంపివుంటారని మీ అనుమానం కదూ? ఆ హత్య ఆయన చెయ్యలేదని గట్టిగా చెప్పగల్ను!" అంది.

ఇన్‌స్పెక్టర్ కళ్ళు విప్పారేయి. "అంత ఖచ్చితంగా చెప్పడానికి ఆధారాలేమిటి?"

"ఉన్నాయి! ఆయన ఒకప్పుడు నైవేద్యని ప్రేమించిన సంగతి నాకు తెలుసు. గత నాలుగు రోజులుగా, నైవేద్య తిరిగి వచ్చిందని ఊళ్ళో పుకారు బైలుదేరింది. అప్పట్నించీ ఆయన వాలకం మారిపోయింది.

రాత్రులు ఇంటికి రావడం మానేశారు. ఆ నైవేద్య తోనే గడుపుతున్నారేమోనని నా కనుమానం వేసింది. నిన్నరాత్రి ఆయన్ని రహస్యంగా వెంబడిస్తూ వెళ్ళాను. నా అనుమానమే నిజమైంది.

ఆయన తిన్నగా నైవేద్య ఇంటికెళ్ళి, ముందు కిటికీ లోంచి తొంగి చూశారు. తరవాత, తలుపు తెరుచుకుని ఇంట్లో ప్రవేశించారు. లోపల వాళ్ళేం చేస్తున్నారో చూద్దామని మెల్లిగా కిటికీని సమీపించి చూసాను.

ఆయనా, ఆ యువతీ మంచంమీద కూర్చున్నారు. ఆమె చేతిలో చిన్న కాగితం వుంది. దాన్ని ఆయనకి చూపిస్తూ ఏదో చెబుతోంది. వాళ్ళేం మాట్లాడుకున్నారో నేను వినలేకపోయాను.

కాసేపటికి ఆయన ఆమెవద్ద సెలవు తీసుకుని ఇంటికి వచ్చేశారు. అంతవరకూ ఆమె సజీవంగానే వుంది. అందుకే అంత ఖచ్చితంగా చెప్పగలుగుతున్నాను, మావారు ఆ హత్య చెయ్యలేదని!''

ఇన్‌స్పెక్టర్ బుర్ర చురుగ్గా పనిచెయ్యసాగింది. ఆ యువతి మూడు రోజుల్నించీ నైవేద్యగా నటిస్తూ ఆ ఇంట్లో తిష్టవేసి, పెరట్లో దేనికోసమో తవ్వుతూ వెతక సాగింది. మూడు రోజులైనా ఆమెకా వస్తువు దొరక లేదు!

తనకి మరొకరి సహాయం అవసరమనీ, ఆ వూరివాళ్ళ లోనే ఎవ్వరైనా పట్టాలనీ నిశ్చయించింది. కాకతాళీయంగా, నైవేద్యకోసం అక్కడ పడిగాపులు కాస్తున్న ఆనందరావ్ కనిపించుంటాడామెకి.

అతన్ని లోనికి పిల్చి, ఆ కాగితం చూపించి వుంటుంది.

బాగా ఆలోచించి, ఈ రోజు మళ్ళీ వస్తానని చెప్పి వచ్చుంటాడు ఆనందరావ్. అతనిటు రాగానే, అక్కడ ఆమె హత్య జరిగింది.

ఉదయం ఆనందరావుకు ఆమె హత్య సంగతి తెలిసే సరికి, ఎలాగైనా రాత్రి ఆమె చూపించిన మ్యాప్ చేజిక్కించుకోవాలనుకున్నాడు. అందుకే, హాస్పిటల్లో ఆమె శవం పోస్ట్‌మార్టం జరుగుతున్నప్పుడు ఒక్కసారి చూస్తానని గొడవచేశాడు.

"ఆయనతో కూడ మాట్లాడాలి. పిలవండి." అన్నాడు ఇన్ స్పెక్టర్.

ఆనందరావు భార్య లోనికెళ్ళిన రెండు నిమిషాల తరవాత, తడబడే అడుగులతో బైటికి వచ్చాడు ఆనందరావ్.

అతన్ని జీవ్ ఎక్కించి, తిన్నగా స్థానిక పోలీస్ స్టేషన్ కి తీసికెళ్ళాడు ఇన్ స్పెక్టర్.

"మిస్టర్ ఆనందరావ్! నాయుడుగారింట్లో హత్య జరిగిన రాత్రి, నీవా ఇంటికెళ్ళావనీ, హతురాలు నీకు నిధికి సంబంధించిన ఒక మ్యాప్ చూపించిందనీ మాకు తెలుసు! ఏమంటావ్?" అడిగాడు రాజారెడ్డి.

ఆనందరావు మత్తు సగం వదిలింది. "ఆ మ్యాప్ గురించి మీకెలా తెలిసింది?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఎలా తెలిసిందో నీకనాసరం! నేను చెప్పింది నిజమేనని ఒప్పుకుంటావా, లేక మా పద్ధతులుపయోగించి నిజాన్ని కక్కించమంటావా?"

"నిజమే! ఆ రాత్రి నేను నైవేద్యని చూడాలన్న కాంక్షతో వెళ్ళానా ఇంటికి. ఐతే, అక్కడ నైవేద్యకి బదులు ఎవ్వరో అపరిచిత యువతి కనిపించింది.

ఆమెని చూడగానే నాకు కళ్ళు మండిపోయింది. నాలుగు రోజుల్నుంచీ నన్ను తికమక పెట్టినందుకు, ఇప్పుడే వెళ్ళి ఊళ్ళో అందరికీ నిజం చెప్పేస్తానని దుర్భాషలాడేను.

దాంతో ఆమె నన్ను లోనికి ఆహ్వానించి, తను నైవేద్య స్నేహితురాలిననీ, ఆమె తండ్రిగారు పాతిపెట్టిన నిధికోసం నైవేద్యే తనను పంపిందనీ, నాలుగు రోజు

ల్నించి ప్రయత్నిస్తున్నా ఆ నిధి జాడ దొరకడం లేదనీ, నా సహాయం కావాలనీ, నిధి దొరికితే అందులో పాతిక భాగం నా కిస్తాననీ, మరో పాతిక భాగం తనుంచుకుని, మిగిలింది నైవేద్య కిస్తాననీ ఓ మ్యాప్ చూపించింది నాకు.

దాన్ని చాలా జాగ్రత్తగా పరిశీలించాను. అందులో సూచించిన కుక్క సమాధీ, నైవేద్య కట్టించిన అసలు సమాధీ తారుమారుగా చిత్రించ బడ్డాయని నాకెందుకో అనుమానం వేసింది.

కారణం ఆనాడు నైవేద్య తన కుక్క సమాధి ఎక్కడ కట్టించిందో నాకు బాగాగుర్తు. ఆ సమాధి ఈశాన్య దిశలో, ఇప్పుడున్న సమాధికి చాలా దూరంలోవుండేది. అక్కడ నిల్చునిచూస్తే, సరిగ్గావాళ్ళ దొడ్డిగుమ్మం కనిపించేది. ఇప్పుడున్న సమాధి దానికి విపరీత దిశలోవుంది.

మరి మ్యాప్‌లో దాన్ని తప్పుగా దేనికి చిత్రించారు. ఆ విషయాన్నే వివరంగా ఆలోచించి, ఓ నిశ్చయానికి రావాలని, మర్నాడువచ్చి కలుస్తానని ఆమెతో చెప్పి వచ్చేశాను'' అన్నాడు ఆనందరావు.

రాజారెడ్డి స్థానిక సబిన్‌స్పెక్టర్‌వైపు తిరిగి, ''ఇద్దరు కానిస్టేబుళ్ళని పంపి, గడ్డపారలూ మొదలయినపనిముట్లు తెప్పించండి. మనం ఇప్పుడే నాయుడుగారింటికెళ్ళి ఆ నిధి ఎక్కడుందో తవ్విచూద్దాం'' అన్నాడు.

అతను తలూపి, కానిస్టేబుళ్ళకి ఆదేశాలిచ్చాడు. పావుగంటలో, పనిముట్లు మోసుకొచ్చేరు వాళ్ళు.

ఆనందరావుని వెంటబెట్టుకుని, అందరూ జీప్‌లో బయలుదేరారు.

నాయుడుగారింటి వెనుకభాగమంతా చీకట్లో మునిగి వుంది. టార్చిలైట్లు వెలిగాక ఆనందరావు వైపు తిరిగి, "శక్కా అసలు సమాధి ఎక్కడుంది?" అడిగేడు యిన్స్పెక్టరు.

ఆనందరావు పదినిమిషాల వరకూ నేలనీ, పరిసరాలనీ, క్షుణ్ణంగా పరిశీలిస్తూ ఓచోట ఆగాడు. "ఇక్కడే ఉండేది. అదిగో, ఇక్కణ్నించి ముక్కుకు సూటిగా ఆ నోడ్డిశమ్మం కనిపిస్తోంది చూడండి" అన్నాడు.

ఇన్స్పెక్టర్ మ్యాప్తో అక్కడికెళ్ళి నిల్చున్నాడు. అందులో, శక్కా సమాధికి ఈశాన్యంవైపు పాతిక అడుగులు అనిరాసివుంది. ఆనందరావు నిల్చున్న చోటు నుంచి, ఆవైపు అడుగులు వేస్తూ లెక్కపెట్టాడు.

సరిగ్గా పాతిక అడుగులు వేసి ఆగిపోయాడు. కానిస్టేబుళ్ళని కేకేసి అక్కడ తవ్వమని ఆజ్ఞాపించాడు.

తవ్వకం ప్రారంభమైంది.

అందరూ ఊపిరిబిగబట్టి చూస్తున్నారు. గంటలోపల మూడడుగులలోతు నాలుగడుగుల వెడల్పా గొయ్యి తయారయింది. గొయ్యి లోతు అధికమౌతున్నకొద్దీ క్యూరియాసిటీతో అందరి గుండెలూ దడదడలాడసాగాయి.

హఠాత్తుగా, ఓ కానిస్టేబుల్ గావుకేక పెట్టాడు.

"ఏం జరిగింది?" అంటూ గొయ్యిని చుట్టుముట్టేరంతా.

లోపల కనిపించిన దృశ్యం వాళ్ళని దిగ్భ్రాంతుల్ని చేసింది.

గోతిలో ముడుచుకు పడుంది ఓ అస్థిపంజరం!

మానవ అస్థిపంజరం!!

"తియ్యండి బయటకి" అరిచాడు ఇన్‌స్పెక్టర్.

సార్జంట్ దేవిడ్, సబిన్‌స్పెక్టరు ఒంగుని, ఆ కంకాళాన్ని బయటికి తీసారు. టార్చి వెలుగులో, ఆ అస్థిపంజరం చేతి ఎముకలకి మట్టి కొట్టుకున్న గుండ్రని వేవో కనిపించి, పరీక్షగా చూసాడు రాజారెడ్డి.

అవి గాజులు!

ఎర్రని మట్టిగాజులు!!

ఇన్‌స్పెక్టర్ బుర్రలో సినిమారీళ్ళు తిరగసాగాయి. "ఆనందరావ్! నీవు నైవేద్యను ప్రేమించావుకదూ?" అడిగాడు గంభీరంగా.

"ప్రేమించడం కాదు ఇన్‌స్పెక్టర్! ఆరాధించాను. తపస్సుచేసాను. అందుకే, నా మనఃఫలకంమీంచి ఆమె రూపాన్ని చెరుపుకోలేక పోయాను యింతకాలం!"

"ఆమెలో ఏం ప్రత్యేకత వుందేదని ఇంతగా ఆమె పిచ్చిలో పడ్డావ్?"

"ఆరోజుల్లో మీరామెను ఒక్కసారి చూసివుంటే ఇలా అనేవారుకాదు ఇన్‌స్పెక్టర్. ఆమె ఒక సౌందర్య దీప్తి, కావ్యప్రాప్తి. వెన్నెల్లో ఆమె పచార్లుచేస్తుంటే జాబిల్లికూడా వెలవెలబోతూ సిగ్గుపడేది. అటువంటి అపురూప అందాల ఖని, నావంటి పామరుడి ఆరాధనకు అయోగ్యురాలంటూరా?"

ఇన్‌స్పెక్టర్ ఆ అస్థిపంజరంమీద టార్చివేసి, "చూడు ఆనందరావ్! ఆనాటి నీ అందాలరాశి ఇప్పుడేమైందో?" అన్నాడు నవ్వుతూ.

ఆనందరావ్ రెప్ప వెయ్యకుండా కాసేపు ఆ కంకాళాన్ని చూసి, గావుకేక పెడుతూ నేలకూలి, మూర్ఛపోయాడు.

"ఇది నైవేద్య స్పెషలిటనా? మీకెలా తెలుసు?" అడిగాడు సబిన్‌స్పెక్టర్ ఆశ్చర్యంగా.

"చెబుతాను! త్వరగా పదండి!" అంటూ జీపువైపు పరిగెత్తాడు ఇన్‌స్పెక్టర్. కానిస్టేబుళ్ళు కింద పడున్న ఆనందరావుని ఎత్తి జీప్‌లో పడుకోబెట్టారు.

మరుక్షణం జీపు ఊరివైపు పరుగు తీసింది.

# 10

"పార్వతీశం ఇల్లు ఇదేకదూ?" అడిగాడు రాజారెడ్డి జీపుకి బ్రేక్ వేస్తూ. సార్జంట్ తలూపాడు.

"రండి!" అంటూ జీప్ దిగి, కాంపౌండ్ వైపు నడిచాడు రాజారెడ్డి.

కాంపౌండ్‌లో పార్వతీశం ఫియట్ కారు ఆగివుంది.

"అయ్యగారు వున్నారా?" అడిగాడు వరండాలో ఎదురయిన నౌఖర్ని.

"ఉన్నారండి. అమ్మగారూ, అయ్యగారూ ఇప్పుడే వచ్చారండి. మేడమీదున్నారు. పిలవమంటారా?"

"అక్కర్లేదు. మేమే వెడతాం" అంటూ హాల్లోకి ప్రవేశించాడు ఇన్‌స్పెక్టర్.

హాలు పక్కనే పైకెళ్ళడానికి మెట్లున్నాయి. ఇన్‌స్పెక్టర్ని అనుసరిస్తూ అందరూ మేడమీదికెళ్ళారు.

పైన రెండు గదులున్నాయి. ఓగది తలుపు మూసివుంది. మునివేళ్ళతో తలుపు తట్టబోయాడు ఇన్‌స్పెక్టర్. చెయ్యి పడగానే కిర్రుమంటూ తెరుచుకుంది.

లోపల చీకటి! చిమ్మ చీకటి!!

"పార్వతీశం!" పిల్చాడు.

జవాబు లేదు.

టార్చి వెలిగించాడు. ఆ వెలుగులో నేలమీద కనిపించిన దృశ్యం, ఇన్ స్పెక్టర్ నెత్తిన ఉరుములేని పిడుగు వేసింది. కళ్ళప్పగించి అలాగే చూస్తుండి పోయాడు.

నేలమీద వెల్లకిలా పడుంది ఉపాసన!

నుదుటిమధ్య బొట్టుపెట్టినట్టు గుండ్రని రంధ్రం! ఆ రంధ్రంలోంచి వుబికి చారలు చారలుగా కారిన రక్తం! కళ్ళు ఏదో భయంకర దృశ్యం చూస్తున్నట్టు తెరచి వున్నాయి.

వెంటనే గోడ తడిమి లైటు వెలిగించాడు. ఆ వెలుగులో గదిమధ్య కనిపించిన దృశ్యం అందర్నీ స్తబ్ధుల్ని చేసింది.

గదిమధ్య తాడుకి వేలాడుతున్నాడు పార్వతీశం!

ప్రాణంలేని పార్వతీశం!!

సరిగ్గా అతని కాళ్ళదగ్గర, నేలమీద రెపరెపలాడుతోంది ఓ కాగితం.

చటుక్కున దాన్ని అందుకున్నాడు ఇన్ స్పెక్టర్.

అది మరణించేముందు పార్వతీశం రాసిన ఉత్తరం.

“డియర్ ఇన్ స్పెక్టర్!

ఈ నిర్ణయం నేనెప్పుడో తీసుకోవలసింది. కాని, విధి చేతిలోనూ, నాభార్య చేతిలోనూ యింతకాలం కీలుబొమ్మనయి ఆడుతూ వచ్చాను. ఇహ ఆట్టేకాలం మా రహస్యం దాగదని తెలిసిపోయింది. అందుకే ఈ తుది నిర్ణయం తీసుకొన్నాను.

చచ్చేముందు ఆ విషాదగాథ మీకు చెప్పడం ధర్మం.

నా అభీష్టానికి విరుద్ధంగా, మా పెద్దలు ఉపాసనతో నాపెళ్ళి చేసారు. బాల్యంనుంచి భీరువుని కావడంవల్ల

అప్పుడు నోరెత్తలేక పోయాను. నిజానికి ఉపాసన కూడ నన్ను మనసారా ప్రేమించింది.

నేను మద్రాసునుంచి భార్యా సమేతంగా ఈ ఊరు వచ్చి ప్రాక్టీసు ప్రారంభించాను.

నేను చేసినపనికి నైవేద్య మనసు ఛిన్నాభిన్నమైంది. ఆమెని ఓదార్చడానికీ, మళ్ళీ మామూలు మనిషినిచెయ్యా డానికీ తరచూ వాళ్ళింటికెళ్ళేవాడిని.

దాంతో ఉపాసన ఈర్ష్యాభిమానాలతో దహించుకుపోసాగింది. నేను నైవేద్యను కలుసుకోకూడదని ఆంక్షలు పెట్టేది. ఐనా, ఆమెకళ్ళుగప్పి నైవేద్యను కలుసుకొనే వాణ్ని.

ఒకరాత్రి మామూలుగా నైవేద్యని కలుసుకోడాని కెళ్ళాను. అప్పుడామె తోటలో కూర్చునుంది. నాయుడు గారు పనిమీద ఏదో ఊరెళ్ళారు.

నన్ను వెంబడిస్తూ అక్కడికి ఉపాసన ఎప్పుడొచ్చిందో తెలీదు. చీకట్లోంచి మెరుపులా ఇవతలికివచ్చి, పిస్తోలుతో నైవేద్యమీద కాల్పులు జరిపింది.

ఆమె అక్కడికక్కడే మరణించింది. నేను నిర్ఘాంతపోయాను.

కేవలం నామీది ప్రేమతో, నైవేద్యమీది ఈర్ష్యతో ఆ హత్యచేసిన ఉపాసనపట్ల నాకు జాలివేసింది. ఆమెను కాపాడాలనే ఉద్దేశంతో, అప్పటికప్పుడు గొయ్యితవ్వి నైవేద్యను పూడ్చేశాను.

అప్పుడే ఆగొయ్యి తవ్వేటప్పుడే నాయుడుగారు అక్కడ దాచిపెట్టిన నిధికూడ మాకుదొరికింది. నాయుడు గారు చనిపోయేటప్పుడు నైవేద్యకు అందజేయమని ఆ నిధి

మ్యాప్ నా చేతికిచ్చాడు. నేను ఎందుకయినా మంచి దని ఒక్క సమాధి మరోచోట కట్టించి మ్యాప్ మరొకటి తయారుచేసాను.

నైవేద్యను చంపిన తరువాత, ఆమె ఇల్లువిడిచిపోయి నట్టు దొంగ లేఖ సృష్టించి, అందర్నీ మభ్యపెట్టాను.

ఆ తరువాత ఆమె సజీవంగా వున్నట్టు నమ్మించ డానికి, గీతాంజలి అనే యువతిని పరిచయం చేసుకుని, దేశం నలుమూలలనించి నైవేద్యలా ఉత్తరాలు రాయమని డబ్బిచ్చాను. ఆమె ఉత్తరాలెలా రాయాలో, ఎప్పటి కప్పుడు తెల్పేవాణ్ని.

ఉపాసన తనుచేసిన నేరాన్నిమర్చిపోడానికితాగుడూ, పేకాటా అలవాటు చేసుకుంది. అప్పుడే, ఆ గీతాంజలికి 'బ్లూస్టార్ నైట్ క్లబ్' దివాకర్‌తో పరిచయమయింది. అతని ప్రోద్బలంతోనే, ఆమె నన్ను బ్లాక్ మెయిల్ చెయ్యసాగింది.

ఆమె కోరినంత ఇచ్చుకోడానికి, క్రమక్రమంగా నైవేద్య ఆస్తిని అమ్మసాగేను. ఇక ఏమీ మిగల్లేదు. చివరికి విసుగెత్తి, ఆ దొంగమ్యాప్ గీతాంజలికి చూపాను. దాన్ని తీసుకుని, నేనామెకి రాసిన ఉత్తరాలు యివ్వ మన్నాను.

గీతాంజలి సగం ఉత్తరాలిచ్చి, మిగతా సగం నిధి దొరికేక ఇస్తానంది. ఈ విషయం తెలిసిన దివాకర్ ఆమెని వెంబడిస్తూ వచ్చి, ఆమెని చంపి, మ్యాప్‌కోసం ప్రయత్నించాడు...

చూశారా! ఒక్క నేరాన్ని కప్పిపుచ్చడానికి నేను ఎన్ని తప్పులు చెయ్యవలసి వచ్చిందో!

ఇహ, చివరికి మిగిలేదేమీ లేదని తెలిసివచ్చింది. దీని కంతటికీ మూలకారణమైన నాభార్యని చంపి, నేనూ చస్తున్నాను.

సెలవ్,

పార్వతీశం!''

—: ఐపోయింది :—

# పసుపు రంగు కవరు!

## విద్వాన్ షీలాదేవి

ప్రముఖ వార్తాపత్రిక 'పరిశోధన' క్రైమ్ రిపోర్టర్ శ్రీకాంత్, క్రయింబ్రాంచి హెడ్ క్వార్టర్స్‌లోని ఇన్‌స్పెక్టర్ శ్రీనివాసరావు ఆఫీసులోంచి, హడావుడిగా బైటికి వచ్చి, వసారాలో వున్న పబ్లిక్ టెలిఫోన్ బూత్ వైపు పరిగెత్తాడు.

బూత్‌లో దూరగానే తలుపుమూసి, గబగబ పరిశోధన ఆఫీస్‌కు రింగ్ చేశాడు.

"ఎస్! మణిప్రసాద్ స్పీకింగ్" అవతలినించి సబ్ ఎడిటర్ కంఠం వినిపించింది.

"నేనండీ శ్రీకాంత్ మాట్లాడుతున్నాను. మన పత్రిక ఈవినింగ్ ఎడిషన్ ఔట్ అవడానికింకా ఎంత టైం వుంది?"

"నలభై నిమిషాలు! ఏం?"

"మరో వార్త వెళ్ళడానికి వీలుందా?"

"అదంత ప్రాముఖ్యమైనదైతే తప్ప!"

"ప్రస్తుతం దానికంత ప్రాముఖ్యత వుండకపోవచ్చు. కాని, ముందు ముందు లభించే అవకాశముంది. విశేషం ఏమిటంటే, ఆ వార్త కేవలం నాకే లభించింది. ఇతర విలేఖర్లెవ్వరూ ఇక్కడ లేరు."

"సరే, ఏమిటో చెప్పు!"

శ్రీకాంత్ ప్రారంభించాడు. "భక్తవత్సలం అనే ఓ నలభై ఏళ్ళ వ్యక్తి తప్పతాగి, మౌంట్ రోడ్లో ఓ కారు ఏక్సిడెంట్ చేశాడు. ట్రాఫిక్ పోలీసులు కారుతోసహా అతన్ని క్రయిం బ్రాంచ్ హెడ్ క్వార్టర్స్‌కు పంపించారు.

భక్తవత్సలం వెంట పాతికేళ్ళ ఓ అందమైన యువతి కూడా వుంది. ఆమె కథనాన్నిబట్టి, అతనికీ, ఆమెకీ పూర్వ పరిచయం ఏమీ లేదుట. టాక్సీ దొరక్క, కేవలం లిఫ్ట్ కోరి అతని కారెక్కిందిట.

వాళ్ళిద్దరూ ఇప్పుడు ఇన్‌స్పెక్టర్ శ్రీనివాసరావు గదిలో వున్నారు.

శ్రీనివాసరావుకు భక్తవత్సలంకన్నా, అతని ఫియట్ కారుమీదే ఎక్కువ అనుమానం వుంది.

గత రాత్రి అటువంటి కారే, పాండీబజార్లో ఓ నగల దుకాణం ముందు వచ్చి ఆగిందిట. అందులోంచి ఓ పురుషుడూ, ఓ యువతీ దిగి, దుకాణంలో ప్రవేశించి, పిస్తోళ్లతో దుకాణంవాళ్ళని బెదరగొట్టి, డబ్బూ, నగలతో పరారయ్యారుట. దురదృష్టవశాత్తూ ఆ కారు నెంబర్ ఎవ్వరూ చూళ్ళేదు!

ఆ సందర్భంలోనే, వాళ్ళనిక్కడ ఆపి వుంచాడు ఇన్‌స్పెక్టర్. కాసేపట్లో ఆ నగల దుకాణం యాజమాని రాబోతున్నాడు వాళ్ళని గుర్తించడానికి. ఏం జరుగు

తుందో వేచిచూడాలి...మరో ఇరవై నిమిషాలు ఆగా రంటే, ఈ వార్త క్లైమాక్స్ ఘట్టం పూర్తవుతుంది. ఏమంటారు?''

''సరే, ఎదురు చూస్తాను. ఇరవై నిమిషాలు దాటి, ఇరవై ఒక్క నిమిషం అయిందా, నీవు చెప్పినంత వరకే వార్తని ప్రెస్‌కు పంపాల్సుంటుంది.''

''ఓ.కే.'' అంటూ రిసీవర్ దించి, గబగబ తిరిగి ఇన్‌స్పెక్టర్ ఆఫీసులోకి నడిచాడు శ్రీకాంత్.

భక్తవత్సలం, అతనికూడా వున్న యువతీ ఆందోళిత వదనాలతో ఇంకా అక్కడే కూర్చునున్నారు. ఇన్‌స్పెక్టర్ శ్రీనివాసరావు ఫోన్లో ఎవ్వరితోనో మాట్లాడు తున్నాడు. మౌనంగా ఓ కుర్చీలో చతికిలబడ్డాడు శ్రీకాంత్.

శ్రీనివాసరావు రిసీవర్ దించి, భక్తవత్సలం వైపు తిరిగాడు. కోపంతో అతని మొహం జేవురించి వుంది.

''మిస్టర్ భక్తవత్సలం! నీవింతవరకూ మాతో చెప్పిం దంతా పచ్చి అబద్ధం! ఇప్పుడే కనుక్కున్నాను. అన్నా దురై స్ట్రీట్‌లో భక్తవత్సలం పేరుగల వారెవ్వరూ నివసించడం లేదని తెలిసింది!''

''ఇన్‌స్పెక్టర్ గారూ! నేను తిరువత్తియూర్‌లోని అన్నాదురై స్ట్రీట్ విషయం చెప్పాను. మీరు మర్చిపో యుంటారు.''

''ఓహో తిరువత్తియూర్‌లోనూ అన్నాదురై స్ట్రీట్ వుందన్నమాట! సరే, అదీ కనుక్కుంటాను.'' అంటూ రిసీవర్ అందుకున్నాడు శ్రీనివాసరావు.

మద్రాసుకి ఆరుమైళ్ళ దూరంలో వుంది తిరువత్తి

యూర్ సిటీ.

ట్రంకాల్ చేశాడు ఇన్ స్పెక్టర్.

"హలో, తిరువత్తియూర్ పోలీస్ స్టేషన్! ఆఁ, నేను క్రయింబ్రాంచ్ హెడ్ క్వార్టర్స్‌నించి శ్రీనివాసరావు మాట్లాడుతున్నాను. మీ సిటీలో అన్నాదురై స్ట్రీట్ వుందా?...అలాగా! ఐతే, ఆ స్ట్రీట్‌లో భక్తవత్సలం అనే వ్యక్తి ఎవ్వరైనా వున్నారేమో కనుక్కోండి... థాంక్స్!" రిసీవర్ క్రెడిల్ చేసి, భక్తవత్సలం వైపు తిరిగాడు శ్రీనివాసరావు.

సరిగ్గా అదే క్షణంలో ఫోన్ మోగింది.

ఇన్ స్పెక్టర్ చటుక్కున రిసీవర్ అందుకున్నాడు. కాసేపు అవతలి మాటలు విని, రిసీవర్ దించి, భక్తవత్సలం వైపు తిరిగాడు.

"నా అనుమానమే నిజమైంది. నీ పేరు భక్తవత్సలం కాదు. మూర్తిరాజు! ఔనా?" అన్నాడు తీక్షణంగా.

భక్తవత్సలం నివ్వెరబోయి, "ఎలా కనుక్కున్నారు?" అడిగాడు.

"నీ ఫియట్ కారు సహాయంతో! మూడు రోజుల క్రితం దాన్ని మద్రాసులోనే బాడుగకి తీసుకున్నావ్! కార్లు అద్దెకిచ్చే ఆటో మొబైల్ ఏజెన్సీలో నీ పేరు మూర్తిరాజు అని రాయించావ్. ఐడెంటిఫికేషన్స్ కోసం కొన్ని కాగితాలూ, తిరువత్తియూర్‌లోని సిటీ క్లబ్ మెంబర్‌షిప్ కార్డూ చూపించావ్. ఔనా?"

భక్తవత్సలం తల దించుకున్నాడు, "ఔను! నా పేరు మూర్తిరాజే. తిరువత్తియూర్ నివాసిని!" అన్నాడు ఇబ్బందిగా.

ఇన్‌స్పెక్టర్ పక పక నవ్వి—"ఇప్పటికి రెండు దొంగ పేర్లు చెప్పావ్. మూడోసారి, నేను జవహర్‌లాల్ నెహ్రూనంటావేమో!" అన్నాడు.

"నా మాట నమ్మండి. నా అసలు పేరు మూర్తిరాజే! నమ్మకం లేకుంటే, చూడండి!" అంటూ జేబులోంచి వెడల్పాటి ఓ పర్సు తీసి, అందులోంచి డ్రైవింగ్ లైసెన్స్, తిరువత్తియూర్ సిటీ క్లబ్ మెంబర్ షిప్ కార్డూ, ఓ చెక్ బుక్, జీవిత భీమా రసీదూ తీసి చూపాడతను.

సరిగ్గా అదే క్షణంలో మళ్ళీ టెలిఫోన్ మోగింది.

ఇన్‌స్పెక్టర్ రిసీవర్ అందుకుని, "ఎస్, శ్రీనివాసరావు స్పీకింగ్ కనుక్కున్నారా?...ఏమిటీ...అక్కడి అన్నాదురై స్ట్రీట్‌లో భక్తవత్సలం అనే వ్యక్తెవ్వడూ వుండడా? సరే, అదే వీధిలో నివసించే మూర్తి రాజు అనే వ్యక్తిగురించి తెలుసా మీకు?...వాట్! తిరువత్తియూర్‌లో అతను చాలా పెద్దమనిషా?...

అక్కడి సిటీక్లబ్ ప్రెసిడెంటా!... నేషనల్ బ్యాంక్ డైరెక్టర్ కూడానా?...ప్రభుత్వానికి నమ్మకస్తుడయిన కంట్రాక్టరా!...ఏమిటీ? వచ్చే ఎలక్షన్‌లో అక్కణ్ణించి పార్లమెంటుకు పోటీ చెయ్యబోతున్నాడా?...కోటీశ్వరుడా?...వాటే వండర్...నోనో! ఇంకా ఆయనమీద ఎటువంటి చర్యా తీసుకోలేదు.

కారు ఏక్సిడెంట్ విషయంలో కేవలం క్వశ్చనింగ్ కోసం ఆపాం. చాలా పెద్దపొరపాటు జరిగిపోయింది. ఓకే, ఓకే! థాంక్స్‌ఫర్ కోపరేషన్!" అంటూ డిస్కనెక్ట్ చేశాడు.

మరుక్షణం ఆ వ్యక్తిపట్ల ఇన్‌స్పెక్టర్ ప్రవర్తన మారి పోయింది. "తమరు ముందే ఈ విషయాలన్నీ చెప్పలేదు మాకు" అన్నాడు నీళ్ళునములుతూ.

మూర్తిరాజు రవంత సిగ్గుపడి "ఏం చెప్పను? పరిస్థితు లలా దాపురించాయి. వచ్చే ఎన్నికల్లో నేను పార్ల మెంటుకు పోటీ చెయ్యబోతున్నాను. అలాంటప్పుడు, నేనిలా తప్పతాగి కారునడుపుతూ ఏక్సిడెంట్ చేశానని, ఆ సమయంలో నాపక్కన ఓ అందమైన అమ్మాయికూడ వుందనీ నలుగురికీ తెలిస్తే నా ప్రిస్టేజ్ ఏంకాను?

పత్రికలవాళ్ళీ సంఘటనకి మరో నాలుగు మసాళాలు చేర్చి, ఘాటుగా ప్రచురించరూ? నా ప్రత్యర్థులు నా మీద దుమ్మెత్తి పొయ్యరూ? అందుకే అన్ని అబద్ధాలు ఆడవలసి వచ్చింది.

పైగా నేను నేషనల్ బ్యాంకు డైరెక్టర్ని కూడా. రక్షణశాఖకు నమ్మకమైన కంట్రాక్టర్ని. ఈమధ్య నేను మిలిటరీకి వందజీపులు సరఫరా చేసాను. ఆవడి ఫ్యాక్టరీ వాళ్ళకి అనేక ఎక్విప్‌మెంట్సూ, యంత్ర పరికరాలూ సప్లై చేస్తుంటాను...ఇప్పుడంతా తెలిసిందిగా? ఇంకే మైనా అడగదలిచారా?" అన్నాడు.

రిస్టువాచి చూసుకున్నాడు శ్రీకాంత్. అప్పటికే పధెనిమిది నిమిషాలు పూర్తికావస్తున్నాయి. ఒక్క ఉదుటున లేచి బయటకెళ్ళాడు. టెలిఫోన్ బూత్‌లో దూరి, గబగబ పరిశోధన నెంబర్ రింగ్ చేశాడు.

"హాలో, ఆఁ! నేనే మాట్లాడుతున్నాను. ఇప్పుడా వార్తచాల ఆసక్తికరంగా తయారయింది. ఆ భక్త వత్సలం నిజానికి భక్తవత్సలంకాదు. తిరువత్తియూర్

వా స్తవ్యుడయిన మూ ర్తిరాజుట.

వచ్చే ఎలక్షన్స్‌లో పార్లమెంటుకు పోటీ చెయ్య బోతున్నాడట. నేషనల్ బ్యాంకు డైరెక్టరూ, రక్షణ శాఖ కాంట్రాక్టరూట! చూశారా, ఇప్పుడా వార్తకి ఎంత కలర్ వచ్చిందో?"

"ఆల్ రైట్! ఇప్పుడే ఈవెనింగ్ ఎడిషన్‌కి ఈ మేటర్నంతా పంపుతాను. థాంక్స్" అన్నాడు అవతలి నించి సబ్ ఎడిటర్.

రిసీవర్ దించి, బూత్‌లోంచి బయటకి వచ్చాడు శ్రీకాంత్. సరిగ్గా అదే సమయంలో రాంబాబు అనే వేరే దినపత్రిక విలేఖరి, ఇన్‌స్పెక్టర్ ఆఫీసులో దూరుతూ కనిపించాడతనికి.

రాంబాబుకూడా ఆ వార్తని తనపత్రిక్కి పంపవచ్చు ఐనా, అదివాళ్ళ ఈవెనింగ్ ఎడిషన్లో ప్రచురింపబడదు. ఇప్పటికే చాలా ఆలశ్యమైపోయింది. ఆ న్యూస్ వాళ్ళ పత్రికలో ప్రింటయ్యేది రేపే.

లోలోన ఆనందించాడు శ్రీకాంత్, అటువంటి వార్తను తనే ముందు సేకరించగలిగినందుకు, తన పత్రికలోనే ముందు రాబోతున్నందుకూ.

## 2

హోటల్ సీక్లఫ్ పార్కింగులో కారాపి, "దిగు!" అన్నాడు భయంకర్.

తంగవేలు తలూపి, కారు దిగాడు.

ఇద్దరూ పెద్దమనుషుల్లా, వడివడిగా అడుగులు వేసు కుంటూ లోనికి నడిచారు.

హోటల్లో జనసమ్మర్దం ఎక్కువ వుంది. నగరంలోని లక్ష్మీకటాక్షులంతా, సాయంత్రం వేళ అక్కడ చేరి, ఖలాసాగా గడిపి పోతుంటారు. ఒక్కోసారి అక్కడికి పెద్ద పెద్ద పోలీసాఫీసర్లుకూడా రావడంకద్దు.

అందర్నీ పరీక్షగా చూసుకుంటూ మెట్లెక్కి మూడో అంతస్తు చేరుకున్నారిద్దరూ. హోటల్ ప్రొప్రైటర్ మురుగేశన్ ఆఫీసు రూం తెరిచే వుంది. బైట ప్యూన్ కాబోలు కూర్చున్నాడు స్టూలుమీద.

"అయ్యగారు వున్నారా?" అడిగాడు భయంకర్ అతన్ని.

ప్యూన్ చటుక్కున లేచి, "ఉన్నారండి!" అన్నాడు వినయంగా.

కోటు జేబులోంచి ఓ విజిటింగ్ కార్డ్ తీసిస్తూ, "దీన్ని ఆయనకివ్వు!" అన్నాడు భయంకర్.

ప్యూన్ కార్డందుకుని లోనికెళ్ళాడు. అది ఇంకెవరో పెద్దమనిషి పేరు ముద్రించి వున్న బోగస్ కార్డు!

రెండు నిమిషాల తరవాత బైటికి వచ్చి, "అయ్యగారు పిలుస్తున్నారండి!" అన్నాడు ప్యూన్.

స్ప్రింగ్ డోర్స్ తోసుకుంటూ ఠీవిగా లోన అడుగు పెట్టారిద్దరూ. విశాలమైన టేబిల్ ముందు కూర్చుని ఏదో రాసుకుంటున్నాడు మురుగేశన్. ముఖైమూ దేళ్ళుంటా యతనికి. టేబిల్ పక్కన గోడవారగా నిలబెట్టి వుంది ఐరన్ సేఫ్!

వాళ్ళని చూడగానే, "రండి, కూర్చోండి!" అంటూ ఆహ్వానించాడు.

వాళ్ళు కూర్చోలేదు. పాంటు జేబుల్లోకి చేతులు పోనిచ్చి, నింపాదిగా పిస్తోళ్ళు బైటికి తీశారు.

వాటిని చూడగానే మురుగేశన్ నోరు తెరిచాడు.

"కదలకు! ఏమాత్రం గోల చెయ్యడానికి ప్రయత్నించినా, నిర్దయగా కాల్చిపారేస్తాను జాగ్రత్త!" అన్నాడు భయంకర్.

అప్పటికే తంగవేలు, మురుగేశన్ కుర్చీ వెనక్కి వెళ్ళి నిల్చున్నాడు.

మురుగేశన్ ఏదో అనడానికి పెదవి కదిపేలోగా, తంగవేలు పిస్తోలు పిడి అతని బుర్రని ముద్దెట్టుకుంది!

ఆ దెబ్బనించి అతను తేరుకోకముందే, మరోటి ఇచ్చాడు తంగవేలు, గట్టిగా. స్పృహతప్పి, టేబిల్ మీద తల వాల్చేశాడు మురుగేశన్.

"చప్పుడు విని, ప్యూన్ లోపలికొస్తే ప్రమాదం! నేను తలుపు పక్కన నక్కి నిల్చుంటాను. నీవు టేబిల్ మీది కాలింగ్ బెల్ మోగించు" అన్నాడు భయంకర్, తలుపు పక్కన నక్కుతూ.

తంగవేలు టేబిల్ మీది బెల్ మోగించాడు గట్టిగా.

యజమాని పిలుస్తున్నాడేమోనని వెంటనే లోనికి వచ్చాడు ప్యూన్.

అంతే, అరచేతి అంచుతో అతని మెడమీద ఒక్కటి ఇచ్చాడు భయంకర్. మొదలు నరికిన చెట్టులా కింద కూలాడు ప్యూన్.

అతన్ని పక్కకి ఈడ్చి, తలుపుమూసి, గబగబ మురుగేశన్ జేబులు వెదికి, ఇనప్పెట్టి తాళం చెవులందుకున్నాడు భయంకర్.

ఇద్దరూ కలిసి, రెండు నిమిషాల్లో తెరిచారు ఐరన్ సేఫ్!

మొదటి అరనిండా దొంతర్లుగా పేర్చి వున్నాయి నోట్ల కట్టలు. కింది రెండు అరలూ వెతకసాగాడు భయంకర్. చివరి అరలో కనిపించింది పొడవాటి పసుపు రంగు కవరు! దాన్ని చూడగానే, భయంకర్ కళ్ళు తళ తళ మెరిశాయి.

"ఇదే మనక్కావలసింది!" అంటూ చటుక్కున దాన్నందుకుని కోటు జేబులోకి తోశాడు.

అక్కడే మరో కాగితాల కట్ట కనిపించింది. దేనికైనా మంచిదనుకున్నాడో ఏమో, దాన్నీ జేబులోకి తోశాడు భయంకర్. తరవాత ఇద్దరూ నోట్ల కట్టల్ని జేబుల్లో కుక్కడం ప్రారంభించారు.

"సేఫ్‌లో ఇంత డబ్బుంటుందని తెలిస్తే, వెంట ఓ బ్యాగ్ కూడా తెచ్చుకునే వాళ్ళంకదా!" అన్నాడు తంగవేలు విచారంగా.

"చేతి కందినంత ఊడ్చి పట్టుకెళ్దాం! ఈ పని ఇంత ఈజీగా జరుగుతుందని నేననుకోలేదు. ఎవ్వరైనా ఇటు రాకముందే ఇక్కణ్నించి త్వరగా జారుకోడం మంచిది" అంటూ సేఫ్ మూసి, వెనుదిరిగాడు భయంకర్.

ఇద్దరూ గదిలోంచి బైటికి నడిచారు. సాధ్యమైనంత వేగంగా మెట్లుదిగి హోటల్లోంచి బైటపడ్డారు.

"ఆ కాగితాలని అతనికి ఎప్పుడు, ఎక్కడ అంద జెయ్యాలి?" అడిగాడు తంగవేలు, కారెక్కుతూ.

"పద. చెబుతాను" అన్నాడు భయంకర్ కారు స్టార్ట్ చేసి.

# 3

"మిమ్మల్ని సబ్ ఎడిటర్ గారు పిలుస్తున్నారండి," అన్నాడు అటెండర్.

తన సీట్లో కూర్చుని ఏదో మేటర్ రాసుకుంటున్న శ్రీకాంత్ తలూపి లేచి నిల్చున్నాడు. ఫైలు బల్ల సొరుగులో పడేసి, సబ్ ఎడిటర్ మణిప్రసాద్ ఆఫీసువైపు నడిచాడు.

అతన్ని చూడగానే, "రా. కూర్చో!" అన్నాడు మణిప్రసాద్ గంభీరంగా.

అతని టేబుల్ కెదురుగా ఫుల్ సూటులో వున్న ఓ నలభై ఏళ్ళ వ్యక్తి కూర్చునున్నాడు. అతని పక్కనే పరిశోధన చీఫ్ రిపోర్టర్ మధు కూర్చునున్నాడు. గదిలోని గాంభీర్యాన్నిబట్టి, ఏదో తీవ్రమైన విషయమే అయ్యుంటుందనుకున్నాడు శ్రీకాంత్, కుర్చీలో చతికిలబడుతూ!

మణిప్రసాద్ ఆ ఫుల్ సూటతనివైపు సైగ చేసి, "వీర్ని చూశావా?" అడిగాడు శ్రీకాంత్ ని.

అతన్ని క్షణం పరీక్షగా చూసి, "నో! ఎక్కడా చూసిన గుర్తులేదు" అన్నాడు శ్రీకాంత్.

"సరే, ముందీ విజిటింగ్ కార్డు చూడు!" అంటూ ఓ కార్డతని కందించాడు మణిప్రసాద్.

'మిస్టర్ మూర్తిరాజా,
డైరక్టరాఫ్ నేషనల్ బ్యాంక్,
కాంట్రాక్టరాఫ్ డిఫెన్స్ సర్వీసెస్,
అన్నాదురై రోడ్,

తిరువ త్తియూర్.' అని వుంది అందులో.

శ్రీకాంత్ కార్డు చదివి, "మీరు మూర్తిరాజుగారి ప్రతినిధా?" అడిగాడు ఆ వ్యక్తిని.

"కాదు, నేనే మూర్తిరాజుని" అన్నాడు చాలా నింపాదిగా.

"వాట్?"

"నేనేనయ్యా ఆ మూర్తిరాజుని" అన్నాడతనీసారి కోపంగా.

శ్రీకాంత్ నివ్వెరబోయాడు. తరవాత తేరుకుని, "ఇంపాసిబుల్! నిన్న క్రయింబ్రాంచి హెడ్క్వార్టర్లో నా కళ్ళారా చూశానాయన్ని. ఆయనకీ మీకూ ఎక్కడా పోలికల్లేవు" అన్నాడు ఖచ్చితంగా.

"ఐతే, నేను మూర్తిరాజును కాదంటారు! సరే. ఒకసారి ఇదిచూడండి" అంటూ కోటుజేబులోంచి, ఓ పేపర్ కటింగ్ తీసి, శ్రీకాంత్ ముందు పడేశాడతను.

దాన్నందుకుని మడతవిప్పాడు శ్రీకాంత్.

ఓ వార్త ప్రచురించబడుంది అందులో. "మన రక్షణ దళాల నిమిత్తం ప్రముఖ కాంట్రాక్టరు శ్రీ మూర్తిరాజు గారు, అత్యంత ఆధునికమైన వంద జోంగా జీపులు సరఫరా చేశారు.

గత పదేళ్ళుగా ఆయన రక్షణశాఖకు చేస్తున్న బహుముఖ సేవను ప్రశంసిస్తూ రక్షణమంత్రి ఆయన్ని అభినందించారు. గత రెండు యుద్ధాల్లోనూ, మూర్తిరాజుగారి కంపెనీ ఇంజనీర్లు మిలిటరీ ఇంజనీర్లకి అన్ని రంగాల్లోనూ ఎంతో సహాయపడ్డారు.

ఆ వార్త కిందే మూర్తిరాజు ఫొటోకూడా వుంది.

ఆఫోటోలో వున్నవ్యక్తీ, ఇతనూ ఒక్కడే!

శ్రీకాంత్ మొహంలో స్వేదబిందువులు పేరుకున్నాయి. "ఏమిటీ మాయ? ఇన్ స్పెక్టర్ ఆఫీస్ లో నేను చూసిన వ్యక్తి ఎవరు? అతను స్వయంగా మూర్తిరాజు పేరుతో వున్న డ్రయివింగ్ లైసెన్స్, క్లబ్బు మెంబర్ షిప్ కార్డూ బ్యాంకు చెక్ బుక్కూ చూపించాడే? ఇన్ స్పెక్టర్ అన్ని విధాలా తృప్తి పడ్డాకే అతన్ని వదిలాడే!" అన్నాడు ఆశ్చర్యంగా.

ఫుల్ సూటతను సాలోచనగా తలూపి, "నాలుగు రోజులక్రితం నేను మద్రాసు వచ్చినపుడు యెవ్వడో నా పర్సు కొట్టేసాడు. అందులో నా డ్రయివింగ్ లైసెన్స్, చెక్ బుక్, క్లబ్ మెంబర్ షిప్ కార్డ్ వున్నాయి. ఆ కాగితాలతో ఎవ్వడయినా, నా పేరుతో చెలామణీ అయ్యే వీలుంది. డ్రయివింగ్ లైసెన్స్ మీది నాఫోటో చింపి, వాడి ఫోటో అంటించుకున్నాడేమో!

నిజానిజాలు తెలుసుకోకుండా, మీరావార్త ప్రచురించి నాకొంప ముంచేశారు. సంవత్సరాల తరబడి శ్రమించి సంపాదించిన నా ప్రతిష్టనంతా గంగపాలు చేశారు.

ఇప్పుడు తిరువత్తియూర్లో ప్రతి ఒక్కడూ నన్ను అనుమానంగా చూస్తున్నారు. వచ్చే ఎలక్షన్స్‌లో నేను గెలిచే అవకాశాలెన్నో వుండేవి. అవన్నీ మంటగలిశాయి. ప్రజల్లో సగానికిపైగా నా మీదున్న సదభిప్రాయాన్ని మార్చుకున్నారు.

మీ పత్రికలో ఆ వార్త వచ్చాక, నా ఇంటికి అనేక టెలిఫోన్ కాల్సూ, టెలిగ్రాములూ వచ్చాయి. అందరూ

అడిగే ప్రశ్న ఒక్కటే. ఆ వార్త నిజమేనా అని.

డామ్ యూ పీపుల్స్! నేనంత సులభంగా మిమ్మల్ని వదలిపెట్టను. కోర్టులో పరువునష్టం దావా వేస్తాను. నష్ట పరిహారం కక్కిస్తాను.

రెండు రోజుల్లోగా మీ పత్రిక ఫ్రంట్ పేజ్‌లో 'ముఖ్య గమనిక' వేసి, అందులో నన్ను క్షమాపణ వేడుకుంటూ, ఆ వార్త పొరబాటున ప్రచురింపబడిందని ప్రజలకు తెలియజెయ్యాలి. అంతేకాదు, నష్టపరిహారంగా లక్షరూపాయల చెక్కు కూడా చెల్లించాలి.

అప్పుడుగానీ ప్రజలకు నామీద నమ్మకం కుదరదు. ఈ విషయాలు మీతో కాదు, మీ పత్రికా యజమాని లక్ష్మీపతిగారితో మాట్లాడవలసింది. ఆయన పనిమీద ఎక్కడికో వెళ్ళారని తెలిసే మిమ్మల్ని కలుసుకున్నాను.

ఆయనకోసం ఎదురుచూస్తూ కూర్చునే సమయం నా దగ్గర లేదు. మీరు నా సందేశాన్ని ఆయనకి చేర్చండి. రెండ్రోజుల్లోపల పత్రికద్వారా నన్ను క్షమాపణ కోరాలి. చెక్కు పంపాలి లేదా కోర్టుకెక్కాలి. తరువాత మీ ఇష్టం!'' అంటూ లేచి, విసురుగా బయటకి నడిచాడు మూర్తిరాజు.

4

'పరిశోధన' యజమాని లక్ష్మీపతిగారు జరిగింది విని' శ్రీకాంత్ మీద విరుచుకుపడ్డారు. ఆయనకి బ్లడ్ ప్రెషర్ ఎక్కువ.

అందుకే. సబ్ ఎడిటర్ మణిప్రసాద్, చీఫ్ రిపోర్టర్ మధూ, శ్రీకాంత్ నోళ్ళు మెదపకుండా కూర్చున్నారు.

ఆయన ప్రెషర్ తగ్గాక, కాసేపు ఆలోచించి, సాలోచనగా తెలియపాడు.

"ఇందులో శ్రీకాంత్ తప్పకూడా ఏమీ కనిపించ లేదు. ఆ సమయంలో ఏ విలేఖరి అయినా అదే చేసేవాడు. శ్రీకాంత్ మన పత్రికక్కి లేటెస్ట్ న్యూస్ యివ్వాలని ప్రయత్నించాడు.

ఆ మూర్తిరాజు నష్టపరిహారం అడుగుతున్నాడా? మీరతన్ని మెడపట్టి ఎందుకు గెంటలేదు? సరే, వాడి అంతేమిటో నేను చూస్తాను.

మనం ప్రచురించేది వార్తాపత్రిక. ఇతిహాసం కాదు. సమాచారం కొత్తదయితేనే అది వార్త అనిపించు కుంటుంది. పాతబడితే ఇతిహాసమవుతుంది. పాతబడ్డ విషయాలు వార్తాపత్రికలకి పనికిరావు.

మన దృక్పథం యావత్తూ తాజా వార్తలు ప్రచురిం చడంలోనే లీనమై వుంటుంది గానీ, వాటివల్ల ఎవరెవరి పరువుపోతుందో, ఎవరి ప్రతిష్ట మంటగలుస్తుందో అని ఆలోచించం.

ఈరోజు ఆ మూర్తిరాజు నష్ట పరిహారం కోరాడు. రేపో ముష్టిరాజు పరిహారం కక్కమంటాడు. ఇలా అందరికీ అడిగినంత ఇచ్చుకుంటూపోతే, చివర్న మనకి మిగిలేవి చేతిలో చిప్పా, చంకలో జోలె.

ఆ మూర్తిరాజుకి దమ్మిడీ ఇవ్వను. కోర్టులోదావా వేస్తానంటాడా? ఏమని? పరువుపోయిందనా? వాడికసలు పరువనేదే లేదని రుజువు చెయ్యాలి మనం."

"ఎలా?" అడిగాడు శ్రీకాంత్ ఆశ్చర్యంగా.

"చెబుతా వినండి! ఈ పుడమిమీద పుట్టిన వాడెవ్వడూ మహాత్ముడు కాడు. మహామహులుకూడా తమ జీవితాల్లో అనేక తప్పులు చేశారు. ప్రతి మనిషిలోనూ కొన్ని బల హీనతలుండి తీరతాయి.

ఆ మూర్తిరాజు అటువంటి బలహీనతల కతీతుడేం కాదు. జీవితంలో అతనుకూడా కొద్దో గొప్పో దుశ్చర్యలు చేసి వుంటాడు. బైటపడకుండా, వాటిమీద బూజై మూకను బోర్లించి వుంటాడు.

నువ్వు తిరువత్తియూర్ వెళ్ళి, వాడి గత జీవితాన్ని తవ్వి చూడు. అంతడబ్బు ఎక్కణ్ణించి వచ్చింది? తీరిక వేళల్లో ఏంచేస్తుంటాడు? ఏ స్త్రీతో నయినా రహస్య సంపర్కం వుందా? ఇదివరకు ఉండేదా? తన పనులు జరిపించుకోడానికి ఎప్పుడయినా, ఎవ్వరికయినా లంచా లిచ్చాడా?

ఇవన్నీ కనుక్కొని, నాకు రిపోర్టివ్వు. ఆ తర్వాత నేను చూసుకుంటాను. పరువునష్టం దావాలో గమనింప బడే ముఖ్యవిషయం, ఆ వ్యక్తికి నిజంగా పరువంటూ వుందా? అని.

ఆ మూర్తిరాజుకు పీసమెత్తు పరువుకూడా లేదని మనం నిరూపించాలి. పరువేలేనప్పుడు పరువు నష్టం ఏమిటి?"

తలూపాడు శ్రీకాంత్.

"ఈరోజే నీ ప్రయాణం. డబ్బుగురించి ఆలోచించక. నాపంతం నెగ్గడానికి ఎంత ఖర్చయినా సరే!" అంటూ చీఫ్‌రిపోర్టర్ మధువైపు తిరిగారు లక్ష్మీపతి.

"ఈరోజునించీ శ్రీకాంత్ డ్యూటీ నీకప్పగిస్తున్నాను. ఈ వ్యవహారమంతా నీవే డీల్ జెయ్యాలి."

"ఓ కే. సర్!"

"దెన్, గెట్ స్టార్టెడ్ ఎర్లీ బడీ!" అంటూ ఓ ఫైల్ ముందుకు లాక్కున్నారు లక్ష్మీపతి.

ముగ్గురూ లేచి, బయటకు నడిచారు.

# 5

సాయంత్రం ఐదుగంటలకి, 'పరిశోధన' కార్యాలయంలో పనిచేసే ఉద్యోగులు పనులు పూర్తి చేసుకుని, ఇళ్ళకి వెళ్ళిపోతారు.

చీఫ్ రిపోర్టర్ మధు, తన టేబిల్ మీది కాగితాలు సర్దుతూ, వెళ్ళే సన్నాహంలో ఉన్నాడు. అంతలో బల్లమీది టెలిఫోన్ మ్రోగింది.

రిసీవర్ అందుకోగానే అవతలినించి ఆపరేటర్ కంఠం వినిపించింది. "పర్సన్ టు పర్సన్, ట్రంకాల్ ఫ్రం తిరువత్తియూర్!"

మరుక్షణం ఓ పురుషకంఠం వినిపించింది. "నేను మూర్తిరాజు మాట్లాడుతున్నాను. మీ పత్రిక మీద నా కంప్లైంట్స్ ఉపసంహరించుకోవాలని నిశ్చయించాను. మీరు నాకు నష్టపరిహారం చెల్లించనవసరం లేదు. ఇంతటితో ఆ విషయం మర్చిపోండి" క్లిక్ మంది అవతల.

నివ్వెరబోయాడు మధు. ఆ రోజు తమ ఆఫీసుకువచ్చి, ధుమధుమలాడిన మూర్తిరాజేనా ఇప్పుడు మాట్లాడింది. అనుకుంటూ హడావుడిగా లక్ష్మీపతిగారి గదిలోకెళ్ళి, సంగతి వివరించాడు.

ఆయన కాసేపు ఆలోచించి, సాలోచనగా తలూపారు. "మన శ్రీకాంత్ అతనికి సంబంధించిన ఏదో రహ

స్యాన్ని వెలికి తీసుంటాడు. అందుకే మూర్తిరాజిలా కాళ్ళ బేరానికి దిగుతున్నాడు. ఐనా, మనం వెనక్కి తగ్గేది లేదు. కేరి ఆన్!"

మధు ఇంటికి చేరేసరికి సాయంత్రం ఆరుదాటింది.

అప్పటికే అతని మిత్రుడు ఆనంద్, తన ఆఫీస్‌నుంచి వచ్చి, తీరిగ్గాకూర్చుని పేపర్ చూస్తున్నాడు ఇంట్లో.

ఆనంద్ ఓ ప్రైవేట్ కంపెనీలో పనిజేస్తున్నాడు. ఇద్దరూ బ్రహ్మచార్లు గనక, ఒకే చోట కలిసి ఉంటున్నారు.

మధురాగానే, ఫ్లాస్కులోని కాఫీ కప్పులో పోసి అందించాడు ఆనంద్. మధు కాఫీ పూర్తిచేశాడో లేదో, కాలింగ్ బెల్ మోగింది!

ఆనంద్ వెళ్ళి తలుపు తీశాడు.

గుమ్మంలో, హోటలో సీక్లిఫ్ ప్రొప్రైటర్ మురుగేశన్ నిల్చున్నాడు.

"హలో మిస్టర్ మురుగేశన్! ఏమిటీ అకాల ఆగమనం? రండి. రండి" అన్నాడు మధు నవ్వుతూ.

మురుగేశన్ లోనికి వచ్చి కూర్చున్నాడు. అతని మొహం మాడిపోయి వుంది. మురుగేశన్‌కీ, మధుకీ అంతగా స్నేహం లేకపోయినా, పరిచయం వుంది. ఓ కేసు సందర్భంలో మధు అతనికి సహాయపడ్డాడు.

"చెప్పండి! మీవంటి బిజీ మనిషి పనిగట్టుకుని వచ్చారంటే చాలా ముఖ్యవిషయమే అయుంటుంది" అన్నాడు మధు.

మురుగేశన్ తలూపి, "నిన్నరాత్రి నా హోటల్ ఆఫీసులో జరిగిన దొంగతనం గురించి, పత్రికల్లో మీరు చదివే

వుంటారు'' అన్నాడు.

"చదివాను! ఎవ్వరో గుర్తు తెలియని ఇద్దరు వ్యక్తులు వచ్చి, మిమ్మల్ని మూర్ఛపోగొట్టి, సేఫ్‌లోని డబ్బు ఎత్తుకు పోయారట. అదేనా?''

"పత్రికల్లో కేవలం డబ్బు విషయం పడింది కాని' పోయిన మరికొన్ని వస్తువుల గురించి రాలేదు. అదే మీతో చెప్పి, మీ సహాయం పొందాలని వచ్చాను.

మిస్టర్ మధూ! డబ్బుపోయిందని నేను విచారించడం లేదు. డబ్బుతోబాటు ఆ సేఫ్‌లో కొన్ని ముఖ్యమైన కాగితాలుండేవి. దొంగలు వాటినీ ఎత్తుకుపోయారు.

ఆ కాగితాలు సామాన్యమైనవి కావు. నగరంలోని ఎందరో పెద్ద మనుషుల బ్రతుకులు అందులో నిక్షిప్తమై వున్నాయి. అవి గనక ఇతర్ల చేతుల్లో పడితే, వారి పరువు ప్రతిష్టలు డైనమైట్స్‌లా పేలిపోవడం ఖాయం!

దయచేసి, మీరా కాగితాలు నాకు తిరిగి లభించేలా చూడండి. ఎంత ఖర్చయినా సరే భరిస్తాను. మీ మాస్టర్ మైండ్ నుపయోగించి. ఆ దొంగల ఆచూకీ తెలుసుకోండి. ప్లీజ్!''

"పోలీసులకి రిపోర్టిస్తే, వాళ్ళే ఆ దొంగల ఆచూకీ తెలుసుకుంటారుగా? నా సహాయం కోరే అవసరం ఏముంది? ఇంతకీ, ఆ కాగితాల్లో వున్న రహస్యం ఏమిటో?''

"సారీ! చెప్పలేను. అందుకే ఈ వ్యవహారాన్ని పోలీసులవరకూ వెళ్ళనివ్వలేదు!'' అన్నాడు మురుగేశన్ యిబ్బందిగా.

"క్షమించాలి! వివరాలు తెలియకుండా తెలుసుకోనిదే, కేసులో తలదూర్చడం నా తత్వానికి విరుద్ధం!''

అన్నాడు మధు.

మురుగేశన్ పలకలేదు. చాలాసేపు ఆలోచిస్తూండి పోయాడు. తరువాత తలెత్తి, "ఆల్ రైట్! మీమీద నాకున్న నమ్మకం కొద్దీ చెబుతున్నాను.

గత సంవత్సరం, నా బిజినెస్ పార్టనర్ పరశురాం హత్య చెయ్యబడ్డ సంగతి మీకు తెలుసుగా? అతని హత్య ఎందుకు జరిగిందో ఇప్పటికీ చాలా మందికి కారణాలు తెలీవు.

పరశురాం బ్లాక్ మెయిల్ చేసేవాడు. నగరంలోని ప్రముఖ వ్యక్తులెందర్నో బ్లాక్ మెయిల్ చేస్తూ డబ్బు సంపాదించేవాడు.

ఆ వ్యవహారంలో నాకెలాంటి సంబంధం వుండేదికాదు. ఆ పెద్దమనుషుల్లోనే ఎవ్వరో అతన్ని గుట్టుచప్పుడు కాకుండా మట్టుబెట్టారు.

ఆ ఘరానా వ్యక్తుల పేర్లూ, వాళ్ళ వివరాలూ రాసి వున్న కాగితాలే నిన్నరాత్రి ఆ దొంగలెత్తుకుపోయారు.

పరశురాం వాటిని నా సేఫ్‌లో భద్రంగా దాచి వుంచాడు. అతని హత్యానంతరం నేను వాటిని కాల్చి పారేద్దామనుకొనే అనుకుంటూ జాప్యం చేశాను. ఇంతలో అవి ఇలా మాయమయ్యాయి.

ఓ హైకోర్టు జడ్జీగారి పరువూ, ఓ కేబినెట్ మినిస్టర్ గారి ప్రతిష్టా, ఓ పోలీస్ కమీషనర్ పలుకుబడీ ఇలా చాలామంది చీకటి కథలు దాగున్నాయి వాటిలో. అవి బట్టబయలయ్యాయంటే, ఆ పెద్దమనుషులు ఆత్మహత్యలయినా చేసుకుంటారు. లేదా కటకటాల వెనుకయినా కనిపిస్తారు.

నన్ను మూర్ఛపోగొట్టి, ఇనప్పెట్టె దోచుకున్న ఆ ఇద్దరు దొంగల్లో ఒకణ్ణి సులభంగా గుర్తుపట్టొచ్చు. వాడి కుడిచేతికి చిటికెనవేలు లేదు. వాడు జేబులోంచి పిస్తోలుతీసి పట్టుకున్నప్పుడు, నేను స్పష్టంగా గమనించా నీవిషయాన్ని!''

మధు కాసేపు ఆలోచించి, ''ఆల్ రైట్! ప్రయత్ని స్తాను'' అన్నాడు.

మురుగేశన్ సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళగానే, మధు టీపాయ్‌మీది టెలిఫోన్ దగ్గరకి లాక్కుని, క్రయింబ్రాంచి హెడ్ క్వార్టర్స్‌కు రింగ్ చేశాడు.

''ఎస్! ఇన్‌స్పెక్టర్ శ్రీనివాసరావు స్పీకింగ్!'' విని పించింది అవతలనించి.

శ్రీనివాసరావుకీ, మధుకీ చాలా పాత పరిచయంవుంది. అవసరమైతే ఇద్దరూ ఒకరికొకరు సహాయపడుతుంటారు.

''గుడీవినింగ్ ఇన్‌స్పెక్టర్! నేను మధుని. మీనించి ఓ ఇన్‌ఫర్మేషన్ కావాలి.''

''చెప్పండి?''

''మీ ప్రిజినర్స్ రికార్డ్సులో, కుడిచేతి చిటికెన వేలు లేని నేరస్థుడెవ్వడయినా వున్నాడా?''

''అటువంటి నేరస్థుల ఫైల్ విడిగా వుంటుంది. రికార్డ్ సెక్షన్‌నించి తెప్పించి చూస్తాను. లైన్‌లో వుండండి'' అన్నాడు శ్రీనివాసరావు.

రిసీవర్ చెవికి ఆనించి కాచుకూర్చున్నాడు మధు.

పదినిమిషాల తర్వాత వినిపించింది ఇన్‌స్పెక్టర్ కంఠం.

"మిస్టర్ మధూ! ఆ ఫైల్లో చిటికెనవేలులేని ముగ్గురు నేరస్థుల గురించి వివరాలున్నాయి. అందులో ఒకడు చాలాకాలం క్రితం బర్మా వెళ్ళిపోయాడు. రెండోవాడు సెంట్రల్ జైల్లో మగ్గుతున్నాడు. మిగిలిన మూడోవాడు కొద్ది నెలల క్రితం ఓ ట్రక్ ఏక్సిడెంట్‌లో మరణించాడు."

"ఆ బర్మా వెళ్ళినవాడు మళ్ళీ మద్రాసు వచ్చే అవకాశ ముందా?"

"అసంభవం! ఎందుకంటే, వాడిక్కడ ఓ హత్యచేసి, పోలీసులకి పట్టుబడకుండా బర్మా పారిపోయాడు. మళ్ళీ మద్రాసు వచ్చాడంటే, వాడికి మరణశిక్ష తప్పదు!"

"ఐతే, మీ ఫైలు అసంపూర్తిగా వుంది. చిటికెన వేలు తెగి వున్న మరో నేరస్థుడు ఇక్కడ సంచరిస్తున్నాడు!"

"కావచ్చు! మా రికార్డ్సులో, ఒకసారి పోలీసుల పాల బడ్డ నేరస్థుల గురించే పొందుపరిచి వుంటుంది. మీరు చెబుతున్న నేరస్థుడు ఇంతవరకూ మా చేతికి చిక్కలేదేమో! ఇంతకీ, అసలు కథేమిటి?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ కుతూహలంగా.

"చెబుతాను. ఎదురు చూడండి. ప్రస్తుతానికి సెలవ్. థాంక్స్ ఫర్ ది కోపరేషన్!" అంటూ రిసీవర్ దించాడు మధు.

సిగిరెట్ కోసం జేబులో చెయ్యి పెట్టాడోలేదో, టెలిఫోన్ మోగిందిమళ్ళీ. చటుక్కున రిసీవర్ అందుకుని "ఎస్! మధు స్పీకింగ్" అన్నాడు.

"నేను, శ్రీకాంత్‌ని మాట్లాడుతున్నాను!"

"ఎక్కణ్నించి?"

"మద్రాసునించే!"

"తిరువత్తియూర్ నించి ఎప్పుడొచ్చావ్?"

"గంట క్రితం! మూర్తిరాజుని వెంబడిస్తూ వచ్చాను. నేను తిరువత్తియూర్ వెళ్ళిన పని ఫుల్ సక్సెస్ అయింది. మూర్తిరాజుకు సంబంధించిన అత్యంత విలువైన ఓ రహస్యాన్ని వెలికి తీశాను.

మన పత్రిక తరఫునించి నేనతని గత చరిత్ర తవ్వి తియ్యడానికే పంపబడ్డానని మూర్తిరాజు పసిగట్టేశాడు. నిన్న సాయంత్రం సిటీక్లబ్‌లో నన్ను బెదిరించాడుకూడా. నా కార్యకలాపాలు తక్షణం కట్టిపెట్టి అక్కణ్నించి వెళ్ళిపోకుంటే కాల్చిపారేస్తానన్నాడు."

"వ్యవహారం అంతవరకూ వచ్చిందా? ఇప్పుడెక్కణ్నించి మాట్లాడుతున్నావ్?"

"హోటల్ సీక్లిఫ్ టెలిఫోన్ బూత్‌నించి. మీరు ఇంట్లో వున్నారో లేదో కనుక్కుందామని .. ఫోన్లో ఏమీ చెప్పడానికి వీల్లేదు. తిన్నగా అక్కడికే వస్తున్నాను. ప్లీజ్, వెయిట్ మి!" అవతల క్లిక్‌మంది.

రిసీవర్ దించి, సిగిరెట్ అంటించాడు మధు. ఒకేఒక విషయం అతని మస్తిష్కంలో పదేపదే మెదులుతోంది. శ్రీకాంత్, తిరువత్తియూర్ నించి మూర్తిరాజుని వెంబడిస్తూ హోటల్ సీక్లిఫ్ కెందుకెళ్ళాడు?

# 6

పది నిమిషాల తరవాత, కాలింగ్ బెల్ మోగింది. శ్రీకాంతే అయుంటాడనుకుంటూ తలుపుని సమీపిం

చాడు మధు. గడియతీసి, తలుపు తెరిచాడు. అంతే!

మొదలు నరికిన చెట్టులా గడపలో కూలింది ఓ ఆకారం!!

షాక్ తగిలినట్టు గగుర్పొడిచింది మధు శరీరం!!

ఆనంద్ కూడా పరిగెత్తుకొచ్చాడు ఆ దృశ్యం చూసి.

దిగ్భ్రాంతిలోంచి తేరుకుని, బోర్లా పడున్న వ్యక్తి వైపు చూశాడు మధు. అతని వీపులో అరరూపాయంత గుండ్రని రంధ్రం కనిపిస్తోంది. ఆ రంధ్రంలోంచీ బొట బొట కారుతోంది రక్తం!

చటుక్కున వంగి, అతన్ని వెల్లకిలా తిప్పాడు.

ఆనంద్ నోట్లోంచి, చిత్రవిచిత్ర శబ్దాలు బైటకి వచ్చాయి.

ఆ వ్యక్తి ఎవ్వరో కాదు.

శ్రీకాంత్!!

కళ్ళు బరువుగా వాలిపోతున్నాయి. చిన్నగా వణుకుతున్నాడు.

"శ్రీకాంత్! త్వరగా చెప్పు. ఎవ్వరు చేశారీపని?" అడిగాడు మధు అతన్ని కుదుపుతూ.

శ్రీకాంత్ అతి కష్టంమీద కళ్ళు తెరిచి చూశాడు. పెదాలు కదిలాయి.

"వెనకనించి ఎవ్వరో...పిస్తోలుతో..." అంతే.

అతని తల పక్కకి వాలిపోయిండి!

మెరుపులా కాంపౌండ్ లోకి పరిగెత్తాడు మధు. మసక చీకటి. మనిషి మాత్రుడు లేడు. ఆ చుట్టుపక్కల వుంటాడనుకోడంకూడా భ్రమ.

"మనం లోపలేవున్నాం! పిస్తోలు శబ్దం వినిపించ లేదే?" అన్నాడు ఆనంద్.

"హంతకుడు పిస్తోలుకు సైలెన్సర్ బిగించి వుండవచ్చు. వెంటనే పోలీసులకీ, లక్ష్మీపతిగారికీ ఫోన్ చెయ్యాలి!" అంటూ ఫోన్ వైపు పరిగెత్తాడు మధు.

అరగంట వ్యవధిలోనే ఆ ప్రదేశం పోలీసులతోనూ, పరిశోధన స్టాఫ్‌తోనూ నిండిపోయింది.

జరిగిందంతా లక్ష్మీపతి గారికి వివరించాడు మధు.

ఆ సంఘటన ఆయనమీద తీవ్రప్రభావం వేసింది. మొహం కందగడ్డలా జేవురించింది.

"మధూ! ఇక వదిలిపెట్టకూడదు. ఏ లక్ష్యం సాధించడానికి శ్రీకాంత్ బలయ్యాడో, ఆ లక్ష్యం నెరవేరందే ఊరుకోవద్దు. అతన్ని చంపిన హంతకుడు ఉరికంబం ఎక్కందే ఊపిరి తీసుకోకూడదు!" అన్నారాయన ఆవేశంగా.

రాత్రి పది గంటలకి శవం అంబులెన్స్‌లో తరలి వెళ్ళింది. దానితోబాటు అందరూ వెళ్ళిపోయారు. మధూ, ఆనంద్ మిగిలిపోయారు ఇంటి దగ్గర.

"ఆనంద్! ఈ కేసులో నువ్వు నాకు సహాయపడాలి. తెల్లారేలోగా, తిరువత్తియూర్ జేరుకో, అక్కడ శ్రీకాంత్ మూర్తిరాజుగురించి వాకబ్ చేస్తూ ఎవరెవర్ని కలుసుకున్నాడో, ఎక్కడెక్కడి కెళ్ళాడో, ఏం కనుక్కోడానికి ప్రయత్నించాడో ఆరాతియ్యి.

చాలా జాగ్రత్తసుమా! నేనిక్కడ నా పరంగా కొన్ని వివరాలు సేకరిస్తాను" అన్నాడు మధు, సిగరెట్ పీకని ఏష్‌ట్రేలో నొక్కుతూ.

ఆనంద్ తలూపాడు.

# 7

డైమండ్ కాఫీహౌస్ ముందు టాక్సీదిగి, లోని కళ్తా రిస్టువాచీ చూసుకున్నాడు మధు.

రాత్రి ఏడుగంటలు.

లోపల అట్టే జనంలేరు. కౌంటర్లో ఓ ముప్ఫయ్యేళ్ళ యువకుడు కూర్చుని ఏదో రాసుకుంటున్నాడు. అవతారాన్ని బట్టి, ఆంగ్లోయిండియన్‌లా కనిపిస్తున్నాడు.

"ఫిలిప్స్!" పిల్చాడు మధు.

అతను తలెత్తి, "మీరా మాస్టర్! ఎన్నాళ్ళకెన్నాళ్ళకి. రండి, రండి" అంటూ లేచివచ్చి మధుతో కరచాలనం చేశాడు.

"నీద్వారా కొన్ని వివరాలు తెలుస్తాయేమోనని యిలా వచ్చాను."

"చెప్పండి మాస్టర్!" అడిగాడు ఫిలిప్స్, మధుని ఆప్యాయంగా చూస్తూ.

ఫిలిప్స్ ఎవరోకాదు. ఒకప్పుడు మద్రాసులో పేరుమోసిన రౌడీ. విదేశీ మత్తుపదార్థాలు స్మగ్లింగ్ చేసేవాడు. అతని రాబడిచూసి ఓర్వలేక, యితర స్మగ్లర్లు అతనికి బద్ధ విరోధులయ్యారు.

ఎలాగయినా అతన్ని తమదారికడ్డు తొలగించుకోవాలని పథకం అల్లి, ఓ హత్యకేసులో యిరికించారు ఫిలిప్స్‌ని. సాక్ష్యాలన్నీ అతనికి విరుద్ధంగా సృష్టించబడ్డాయి.

ఆ రోజుల్లోనే పోలీస్ కస్టడీలోవున్న అతన్ని ఇంటర్వ్యూ చేశాడు మధు.

ఫిలిప్స్ ఇచ్చిన వాఙ్మూలాన్ని బట్టి, ఎందుకో అతను నిరపరాధి అనిపించింది మధుకు. తన ఎడ్వెంచరస్ నేచర్ దృష్ట్యా, తన పరంగా ఆ కేసు ఇన్వెస్టిగేట్ చేసి, చివరికి అసలు హంతకుల్ని కనుక్కోగలిగాడు.

ఫిలిప్స్‌మీద కేసు కొట్టివేయబడింది. ఆనాటినుంచీ మధుపట్ల అతనికి ఆరాధనాభావం వుంది. ఆ రోజుతో అతను చట్టవ్యతిరేక కార్యకలాపాన్నీ వదిలేసి, సంఘంలో నీతిగా బ్రతకాలని ప్రమాణం చేయించాడు మధు.

మాటప్రకారం, తన రౌడీయిజాన్ని, స్మగ్లింగ్ వ్యాపారాన్నీ కట్టిపెట్టి, చిన్న కాఫీ హౌస్ పెట్టుకుని బుద్ధిగా బ్రతుకుతున్నాడు ఫిలిప్స్.

కాఫీ హౌస్‌లో, ఓమూల రౌండ్ టేబిల్ ముందు కూర్చున్న వ్యక్తిమీద పడింది మధు దృష్టి.

అతని ముందు రెండు సోడాబుడ్లూ, ఓ విస్కీ బాటిల్ మెరుస్తున్నాయి. గ్లాసులోని విస్కీ కొద్దికొద్దిగా సిప్ చేస్తూ, ఇతర విషయాలతో నిమిత్తం లేకుండా మరో లోకంలో వున్నాడతను.

ఫిలిప్స్‌వైపు తిరిగి, "మళ్ళీ నీ వెనుకటి వ్యాపారం ప్రారంభించావన్నమాట" అన్నాడు మధు తీక్షణంగా.

ఫిలిప్స్ నిర్ఘాంతపోయి, "లేదే" అన్నాడు.

"ఐతే, ఆ మూల కూర్చున్న వ్యక్తి ఏం చేస్తున్నాడు?"

"వాడా! ఆ విస్కీ నేనిచ్చిందికాదు మాస్టర్! వాడే తెచ్చుకొని తాగి పోతుంటాడు."

"కాఫీహౌస్‌లో విస్కీ తాగడమా? నవ్వుతూనే ఊరుకుంటున్నావా?"

"వాడు చాలా ప్రమాదకరమైన వ్యక్తి మాస్టర్! ఆవేశంలో దేనికయినా తెగిస్తాడు. అందుకే నోరు మూసుకు ఊరుకుంటూను."

"వాడంటే అంత భయమా నీకు?"

"ఔను."

మధు ఆశ్చర్యంగా చూశాడు ఫిలిప్స్‌ని. "ఒకప్పుడు మద్రాసు టైగర్ అని పిలవబడే ఫిలిప్సేనా యిలా మాట్లాడుతోంది? నీలోని ధైర్యసాహసాలు యేమయ్యాయి?"

"మాస్టర్! ఆనాటి ఫిలిప్స్ ఇటువంటి పదిమంది రౌడీలని కూడా చిటికెలో తొబ్బరిచట్నీ చేసేవాడు. ఇప్పుడు మీ ముందున్న ఫిలిప్స్ ప్రతి అపరాధంనుంచీ దూరంగా వుండాలని ప్రయత్నిస్తాడు."

"వెరీగుడ్!" అంటూ ఆ వ్యక్తి వైపు చూశాడు మధు. "వాడి పేరేమిటి?"

"తంగ వేలు."

"సరే, మాటల్లో నేను వచ్చినపని విషయం మర్చాను"

"చెప్పండి మాస్టర్!"

"ఒకప్పుడు నీవీ నగరంలో పేరు మోసిన స్మగ్లర్‌వి. రకరకాల నేరస్థులతో నీకు పరిచయం వుండేది. పాతా కొత్తా యెవ్వరూ నీ దృష్టినించి దాగలేదు.

ప్రస్తుతం మద్రాసులోవున్న ఒక నేరస్థుడి గురించి ఆరా తీస్తున్నాను. వాడి కుడిచేతి చిటికెనవేలు తెగి వుంది. అటువంటి వాళ్ళెవరయినా తెలుసా నీకు?" అడిగాడు మధు.

ఫిలిప్స్ కాసేపాలోచించి, "తెలుసు!" అన్నాడు తలూపుతూ.

"ఎవ్వరు?"

"వాడిపేరు భయంకర్! పేరుకు తగ్గ మన స్తత్వం! విచిత్రంఏమిటంటే వాడింతవరకూ పోలీసుల చేతికి చిక్కలేదు. అంతెందుకు, వాడి వునికే పోలీసులకి తెలిసి వుండదని నా అభిప్రాయం! అంత గోప్యంగానూ, చాకచక్యంగానూ చేస్తూంటాడు నేరాలు.

సాధారణంగా వాడు పెద్దమనుషుల దగ్గిర, అధిక మొత్తాలు తీసుకుని వాళ్ళు చెప్పిన పనులుచేసి పెడుతుంటాడు. ఆ పనుల్లో తోడుగా ఇంకెవర్నయినా వినియోగించుకుంటూంటాడు. ఉదాహరణకి, మీముందు కూర్చున్నాడు చూడండి."

"ఈ తంగవేలు కూడా వాడి మనిషేనా?"

ఫిలిప్స్ తలూపి, "ఈమధ్య వాడికీ వీడికీ మంచి దోస్తీ కుదిరినట్టుంది. తరచూ ఇద్దరూ కనిపిస్తున్నారు జంటగా" అన్నాడు.

"భయంకర్ ఎక్కడుంటాడో తెలుసా నీకు?"

ఫిలిప్స్ పెదవి విరిచి, "తెలీదు" అన్నాడు.

అదే సమయంలో దూరాన కూర్చున్న తంగవేలు లేచి నిల్చున్నాడు.

"వాణ్ని వెంబడిస్తే. భయంకర్ నివాసం తెలిసే అవకాశం వుందా?" అడిగాడు మధు తగ్గుస్వరంలో.

ఫిలిప్స్ తలూపాడు.

తంగవేలు సిగరెట్ అంటించుకుని, తడబడే అడుగులతో ద్వారంవైపు నడిచాడు. అతనివైపు వీపుతిప్పి

నిల్చున్నాడు మధు. తంగవేలు పరిసరాలను పట్టించుకోకుండా కాఫీహౌస్‌లోంచి బైటపడ్డాడు.

"వస్తా!" అంటూ ఫిలిప్స్ దగ్గర శెలవు తీసుకుని తనూ బయటికి నడిచాడు మధు.

"మాస్టర్! జాగ్రత్త!" వెనుకనించి లీలగా వినిపించింది ఫిలిప్స్ కంఠం.

# 8

కాఫీహౌస్‌కి కొద్దిదూరంలో, పేవ్ మెంట్ పక్కన ఆగివున్న అంబాసిడర్ కారెక్కాడు తంగవేలు. ఇంకా ఆకారు స్టార్ట్ కాకముందే, రోడ్డుమీద పోతున్న ఓ టాక్సీ ఆపి ఎక్కాడు మధు.

అంబాసిడర్ కదిలింది.

"ఆ కారు వెనకపోనివ్!" అన్నాడు మధు టాక్సీ డ్రయివర్‌తో.

తంగవేలు కారుకి ఏభయిగజాల వెనకవుండి వెంబడిస్తోంది టాక్సీ.

నాలుగయిదు రోడ్స్ కట్ చేశాక, మాంబళం వీధిలోకి తిరిగింది కారు. వీధిగుండా కొద్దిదూరం వెళ్ళి, ఓ డాబా ఇంటి గేట్లోకి తిరిగింది.

మధు టాక్సీదిగి, మీటర్ బిల్ పేచేసి, కంటసేపు అక్కడే తచ్చాడుతూ యింటిని క్షుణ్ణంగా పరిశీలించాడు.

తంగవేలు కారుదిగి లోపలికెళ్ళి పోయాడు. మళ్ళీ బయటకు రాలేదు. ఇంట్లో దీపాలు వెలుగుతున్నాయి.

మధుఅక్కణ్నించి బయలుదేరుతూ, ఆ యింటి నెంబర్ నోట్ చేసుకుని, తిన్నగా తన యింటికి చేరుకున్నాడు.

వసారాలో అతనికోసమే ఎదురు చూస్తున్నట్లు పచార్లు చేస్తున్నాడు ఆనంద్.

"తిరువత్తియూర్ నించి ఎప్పుడొచ్చావ్?" అడిగాడు మధు.

"ఇప్పుడే మీకోసమే వాచుకొన్నాను. తిరువత్తియూర్‌లో అనేక విషయాలు వెల్లడయ్యాయి." అంటూ తలుపు తెరిచాడు ఆనంద్.

ఇద్దరూ లోనికెళ్ళి కూర్చున్నారు.

"శ్రీకాంత్ అక్కడికెళ్ళాక, మూర్తిరాజు మొదట అతని గురించి ఏమీ పట్టించుకోలేదుట. చాలా నిర్లక్ష్యంగా వున్నాడుట. తర్వాత ఎందుకో అతనిలో భయ భ్రాంతులు కనిపించాయట. అందుకే సిటీక్లబ్‌లో శ్రీకాంత్‌ని బెదిరించి వుంటాడు, ఊరొదిలి వెళ్ళిపొమ్మని.

ఆ తరవాత మూర్తిరాజు హాఠాత్తుగా తిరువత్తియూర్ వదలి మద్రాసు వచ్చేశాడు. అతని వెనకే శ్రీకాంత్ కూడ వచ్చాడు. ఆదేరోజు అతని హత్య జరిగింది ఇక్కడ.

నేను సీక్లిఫ్ హోటల్‌కెళ్ళి వాకబు చేశాను. ఆ హోటల్ యజమాని మురుగేశన్‌తో మూర్తిరాజుకు చాలా గాఢమైన స్నేహం వుందిట. మూర్తిరాజు తరచూ అక్కడకి వస్తూ పోతుంటాడట.

ఈ మధ్య అతనివెంట ఓ అందమైన యువతి కూడా కనిపించిందట ఆ హోటల్లో. విచిత్రం ఏమిటంటే ఈ రోజు ఉదయం మూర్తిరాజు మురుగేశన్ని కలుసుకోడానికి వెళ్ళాడు. అక్కడ యిద్దరికీ ఏదో విషయంలో మాటా మాటావచ్చి, తీవ్రంగా పోట్లాడుకున్నారట.

కాసేపటికి మూర్తిరాజు బుసలుకొడుతూ హోటల్లోంచి బయటికెళ్ళిపోయాడుట. అక్కణ్ణించి తిన్నగా 'ప్రయివేట్ డిటెక్టివ్ ఏజెన్సీ' ఆఫీసుకెళ్ళి, మురుగేశన్ని ఓకంట కనిపెడుతూ వుండటానికి, ఆ సంస్థనించి ఇద్దరు డిటెక్టివ్‌లని నియమించాడు.

ఇప్పుడా డిటెక్టివ్‌లు మురుగేశన్ని కనిపెడుతూ, సీక్లిఫ్ హోటలు చుట్టుపక్కల కాపుకాసి వున్నారు!" అన్నాడు ఆనంద్.

"మూర్తిరాజు ఎక్కడున్నాడిప్పుడు?"

"స్కైలైన్ హోటల్లో, రూం నెంబర్ 116 లో బసచేశాడు."

"ఆల్ రైట్! నేనిప్పుడే వెళ్ళి అతన్ని కలుసుకుంటాను. నువ్వు వెంటనే మాం.శం వెళ్ళి, ఈ యింటిని వాచ్ చేస్తూవుండు. ఆ ఇంట్లోంచి ఎవ్వరయినా బయటకి వస్తే ఫాలో చెయ్!" అంటూ ఓ కాగితంమీద, తంగవేలు వెళ్ళిన యింటినెంబర్ రాసిచ్చాడు మధు.

ఆనంద్ కాగితం అందుకుని వెళ్ళిపోయాడు.

మధు మస్తిష్కం తీవ్రంగా ఆలోచిస్తోంది. మూర్తిరాజు వెంట ఓ అందమయిన యువతి ... మురుగేశన్‌కీ, అతనికీ గాఢమైన స్నేహం...పోట్లాట...మురుగేశన్ ఆఫీసులో దొంగతనం...డబ్బుతోబాటు కొన్ని కాగితాలు పోయాయి...శ్రీకాంత్ హత్య...

ఈ సంఘటనలన్నీ ఒకే కడలి కెరటాలా?

ఆలోచిస్తూ మూర్తిరాజును కలుసుకోడానికి బయలుదేరాడు మధు.

# 9

కాలింగ్ బెల్ నొక్కాడు మధు.

రెండు నిముషాల తర్వాత తలుపు తెరుచుకుంది.

"ఏం కావాలి?" అడిగాడు మూర్తిరాజు అతన్ని పరీక్షగా చూస్తూ.

"అప్పుడే నన్ను మర్చిపోయారా మూర్తిరాజుగారూ."

"జ్ఞాపకం రావడంలేదు. ఎవరుమీరు?"

"నా పేరు మధు! పరిశోధన చీఫ్ రిపోర్టర్ని!"

"ఓహో! మీ పత్రికలో నాగురించిపడ్డ తప్పుడు సమాచారం సందర్భంలో మీతో మాట్లాడాను కదూ?"

"కేవలం మాట్లాడలేదు. మామీద పరువునష్టం దావా వేస్తానని బెదిరించారు."

"ఇప్పుడా విషయం పాతబడి పోయిందికదా?"

"మీ దృష్టిలో పాతబడి పోవచ్చు. కాని మేమింకా ఆ విషయాన్ని ఉపసంహరించుకోలేదు."

"నష్టపరిహారం చెల్లించనవసరం లేదనీ, ఆ ఘటన అంతటితో వదిలెయ్యమనీ మీకు ఫోన్ చేశాను కదా?"

"అదే మా ఇంట్రస్టుకి కారణం! మీలో హఠాత్తుగా అంత మార్పెందుకు వచ్చిందీ అని" అంటూ సంకోచించకుండా గదిలో ప్రవేశించాడు మధు.

మూర్తిరాజు ముఖం చిట్లించాడు.

మధు సోఫాలో చతికిలబడి, తాపీగా సిగరెట్ అంటించాడు.

"మూర్తిరాజుగారూ! బహుశా మీకు శ్రీకాంత్ తెలుసనుకుంటాను."

"ఎవరా శ్రీకాంత్?"

"నటించకండి. నటించడం మీ ప్రజానాయకులకు ఉగ్గుపాలతో నేర్పిన విద్య. నాముందు నటించి లాభం లేదు. శ్రీకాంత్ మా పత్రిక తరఫున, మీ గతజీవితాన్ని పరిశీలించడానికి మీవూరు పంపబడ్డ మా విలేఖరి!

తిరువత్తియూర్ సిటీకబ్‌లో మీ రతన్ని చంపుతానని బెదిరించారు. మిమ్మల్ని వెంబడిస్తూ మద్రాసు వచ్చిన శ్రీకాంత్ ఇక్కడ హత్యచెయ్యబడ్డాడు. మీరతన్ని బెదిరించిన విషయం ఇంకా పోలీసుల వరకూ వెళ్ళలేదు. మిస్టర్ మూర్తిరాజూ! సాక్ష్యాలన్నీ మీకు విరుద్ధంగా వున్నాయి. శ్రీకాంత్ మీకు సంబంధించిన కీలకమయిన రహస్యాన్నేదో కనిపెట్టాడు. అది వెల్లడి చెయ్యక ముందే చంపబడ్డాడు. ఈ విషయాలన్నీ పోలీసులకి తెలిస్తే మీస్థితి ఏమాతుందో వూహించుకోండి."

మూర్తిరాజు ముఖం పీక్కుపోయింది. "మిస్టర్ మధూ! భగవంతుడిమీద ప్రమాణంచేసి చెబుతున్నాను. అతన్ని నేను చంపలేదు."

"మరెవ్వరు చంపారు?"

"నాకు తెలియదు."

"సరే, అతను మీ రహస్యాన్నేదో కనుక్కున్నాడని ఒప్పుకుంటారా?"

మూర్తిరాజు పలకలేదు.

"మాట్లాడండి! మీరు మౌనం వహించినంతమాత్రాన ఊరుకోను. శ్రీకాంత్ మాపత్రిక ఉద్యోగి. అతన్ని చంపిన హంతకుణ్ని వురికంబం ఎక్కించందే మా స్టాఫ్ నిదరబోదు" అన్నాడు మధు తీక్షణంగా.

మూర్తిరాజు ముఖంలో మిగిలివున్న కొద్దిపాటి కాంతి కూడా హరించుకు పోయింది. నుదురు రాసుకుంటూ చాలాసేపు గదిలో పచార్లు చేశాడు. చివరికి ఓ నిర్ణయానికి వచ్చినట్లు సాలోచనగా తలూపుతూ తలుపు మూసి, సోఫాలో కూలబడ్డాడు.

"మిస్టర్ మధూ! ఇకదాచి లాభంలేదు. నేను చేజేతులా ఓ ప్రమాదాన్ని కొని తెచ్చుకున్నాను. ఇప్పుడు నాతలమీద ఒరలేని నగ్నకత్తి వేలాడుతోంది. వివరంగా చెబుతాను వినండి.

గత పది సంవత్సరాలుగా నేను రక్షణశాఖకి విశ్వాస పాత్రుణ్ణయిన కాంట్రాక్టర్‌గా వ్యవహరిస్తున్నాను. ఆ విభాగంనించి నాకు అనేక కీలకమైన కాంట్రాక్ట్స్ లభించాయి. నా కంపెనీ ఇంజనీర్లద్వారా వాటిని ప్రతిభావంతంగా పూర్తిచేసి యిచ్చాను.

తత్ఫలితంగా ఈమధ్యే నాకు ఓ రహస్యమయిన కాంట్రాక్ట్ లభించింది. మన శాస్త్రవేత్తలు కొత్తగా అత్యంత తీవ్రమయిన ఓ ప్రేలుడు పదార్థాన్ని కనిపెట్టారు. దానిపేరు 'కరోలైట్!'

దాన్ని ఇంధనరూపంలో ప్రయోగిస్తే, అణుబాంబు కన్నా రెండురెట్లు అధిక పరిణామాలు సృష్టిస్తుంది. దాన్ని తయారు చెయ్యడానికి, ఓ రహస్య ప్రదేశంలో ఒక ఫ్యాక్టరీ నిర్మించబడింది. ఆ ఫ్యాక్టరీలో సరికొత్త మిషనరీ ఫిట్ చెయ్యడమే నా కప్పగించిన పని.

నా కంపెనీ ఇంజనీర్లతోనూ, రక్షణశాఖ నిపుణులతోనూ సంప్రదించి, రాత్రింబవళ్ళూ కష్టపడి, డిజైనింగ్

తయారు చేశాను. వారం రోజుల క్రితం అధికార్లు ఆ డిజైనింగ్‌ను ఆమోదించి ఫైనలైజ్ చేశారు.

ఆదేరోజు మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతంలో ఆ ఫ్యాక్టరీకి సంబంధించిన మ్యాపూ, అందులో ఫిట్ చెయ్యవలసిన మిషనరీ బ్లూప్రింట్సూ ఇవ్వబడ్డాయి నాకు.

వాటిని జాగ్రత్తగా ఓ పొడుగాటి పసుపురంగు కవర్లో భద్రం చేసుకొని, స్థానిక రక్షణశాఖ కార్యాలయంనించి బయటపడ్డాను. అప్పుడే నాకు తెలిసిన ఓ యువతి ఎదు రయింది..."

"ఎవరు? మీ వెంట రెండు మూడుసార్లు హోటల్ సీక్లఫ్‌లో అందరికీ కనిపించిన యువతేనా?"

"ఔను. ఆమే."

"ఆమెకూ, మీకూ ఎప్పటినుంచి పరిచయం?"

"నెలరోజుల క్రితం ఇక్కడే ఓ క్లబ్బులో తటస్థ పడింది. తరచూ కలుసుకునేవాళ్ళం. చాలా అందమైన అమ్మాయి..."

"ఆమె పేరేమిటి?"

"జరీనా తాజ్!"

"ముస్లిమా?"

"ఔను! అందుకే..." నీళ్ళు నమిలాడు మూర్తిరాజు.

"మీరు రక్షణశాఖ కార్యాలయంనించి బయటపడ్డాక ఆమె కనిపించిందన్నారు. తరువాత ఏం జరిగింది?"

"ఆమెను చూడగానే నేను పలకరించాను. ఆ బ్లూ ప్రింట్స్ గొడవలోపడి, నేనామెను రెండుమూడు రోజులు వరుసగా కలుసుకోలేదు. అదే అడిగింది. వెంటనే సంజాయిషీ స్ఫురించక నోరుజారాను బ్లూప్రింట్స్

గురించి. ఆ కవర్ ఆమెకు చూపుతూ, నా ఘనవిజయం గురించి గొప్పగా చెప్పుకున్నాను.''

''అప్పుడామె యెలా ప్రవర్తించింది?''

''నేను చెప్పే విషయంమీద ఆట్టే ఆసక్తిచూపలేదు. ఇంకేవో కబుర్లు ప్రారంభించింది. ఆ కాంట్రాక్ట్ దొరికినందుకు, ఆ సమయంలో నా మూడు చాలా బాగుంది. ఇద్దరం కలసి ఓ బార్‌లో కెళ్ళాం!

ఆమె విస్కీ తాగాలన్న కోరిక వ్యక్తం చేసింది. తెప్పించాను. మాటల్లో మామధ్య ఎన్ని పెగ్గులూ బాటిల్సూ ఖాళీ అయ్యాయో తెలియనే లేదు.

నా కళ్ళముందు నింగీనేలా ఏకమౌతున్నట్టు కనిపించే సరికి గ్రహించాను, ఆమెకన్నా నేనే ఎక్కువ తాగానని. నా పరిస్థితిచూసి ఇక వెళదామంది జరీనాతాజ్.

ఆమెనించి విడిపోయి ముందా కవర్ని ఎక్కడయినా సురక్షితం చెయ్యాలనే ఆలోచన వచ్చింది నాకు. కాని, ఆమె ఆ స్థితిలో నన్ను ఒంటరిగా వదలి వెళ్ళదలచుకో లేదు.

హోటల్ సీక్లఫ్ కెళ్ళి, అక్కడి క్లబ్బులో కాసేపు రిలాక్స్ అవుదామని, ఆలోగా నా పరిస్థితి కొంత మెరుగవుతుందని చెప్పాను. అందుకు జరీనాతాజ్ సమ్మతించింది. ఇద్దరం టాక్సీలో సీక్లఫ్ చేరుకున్నాము.

అక్కడే ఒకరి బలవంతంమీద మరో రెండు కాక్ టేల్స్ తాగేశాం. నేను 'రోలెట్' టేబుల్ దగ్గర కెళ్ళి పందెం కాయడం ప్రారంభించాను. కొద్ది సేపటికే, ఆ రోలెట్ చక్రంతోబాటు నా బుర్రకూడా గిరగిర

తిరుగుతున్నట్టు తోచింది. కాక్ టేల్ ప్రభావంవల్ల. క్రమేపీ కళ్ళముందు చీకట్లు కమ్ముకోసాగాయి.

నా కోటు జేబులోవున్న ఆ కవరు పదేపదే గుర్తు రాసాగింది. ఆ నిషాలో దాన్ని యెక్కడ పోగొట్టు కుంటానో అని భయపడ్డాను. అప్పుడే ఓ ఐడియా తట్టింది నాకు. ఆ హోటల్ ప్రొప్రయిటర్ మురుగేశన్ నా మిత్రుడు.

అతని ఆఫీసుగదిలోని ఐరన్ సేఫ్‌లో ఆ కవరు భద్రం చేస్తే ఏ చిక్కూ వుండదు. మురుగేశన్‌తో మాట్లాడి వస్తానని జరీనాతో చెప్పి పైకెళ్ళాను.

మురుగేశన్ తన ఆఫీసులోనే వున్నాడు. నేనా కవర్ తీసి, అందులో నా రొటీన్ బిజినెస్ కాగితాలు వున్నాయనీ, సేఫ్‌లో భద్రం చెయ్యమని కోరాను. నా కళ్ళముందే దాన్నతను సేఫ్‌లో పెట్టి తాళం వేసాడు.

అప్పుడుగానీ, నా మనసు కుదుట పడలేదు. నిశ్చింతగా కిందికెళ్ళి, తిరిగి జరీనాతాజ్‌ని కలుసుకున్నాను. ఆ లోగా ఆమె చాలా బోర్ అయినట్టు కనిపించింది. యింటికెళ్దామంది.

ఇద్దరం టాక్సీలో ఆమెయిల్లు చేరుకున్నాం. అప్పటికీ నా పరిస్థితి స్థిమితపడలేదు. జరీనాతాజ్ ఓ గ్లాసులో ఏదో జ్యూస్ పోసి, దాన్ని తాగితే నిషా కంట్రోల్ అవుతుందని అందించింది. తాగాను. నిషా కుదుటపడే బదులు మరింత విషమిస్తున్నట్టు ఫీలయ్యాను.

కాసేపటికి నాకు తెలీకుండానే మంచంమీద వాలి పోయాను. మళ్ళీ కళ్ళు తెరచి చూస్తే యిల్లుఖాళీ. జరీనా మాయం! ఆమె సామానుకూడా లేదు యింట్లో.

రిస్టువాచీ చూసుకుని అదిరిపడ్డాను. అందులో ఆది వారం, 20వ తేదీ కనిపించాయి. నేనక్కడకు వచ్చింది శుక్రవారం.

అంటే, నేను రెండురోజులు నిదరబోయానా? జరీనా తాజ్ ఏమయింది? అనుకుంటూ సిగిరెట్ కోసం జేబులో చెయ్యిపెట్టాను. ఖాళీ! పర్సు, పాకెట్ డైరీ అన్నీ మాయమయ్యాయి!

ఆదరాబాదరా సీక్లప్ హోటల్ చేరుకున్నాను. మురుగేశన్ని కలుసుకున్నాను. అతను చెప్పిన విషయం విని, నా గుండె ఆగినంత పనయింది. రాత్రి యెవ్వరో యిద్దరు దొంగలువచ్చి, అతని సేఫ్ కొల్లగొట్టి పోయారట. డబ్బుతో బాటు నేనిచ్చిన కవరూ పట్టుకు పోయారట.

నాకు పిచ్చెక్కినట్టయింది. ఆ రోజే మీ పత్రికలో నాగురించి తప్పుడు సమాచారం ప్రచురించ బడింది. మీ ఆఫీసుకువచ్చి గొడవ పడ్డాను.

ఆ కవర్ని యెలాగయినా సంపాదించి పెట్టమని మురుగేశన్తో చెప్పి, తిరువత్తియూర్ వెళ్ళిపోయాను. అక్కడ మీ విలేఖరి శ్రీకాంత్ కనిపించాడు. అత నక్కడి కెందుకొచ్చాడో ఊహించి హడలిపోయాను.

అతనివల్ల ఆ బ్లూప్రింట్స్ సంగతి ఎక్కడ బయట పడుతుందోనని భయపడి, వెంటనే తిరువత్తియూర్ వదిలిపొమ్మని బెదిరించి, మీ ఆఫీసుకు ఫోన్ చేశాను, గొడవసంగతి మర్చిపొమ్మని.

ఆ తరవాత, మురుగేశన్ ఆ కవరు గురించి ఏమయినా కనుక్కున్నాడేమో చూద్దామని మద్రాసు వచ్చాను.

అతనేమీ కనుక్కోలేక పోయాననేసరికి, వళ్ళుమండి అతనితో ఘర్షణ పడ్డాను.

అప్పట్నించి, ప్రయివేట్ డిటెక్టివ్ ఏజన్సీకెళ్ళి ఇద్దరు డిటెక్టివ్‌లని నియమించాను, ఆ దొంగల ఆచూకీ కనుక్కోమని.

మిస్టర్ మధూ! నామాట నమ్మండి. జరిగింది జరిగినట్టు చెప్పాను మీకు. శ్రీకాంత్‌ని నేను చంపలేదు. ఈ రొంపిలోంచి నన్ను మీరే గట్టెక్కించాలి'' అన్నాడు మూర్తిరాజు దీనంగా.

మధు ఏదో చెప్పబోయేంతలో, టెలిఫోన్ మోగింది. మూర్తిరాజు ఫోన్ కాల్ విని, ''మీకు!'' అంటూ రిసీవర్ మధు కందించాడు.

''ఎస్! మధు హియర్!''

''నేను ఆనంద్‌ని మాట్లాడుతున్నాను. నీవు మాంబళంలో చెప్పిన యింటిని కనిపెట్టాను. గంటక్రితం ఆ యింట్లోంచి తంగవేలూ, భయంకర్ బయటికివచ్చి, కారులో బయలుదేరారు.

వాళ్ళకనుమానం రాకుండా, టాక్సీలో వెంబడించాను. వాళ్ళకారు తిన్నగా ధనలక్ష్మి కాలనీ చేరుకుని, అరవ నెంబర్ మేడలోకి తిరిగింది.

ముందు భయంకర్ యింట్లోకెళ్ళాడు. తంగవేలు యింకా బయటే తచ్చాడుతున్నాడు. అక్కడేదో జరగబోతున్నట్టు నా అనుమానం. వెంటనే బయలదేరు''

మధు రిసీవర్ దించి, క్షణం వృథా చెయ్యకుండా మూర్తిరాజుతో టాక్సీ యెక్కాడు.

# 10

ధనలక్ష్మి కాలనీలో ఆరో నెంబర్ ఇల్లు కనుక్కోడం వాళ్ళకి కష్టంకాలేదు. వాళ్ళని చూడగానే ఆనంద్ ఓ స్తంభం చాటునుంచి బయటకు వచ్చాడు.

"అదిగో, తంగవేలు యింకా కంపౌండ్ లోనే తచ్చాడుతున్నాడు," అంటూ చూపించాడు ఇంటివైపు.

సాలోచనగా తలూపాడు మధు.

సరిగ్గా అదే క్షణంలో, ఆ యింట్లోంచి పిస్తోలు పేలిన శబ్దం వినిపించింది. ముగ్గురూ నివ్వెరబోయారు. అంత వరకు కంపౌండ్ లో తచ్చాడుతున్న తంగవేలు మెరుపులా యింట్లోకి పరిగెత్తాడు.

"రండి!" అంటూ యింటివైపు పరిగెత్తాడు మధు.

ముగ్గురూ నిశ్శబ్దంగా యింటిలో ప్రవేశించారు. ఎవ్వరూ లేరు. హాలు కుడిపక్క తలుపులు మూసివున్న ఓ గది కనిపించింది. గదిలోంచి సన్నని మూలుగులు వినిపిస్తున్నాయి.

సవ్వడి కానివ్వకుండా, తలుపుని సమీపించారు.

తలుపు కన్నంలో కన్ను పెట్టి చూశాడు మధు. లోపల కనిపించిన దృశ్యం అతన్ని దిగ్భ్రాంతుణ్ని చేసింది!

భయంకర్ నేలమీద పడి కొట్టుకుంటున్నాడు. అతని ఛాతీలోంచి కారుతోంది రక్తం! అతని ముందు ఓ మధ్య వయస్కుడు నిల్చున్నాడు. అతని చేతిలో పిస్తోలు మెరుస్తోంది. భయంకర్ని బహుశా అతనే షూట్ చేసుంటాడు!

అతని పక్కనే ఓ అందమైన యువతి నిల్చునుంది.

వాళ్ళ కెదురుగా తంగవేలు నిల్చున్నాడు. అతని చేతిలో రివాల్వర్ వుంది. తంగవేలు ఒకసారి కిందపడున్న

భయంకర్ వైపు చూసి, పళ్ళు కొరుకుతూ ఆ వ్యక్తి వైపు రివాల్వర్ పేల్చాడు.

అతను మెరుపులా పక్కకి గెంతి, గుండు తగలకుండా తప్పించుకున్నాడు. మరుక్షణం అతని పిస్తోలుకూడా పొగలు కక్కింది. తంగవేలు చేతిలోని రివాల్వర్ ఎగిరి కిందపడింది. దాన్నందుకోడానికి పరిగెత్తబోయాడు. అంతే!

ఆ వ్యక్తి మరోసారి ట్రిగ్గర్ నొక్కాడు!

"ఢాం!" గది మారుమోగింది.

తంగవేలు మొదలు నరికిన చెట్టులా కిందకూలి, బిగుసుకుపోయాడు.

"జరీనా! బ్లూప్రింట్స్ వాడి దగ్గరే వుండి వుంటాయి. వెదుకు!" అన్నాడతను ఆ యువతితో.

జరీనా తాజ్ గబగబ తంగవేలు దుస్తులు వెతికి, ఓ పొడుగాటి పసుపురంగు కవరూ, మరో కాగితాల కట్టా బైటికి తీసింది. కాగితాల కట్ట విప్పి, కాసేపు పరిశీలించి. నిర్లక్ష్యంగా వాటిని కిందపడేసింది!

తరవాత, ఆ కవరు తెరిచి, అందులోని పేపర్స్ ఇవతలికి లాగి, "బ్లూప్రింట్స్!" అంది మెరిసే కళ్ళతో,

అంతవరకూ చూసి, వెనుదిరిగాడు మధు. "నువ్వు వెంటనే పోలీసులకి ఇంటిమేట్ చెయ్. మేమిద్దరం వాళ్ళ సంగతి చూసుకుంటాం!" అన్నాడు ఆనంద్ చెవిలో.

ఆనంద్ వెంటనే అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

- కన్నంలోంచి మళ్ళీ లోనికి చూశాడు మధు. ఆ వ్యక్తి చేతిలో వున్న పిస్తోలు జేబులో వేసుకుని, జరీనా తాజ్ నించి బ్లూప్రింట్స్ అందుకున్నాడు.

మధు ఇక జాప్యం చెయ్యదలచుకోలేదు. హిప్ పాకెట్‌లోంచి తన చిన్నసైజు పిస్తోలు బైటికి లాగుతూ, "మీ ఆయుధంకూడా తియ్యండి." అన్నాడు మూర్తి రాజుతో.

మరుక్షణం మూర్తిరాజు చేతిలోనూ పిస్తోలు ప్రత్యక్షమైంది. మధు ఇంకేమీ ఆలోచించకుండా, ఒక్క తన్ను తన్నాడు తలుపుని. భళ్లున తెరుచుకుంది. లోపలున్న ఇద్దరూ అదిరిపడి ఇటు తిరిగారు.

"కదలకండి! చిటికెన వేలు కదిపినా, పిచ్చికుక్కల్లా చస్తారు జాగ్రత్త!" అన్నాడు కర్కశంగా.

ఆ వ్యక్తి చేతిలోంచి బ్లూప్రింట్స్ కవరు జారి కింద పడింది.

"ఇద్దరూ చేతులెత్తి, గోడవైపు తిరగండి!" అరిచాడు మధు.

చెప్పినట్టు చేశారు!

మూర్తిరాజు ఆత్రంగా, కింద పడున్న కవర్ని అందుకుని, గుండెకి హత్తుకున్నాడు, పోయిన పెన్నిధి దొరికినట్టు.

అంతలో, బైట పోలీస్ వాహనాల సైరన్ వినిపించింది. ఇన్‌స్పెక్టర్ శ్రీనివాసరావు నేతృత్వంలో, అర డజను మంది కానిస్టేబుళ్ళు బిలబిల వచ్చారు లోనికి.

సరిగ్గా ఆదేసమయంలో, అంతవరకూ అచేతనంగా పడున్న భయంకర్ మూలుగు వినిపించింది నేలమీద! మధు ఆశ్చర్యంగా అతన్ని సమీపించి చూశాడు.

అతను చావలేదు!

కొన ఊపిరితో ఉన్నాడు. బహుశా, గుళ్ళు తగిలి మూర్ఛపోయుంటాడు. ఇప్పుడే స్పృహ వచ్చింది!

"భయంకర్!" పిల్చాడు మధు ఆత్రతగా.

మూలుగుతూ అతి కష్టంమీద కళ్ళు తెరిచాడు. చుట్టూ వున్న వాళ్ళని కలయజూశాడు. చేతులకి బేడీలు తగిలించు కున్న జరీనా తాజ్‌నీ, ఆ వ్యక్తినీ చూడగానే అతని పెదాలపై చిన్న చిరునవ్వు వెలిగి మాయమైంది.

"భయంకర్! ఇవి నీ చివరి ఘడియలు. ఏమైనా వాఙ్మూలం ఇవ్వవలచుకుంటే, త్వరగా ఇవ్వు!" అన్నాడు మధు.

భయంకర్ తలూపాడు. అతి కష్టంమీద కంఠం పెగుల్చుకుని చెప్పసాగాడు. "వీళ్ళిద్దరూ అంతర్జాతీయ గూఢచారులు. ఒకదేశ రహస్యాలు తస్కరించి, మరో దేశానికమ్ముకోడం వీళ్ళవృత్తి!

వాడి పేరు బాబర్! అది వాడి ప్రియురాలు. నాలుగు రోజుల క్రితం వాడు నన్ను కలుసుకుని, సీక్రెవ్ హోటల్ యజమాని ఆఫీసులో ఓ ఐరన్ సేఫ్ వుందనీ, అందులో, పసుపురంగు కవరొకటి వుంటుందనీ, దాన్ని తెచ్చిస్తే ఏభై వేలిస్తాననీ చెప్పాడు. ఒప్పుకున్నాను.

తంగవేలు సహాయంతో ఆ పసుపు రంగు కవర్ని చేజిక్కించుకో గలిగాను.

ఆ సేవ్‌లో నాకు మరో కాగితాల కట్ట దొరికింది. వాటిలో కొన్ని ప్రేమ లేఖలూ, అశ్లీలమైన ఫోటోలూ వున్నాయి. ఆ పసుపురంగు కవర్లో ఏవో కాగితా లున్నాయి. అవేమిటో నాకర్థంకా లేదు!

ఏది ఏమైనా, అవి చాలా ముఖ్యమైనవే అయుంటాయి. లేకుంటే, అతనంత డబ్బు దేనికిస్తాడు? ఈ అవకాశాన్ని నేనెందుకు సద్వినియోగం చేసుకోకూడదు? అనిపించింది.

వాటిని దాచేసి, అతన్ని కలుసుకున్నాను. ఆ కాగితాలు కావాలనుకుంటే, ఏభైవేలతో సరిపోదనీ, ఎనభైవేలు కావాలనీ బేరంపెట్టాను. మొదట, బాబర్ మండిపడ్డాడు. చివరికి గత్యంతరం లేక ఒప్పుకున్నాడు.

ఈ రోజు రాత్రి ఈ ఇంటికి రమ్మనీ, డబ్బిచ్చి కవరు తీసుకుంటాననీ చెప్పాడు. నమ్మాను!

జాగ్రత్తకోసం తంగవేలుని వెంటబెట్టుకొచ్చాను. తంగవేలుకి కాగితాలిచ్చి, బైటే వుండమని చెప్పి, నేను లోనికొచ్చాను.

బాబర్ డబ్బుకు బదులు, నామీదికి పిస్తోలు తీసి, కాగితాలివ్వమని బెదిరించాడు. నేను ఎదురు తిరిగితే కాల్చేశాడు. ఆ శబ్దం విని, తంగవేలు పరిగెత్తుకొచ్చాడు...'' భయంకర్ ఆగి, ఊపిరందక ఆయాసపడసాగాడు.

''మా పత్రిక విలేఖరి, శ్రీకాంత్ తెలుసా నీకు?''

అలూపాడు భయంకర్.

''ఎవ్వరు చంపారతన్ని?''

''బాబర్! శ్రీకాంత్‌కు ఆ పసుపు కవరు రహస్యం ఎలా తెలిసిందో, తెలిసిపోయింది. అది బైటపడకుండా, బాబర్ అతన్ని చంపేశాడు...''

''భయంకర్! ఒక విధంగా నీ వల్ల దేశానికెంత మేలు జరిగిందో నీకు తెలీదు. ఆ కాగితాలను నీవు దొంగిలించిన వెంటనే, బాబర్‌కిచ్చివుంటే, ఈ పాటికవి, శత్రుదేశం చేరుకునేవి! మన రక్షణ శాఖ ప్రయత్నాలన్నీ మంటగలిసేవి. నీవు చేసిన జాప్యంవల్లే వాళ్ళు దొరికిపోయారు!''

భయంకర్ తల విదిలించి, "నాకేం తెలీదు! అత్యాశకు లోనై జాప్యం చేశాను. అంతా ఆ పైవాడి లీల..." అంటూ చెయ్యెత్తి ఆకాశంవైపు చూపాడు.

లేచిన అతని చెయ్యి, అకుకూర కాడల్లా తిరిగి నేల కరిచింది! తల పక్కకి వాలిపోయింది!!

అప్పుడుగానీ అతను చావలేదు!!!

——: ఐపోయింది :——

## సీరియల్




[పదిహేడవ భాగము]

సులేమాన్ వంక చూసాను. అతని ముక్కూ, ముఖం యిసుకమయమైపోయింది. కళ్లు నులుముకుంటూ బిక్క ముఖంతో ఆమె వెనగ్గా నడుస్తూవచ్చాడు.

"ఏమయింది?" అన్నాను పరిస్థితి కొంత ఊహిస్తూ.

"లైంఫిక్స్ చేసి సరిగ్గా ట్రక్కు కిందకు బాంబ్ విసిరాను. బాంబు ప్రేలగానే గర్వంగా ముందుకు నడవబోయాడు సులేమాన్. అతన్ని ఓమూలకి పడద్రోసి, నేనోమూల పడ్డాను.

"అప్పటికే ఓ షైరు ఎగురుకుంటూ వచ్చి అతనివీపుకు గ్రుద్దుకొంది. అలా బోర్లా పడివుండక నిలబడివుంటే ఆ షైరు తగలవల్సినచోట తగిలి ఈపాటికి ముక్కూ_, ముఖం ఏకమైపోయివుండేవి." అంది కాన్యోరా, ఆ దృశ్యాన్ని ఊహించుకుని పకపక నవ్వుతూ.

నేనూ నవ్వకుండా ఉండలేకపోయాను.

సులేమాన్ ముఖం, శుభ్రంగా, నీళ్ళతో కడుక్కొ_ని.

"నేనూ ఈసారి బాంబులు వేస్తాను" అన్నాడు బింకంగా,

"అలాగే, కాని__యెలా పేల్తుందో అని దగ్గరగా మోకాళ్ళమీద కూర్చుని చూస్తూ వుండకపోతే" అంది అంది నవ్వాపుకుంటూ కాన్యోరా.

యెవరికీ గాయాలు తగలకుండా శత్రువులను హాతమార్చినందుకు సంతోషంగా, మళ్ళీ గుర్రాల్ని సిద్ధంచేసి, జీపుని ముందుకి పోనిచ్చాను.

* * *

మధ్యాహ్నం రెండుగంటలు దాటింది.

జీపు స్టేరింగ్ కాన్యోరా చేతిలో కదుల్తోంది.

విపరీతమైన యెండ!

వేడిగాడ్పులు...దాని తాలూకు సన్నని శబ్దం. ఈ వేగంలో చీకటిపడినంతవరకూ ప్రయాణిస్తే తప్ప, చైనీస్ స్థావరం చేరుకునే అవకాశంలేదు. ఎందుకంటే యెడారి యిసుకలో స్పీడ్ నడపటం యెంతో కష్టం. పైగా వేడిమికి డ్రయివర్ స్థానంలో పనిచేయలేం.

ఉన్నట్టుండి వెనుక సీట్లోంచి బీప్ బీప్ మన్న శబ్దం వినవచ్చింది.

శానోస్యేరా పక్కకి తిరిగి "మేజర్! మెస్సేజ్" అంది ఆత్రుతగా.

వెనకసీట్లో సులేమాన్ ఒళ్ళో పెట్టుకున్న వైర్‌లెస్ సెట్‌ని అందుకుని సెట్‌ని ఆన్ చేసాను.

"హలో, హలో, కాలింగ్ N.W.O. సూడాన్... ఈజ్ దట్ డిసెర్ట్ హంటర్స్? ఈజ్ దట్ డిసర్ట్ హంటర్స్?"

"ఎస్, డిసెర్ట్ హంటర్స్ దిస్‌సైడ్, హలో ప్లీజ్ ప్రొసీడ్"

"వేర్ ఆర్యూ."

"స్టిల్ ఆన్‌దివే, రాత్రికి చేరతాం."

"హవ్ ది థింగ్స్ ఆర్ గోయింగ్?"

"ఓ.కే. అన్‌ఫార్చునేట్లీ, ఆల్రెడీ ఫేస్డ్ వన్ ఎటాక్. వివరాలు యింపార్టెంట్ కాదు."

"ఓ.కే. ఒకవార్త."

"ప్లీజ్ ప్రొసీడ్."

"రేడియోలో యిప్పుడే వార్తలు వచ్చాయి. మావో ఈజ్ డెడ్. ఐ, రిపీట్...చైనీస్ నాయకుడు మావో మరణించాడు. ఇది మీకు ఉపయోగపడొచ్చు. మీరు వెళ్ళబోయేస్థావరంలో ఈరోజు తీవ్ర సంతాపం మెయింటైన్ చేస్తారు. కట్టుదిట్టాలు కొంచెం సడలింప బడవొచ్చు. ఈ వాతావరణాన్ని వినియోగించుకొండి. కార్యం సాధించండి" అన్న నైరోబీమాటలు విన్పించాయి.

"థాంక్యూ ఫర్ దిన్యూస్. ఇట్ విల్ బి హెల్ప్‌ఫుల్" అన్నాను సంతోషంగా.

"ఫ్రాన్సీస్ ది జర్నీ. అవసరమైతే కాల్ చెయ్యండి. మీ యోగక్షేమాలు యెప్పటికప్పుడు తెలియపర్చండి. ఓవర్ అండ్ యెండ్."

లైన్ కట్ అయింది. సెట్ ఆఫ్ చేసి వెనక సీట్లోని సులేమాన్ కందించాను.

విషయం అర్థమైన శాన్యోరా, విజయ సూచకంగా నవ్వింది.

మధ్యాహ్నం మూడు గంటలవుతుండగా ... ఉన్నట్లుండి వాతావరణంలో వేడి తగ్గిపోయింది.

ఎడారినంతా మేఘాలు చరచరా గొడుగులా కప్పేసాయి ఆకాశంలో.

రయ్యిన చల్లగాలి ఉధృతమై, మరో రెండు నిముషాల్లో దడదడా వర్షం కురవసాగింది.

జీపు ముందుభాగంమీద పెద్ద శబ్దంతో వర్షం మొత్తుతోంది.

ఆకాశంలో యుద్ధం జరుగుతున్నట్లు ఏదో బలమైన శక్తులు ఢీకొన్నట్లు ఉరుములు...

ఆకాశంలో రాక్షసుల ఆయుధాలు ఢీకొనగా వెలువడే నిప్పురవ్వల్లాంటి మెరుపులు!

అనుమానంతో చటుక్కున వైర్ లెస్ ఆన్ చేసాను.

"మధ్యాహ్నం—చర్రున కాల్చివేసే ఎండలో అకస్మాత్తుగా శీతలవాయువులు వీచి వర్షం కురవడమేమిటి?" ప్రశ్నించాను నైరోబీని.

"చైనీస్ సైంటిస్ట్ హోయాంగ్ హో తన ప్రయోగాల్లో ఉన్నట్టుమాత్రమే యిప్పటిపరకూ మనకందిన

ఇన్ ఫర్మేషన్. సందేహంలేదు. అది హోయాంగ్ హో ప్రయోగ ఫలితం. ఈ రోజున అతను సక్సెస్ పొందాడు- మీరు చూస్తోన్న వర్షం, మీరు చవిచూస్తోన్న చల్లని గాలి మేధావి హోయాంగ్ హో సృష్టించినవే! అతను సాధించిన ఫలితం!

"కానీ మైడియర్ బోయ్ పాపం ఈ విజయాన్ని చైనీయులు సంతోషిస్తారో? అటుప్రక్క మావో పోయినందుకు విచారిస్తారో? మాటర్ ఆఫ్ కో-యిన్సిడెన్స్- నవ్వాలో ఏడ్వాలో తెలియని పరిస్థితిలో ఉండొచ్చు. ఏది ఏమైనా- డూ యువర్ డ్యూటీ"

లైన్ కట్!

నాలో సంతోషానికి అంతులేదు. మానవుడు మొదటి సారిగా ప్రకృతిమీద విజయం సాధించాడు. సో, హోయాంగ్ హో యిన్నాళ్లూ పడుతున్న నిర్విరామకృషి ఫలించింది. ఎడారిలో కుంభవృష్టి కురిపిస్తున్నాడు.

అందరం సిగరెట్లు ముట్టించుకున్నాం.

జీపు అదే వేగంతో కదుల్తోంది.

వర్ష పుజల్లులోపల పడకుండా ఏర్పాట్లుచేసాం. మరో గంట తర్వాత వర్షం టక్కున ఆగిపోయింది.

* * *

అరబిక్ ఎడారి అంతా కటిక చీకటి అలుముకుంది?!

రేడియం డయల్ వాచ్ చూసుకున్నాను.

గంట ఎనిమిది.

మోకాళ్ళమీద కూర్చుని, కళ్ళు, చిట్లించుకొని ముందుకు చూసాను. రెండు ఫర్లాంగుల దూరంలో ఓ

పాడుపడిన బిల్డింగ్! చుట్టూ కొన్ని సైనిక-గుడారాలు. వాటి చార్జ్డ్ చార్జ్డ్ వైర్ ఫెన్సింగ్!

"అదే చైనీస్ స్థావరం" సన్నగా పలికింది శానోర్యా, స్వగతంలా.

భవంతిలో విద్యుద్దీపాలు అర్ధచీకటిని పారద్రోలు తున్నాయి. "డి.సి. కరెంట్ సప్లయ్" అయి వుండాలి.

బైనాక్యులర్స్ కళ్ళముందునుంచి తీసాను. జర్కిన్ జేబులోంచి టార్చిలైట్ చేతిలోకి తీసుకొని "సులేమాన్! ఆ పాడుబడ్డ భవంతి గురించి నీకేమి తెల్సు?" అడిగాను.

"మేజర్ సాబ్! ఎడారి ప్రయాణీకులకి సదుపాయంగా వుండటానికి, విశ్రాంతి గృహంగా దాన్ని, పూర్వం అరబ్ రాజులు కట్టించారని వినికిడి" చెప్పాడు ఎడారి దొంగల నాయకుడు సులేమాన్ — జేబులోంచి ఓ పొడు గాటి చుట్ట తీసి వెలిగించుకుంటూ.

అదే అగ్గిపుల్లతో తన యిద్దరి అనుచరుల నోట్లోవున్న చుట్టల్ని ముట్టించాడు.

"సులేమాన్!" పిల్చాను.

"ఏంటి సాబ్?" అన్నాడు అగ్గిపుల్ల నేలకేసి కొట్టి దమ్ముపీలుస్తూ.

"నువ్విప్పుడు ఏం చేసావ్?" అన్నాను కోపంగా.

"చుట్ట వెల్గించాను. మీ ప్రశ్న నాకు బోధపడటం లేదు."

"మనం యిప్పుడు శత్రువుల స్థావరానికి దగ్గరగా వున్నాం. నువ్వుచీకట్లో కూర్చుని అగ్గిపుల్ల వెల్గించినపుడు ఆ శత్రువు తన రైఫిల్‌నో, మరితుపాకీనో, చేతిలోకి తీసు కుంటాడు...అదే పుల్లతో రెండో వ్యక్తి పుగాకుచుట్ట

ముట్టించినపుడు ఆ వెలుగుకేసి రైఫిల్ని గురిచేస్తాడు. ఇహ అదే పుల్లతో మూడో వ్యక్తి, చుట్ట లేదా సిగరెట్ ముట్టించినపుడు ఏం చేస్తాడో నువ్వే చెప్పు."

"అరమైంది సాబ్! ఫైర్ చేస్తాడు! క్షమించండి."

"అందుకే ఒకే అగ్గిపుల్లతో ముగ్గురు సిగరెట్లు ముట్టించుకోకూడదనే నిబంధన మిలట్రీవాళ్ళలో వుంటుంది. యిప్పుడు మీరంతా, వారికిందే లెఖ్క—" అంటూ ప్రక్కకి తిరిగి —

"శానోర్యా! మనం క్రాలింగ్ చేస్తూ వైర్ ఫెన్సింగ్ చేరుకోవాలి. సాధారణంలో రాత్రివేళ మిలిటరీ స్థావరాల్లో గుండ్రంగా తిరిగే ఫ్లడ్ లైట్ వుండాలి. అయితే యిప్పుడది అక్కడలేదు. బహుశా 'మావో' మరణంవల్ల ఫార్మాలిటీస్ పాటించి వుండరు. అయినా ముందు జాగ్రత్తకోసం, క్రాలింగ్ చేస్తూ పోడం మంచిది.

ఫెన్సింగ్ చేరుకున్నాక — మనకి స్థావరం లోపలి భాగంతో పరిచయంలేదు, సెంట్రీను ఎక్కడ వుంటాడో తెలియదు కాబట్టి నేను ముందుగా లోనికి ప్రవేశిస్తాను. అవసరాన్నిబట్టి 'వాకీ-టాకీ'లో మెస్సేజ్ యిస్తాను. అప్పుడు మీరు చొచ్చుకు రావాలి."

"భయంకర్! ఏమీ తెలియకుండా ముందుగా నువ్వొక్కడివీ శత్రువులమధ్యకి వెడతావా?" భయంగా పలికింది శానోర్యా...

"సే మేజర్! నాట్ భయంకర్! యిప్పట్నుంచీ మీరంతా మిలట్రీ వ్యక్తులుగా ఫీలవ్వాలి-నాయకుడిగా నా ఆజ్ఞలపై-కామెంట్ చేయకూడదు. అండర్‌స్టాండ్" అన్నాను కఠినంగా.

కాన్స్యేరా ఒక క్షణం మౌనం వహించి, బరువుగా నిట్టూర్పు వదిలింది. "ఓ.కే. మేజర్" అంది దృఢంగా తల ఊపుతూ.

"క్రాలింగ్ ఏమిటీ?"—సులేమాన్.

"మనం నడుచుకుంటూ వెళ్ళడంలేదిప్పుడు. మోకాళ్ల మీదా మోచేతులమీదా దేక్కుంటూ వెళ్ళాలి. నడుచుకుంటూ వెడితే ఏమౌతుందో తెల్సా. శత్రువు అటూ ఇటూ తిరుగుతూ, టార్చిలైట్ గబుక్కున వేస్తే కాంతి సూటిగా వచ్చి మన ముఖంమీద పడ్తుంది. మనం కళ్ళు నులుముకునేలోగా మన గుండెల్లో తుపాకీగుండు నాటుకొంటుంది.

అదే క్రాలింగ్ చేస్తూ, పోతే లైట్ కాంతి సాధారణంగా మనమీద పడదు. పడినా అర్థకాంతి. శత్రువు అనుమానంగా, చూసే లోపల మనం కాల్చెయ్యొచ్చు."

"అర్థమైంది సాబ్. చాల చక్కగా చెప్పారు."

"అంతా ప్లైం ప్రకారం జరగాలి. కాన్స్యేరా! మూవ్!" ఆజ్ఞ జారీచేసాను నేలమీదకు వంగి, ముందుకు పాకుతూ.

*  *  *

మోచేతులు, మోకాళ్ళ సాయంతో ముందుకు పాక్కుంటూ పోతున్నాం.

ఎదురుగా—మా అబ్జెక్ట్—ఆ పాడుబడిన భవంతి—అర్థకాంతిలో దూరంగా కనబడుతుండడంవల్లా, అది కేవలం తుప్పలు, రాళ్లు లేని యిసుకప్రాంతం కావడంవల్లా, మేం టార్చిలైట్లు వెల్గించలేదు.

తడి యిసుకమీద చరచరా ముందుకు ప్రాకుతున్నాను. నన్ను ఆ చీకట్లో వెనగ్గా అనుసరిస్తున్నారు శాన్యోరా, ఎడారి దొంగల నాయకుడు సులేమాన్, మరి యిద్దరు అనుచరులూ...

అంతా నిశ్శబ్దంగా వుంది.

ఎంతో అవసరమైతేతప్ప ఎవరినీ నోరు తెరవద్దని శాసించాను.

ఒకోక్కసారి యిసుక గుట్టలను చూసుకొని జాగ్రత్తగా వాటి ప్రక్కనుంచి కదుల్తున్నాం.

చైనీస్ స్థావరం చూట్టూ వున్న వైర్ ఫెన్సింగ్ యింకా నలభై గజాల దూరంలో వుండగా, ఆ నిశ్శబ్ద నిశిధిలో సులేమాన్ కంఠం భయంగా, గాభరాగా విన్పించింది.

"సాబ్! నా రెండో అనుచరుడు ఖాసిం మనవెనుక లేడు." సులేమాన్ వణుకుతున్న కంఠం విని టక్కున ఆగి, వెనక్కి చూసాను చీకట్లోకి.

శాన్యోరా, సులేమాన్, మరో అనుచరుడి ఆకారాలు అస్పష్టంగా కన్పిస్తున్నాయ్.

"వాట్ ది హెల్ హాపెండ్! అసలేమైంది?" కోపంగా, సన్నగా గొణిగాను.

"సాబ్! ఎవరి మట్టుకువాళ్ళం దీక్షగా ముందుకు క్రాలింగ్ చేస్తున్నాం. ఉన్నట్లుండి నా వెనుక అనుచరుడు ఖాన్ తట్టి ఆపాడు. ఖాసిం వెనక కదలడం లేదని అనుమానంవచ్చి పిల్చానని చెప్పాడు" సులేమాన్.

"జీసాబ్! ఓ నిముషం క్రిందటివరకూ అతని అలికిడి వెనగ్గా వినబడేది. ఎందుకో అనుమానంవచ్చి, చూసేసరికి ఖాసిం ఆకారం మాయమయింది"—అన్నాడు ఖాన్.

"వెనక్కి పదండి."

మినీ టార్చిలైట్ వెల్గించి, చేతివేళ్ళు కాంతికి సగం అడ్డంపెట్టి, వేళ్ళమధ్యనుండిప్రసారమయ్యే గుడ్డికాంతితో అంతకుముందు మేము క్రాలింగ్ చేసిన ప్రాంతాన్నంతా వెతకసాగాను. వో పదిహేను గజాల వెనుక ఖాసిం కనబడ్డాడు, యిసుక నేలమీద పడి అర్ధ కాంతిని అతని ముఖంమీదనుండి, మెడమీదనుండీ, ఛాతీవరకు ప్రసారం చేసాను. అంతే, నాగుండెలు ఝల్లుమన్నాయి. ఖాసిం అప్పటికే మరణించాడు.

అతని నోట్లో నురగలు కనబడ్డాయి.

అతనిని ఏపామో కర్చి వుంటుంది.

నిశ్చేష్టుడనై అలా వుండిపోయాను.

సులేమాన్ కంగారుగా అతని శరీనమంతా తడిమాడు.

"సాబ్! 'సాకీ' అనబడే భయంకరమైన ఎడారిపాము ఖాసిం మెడమీద కాటువేసింది. ఈపాము కరిస్తే వెంటనే విషం ఎక్కుతుంది. నోరు పెగల్దు. నా కుడి ఖాసిం యిక లేడు." ఎడారిదొంగల నాయకుడు సులేమాన్ కంఠంలో— ఆవేదనా జీర స్పష్టంగా వినబడింది.

శాన్యోరా ఏం మాటాడ్డంలేదు.

"సులేమాన్! దయచేసి గట్టిగా మాట్లాడొద్దు. నిన్ను నువ్వు కంట్రోల్ చేసుకోవాలి." యింకా ఏదో అన బోతుండగా—

(సశేషము)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్ట చివరిబొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి ఈ నెల 10వ తేదీ లోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరుకూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## "హోం డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యత్వము తీసుకుంటే, మీకు కాపీలు గ్యారంటీగా చేరుతాయి. పైగా పత్రిక ఖరీదులో కొంత తగ్గింపు లభిస్తుంది.

సభ్యత్వం కోసం మీరు రు. 5/-లు పంపండి. మీకు ప్రతినెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 5/-లకే వి.పి. ద్వారా పంపబడతాయి.

